సంక్రాంతి సంచిక




ANDHRAPATRIKA ILLUSTRATED WEEKLY.

# పూర్ణా పిక్చర్స్ వారు

సంక్రాంతి అభివందనాలతో నూతన సంవత్సరమునకు
సమర్పించు తెలుగు చిత్రాలు.

ప్రతిభా వారి
**దొంగలున్నారు**
జాగ్రత!
జగ్గయ్య - జి.వరలక్ష్మి.
గిరిజ. సియస్.ఆర్.. గుమ్మడి.
దర్శకత్వం.. బి.యన్.ఆర్.

విజయగోపాల్ వారి
**గంగా గౌరి**
**సంవాదం**
ఛాయాగ్రహణం, దర్శకత్వం
వి.యన్. రెడ్డి.

పొన్నలూరి బ్రదర్స్ వారి
**శోభ**
అంజలి. N.T.రామారావు. రేలంగి.
దర్శకత్వం.
కె. కామేశ్వరరావు. B.A.

రాయల్ స్టూడియోస్ వారి
అద్భుత చిత్రం
**దేవసుందరి**
జానకి. కాంతారావు. రాజనాం
శివరావు. సీత.

లక్ష్మీప్రొడక్షన్స్ వారి
**కొడుకులు కోడళ్లు**
**భీమసేన**
దర్శకత్వం ప్రసాద్.

సాహిణీ ఆర్ట్స్
**బండ రాముడు**
ఎన్.టి.రామారావు. సావిత్రి
రేలంగి.
దర్శకత్వం పి.పుల్లయ్య.

బసంత్ పిక్చర్స్
**రామభక్త**
**హనుమాన్**
మాటలు పాటలు, శ్రీ.శ్రీ
దర్శకుడు.. బాబూభాయ్ మిస్త్రీ






పూర్ణాపిక్చర్స్ (ప్రైవేట) లిమిటెడ్.,
విజయవాడ, సికింద్రాబాద్, గుంటకల్.
విశాఖపట్నం, మద్రాసు.

# ఒక మాట

★

ఏటేటా సంక్రాంతి పండుగ సందర్భంలో సచిత్ర వారపత్రిక రచనావ్యాసంగానికి సంబంధించిన ఒక పోటీ ఏర్పాటు చేస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. గత ఏడాది ఉత్తమ డిటెక్టివ్ కథారచనకు, వనితల అలంకరణ పద్ధతులకు, ముగ్గులకు ప్రాధాన్యం ఇచ్చాము.

గ్రహాంతరయాత్రద్వారా విశ్వ విజయానికై మానవుడు తన ప్రయత్నాలలో గత మూడు నాలుగు నెలల్లో సాధించిన అత్యద్భుత పరిణామాల దృష్ట్యా ఈ సంవత్సరం కథారచనకు 'చంద్రలోక యాత్ర' అన్నది ఉత్తమ ఇతివృత్తం కాగలదని భావించి తదనుగుణంగా పోటీ నిశ్చయించాము. పెట్టిన గడువులోపల దాదాపు 170 కథలు వచ్చినవి. ఈపోటీలో పెద్దలతో పాటు కొంతమంది బాలురు, 40 మంది స్త్రీలు కూడా పాల్గొని కథాంశం పట్ల తమ ఉత్సాహాభిమానాలను వ్యక్తపరిచారు.

ఇది హర్షించవలసిన సంగతే. అయితే, ఒక విషయం. సంఖ్యకు 170 వరకూ కథలు వచ్చినప్పటికీ, మొత్తంమీద ఈ పోటీ రచనలు మాకు కొంత నిరుత్సాహమే కలిగించినవని చెప్పవలసి వస్తున్నది. నిర్ణయించిన కథాంశం రచయిత తన కల్పనాశక్తిని ప్రదర్శించడానికి విస్తృతావకాశం ఇవ్వగలదని భావించాము, కాని అది లోపించిందేమో ననిపిస్తున్నది.

ఉన్నంతలో ఉత్తమమైనదని మాకు తోచిన కాళ్లకూరి శేషగిరి రావుగారి కథను బహుమతికి నిర్ణయించడం జరిగింది. వారికి ఇవే మా అభినందనలు.

సినిమా పరిశ్రమకు, కళకు ప్రాధాన్యమిచ్చి ఈ ప్రత్యేక సంచికను సాధ్యమైనంత ఆకర్షవంతంగా తయారుచేయడానికి ప్రయత్నించాము. మా కృషిలో సహకరించిన రచయితలకు హృదయపూర్వక కృతజ్ఞత తెలియజేస్తున్నాము.

సంక్రాంతి సమయంలో పాఠకలోకానికి ఇవే మా శుభాకాంక్షలు.

—ఎడిటర్]

# 1957

## ఒక సమీక్ష

భారతదేశ చరిత్రలో "57" వ సంవత్సరానికి మొదట్నించీ ఏదో ప్రాముఖ్యం ఉంటూనే వచ్చింది. 1557 లో ఢిల్లీ సింహాసనాన్ని సుస్థిరంగా నిలుపుకోడానికి అక్బరు చేసిన పోరాటాలు; 1657 లో షాజహాను అస్వస్థుడుకాగా ఢిల్లీ సింహాసనంకోసం జరిగిన మొగల్ వారసత్వయుద్ధం; 1757 లో ప్లాసీ యుద్ధం; 1857 లో బ్రిటిష్‌వారిపై తిరుగుబాటు.

1957 మిగతా 57 లకేమీ తీసిపోలేదు. కావలసినంతఘర్షణ, అశాంతి, ఉద్యోగుల తిరుగుబాటు!

దేశవ్యాప్తమైనఎన్నికలతో 1957 ప్రారంభమైంది. భారతనాయకుడుగా శ్రీ జవహర్లాల్ నెహ్రూపై ప్రజలు విశ్వాసం ప్రకటించారు. కమ్యూనిస్టు ప్రభుత్వం దేశంలో అడుగు పెట్టింది. దీని తాలూకు సాంఘిక, రాజకీయ ఫలితాలు ఎలా ఉంటాయో వేచి చూడాలి. 1857 లో తూర్పు ఇండియా కంపెనీ ఉద్యోగులు యజమానులపై తిరగబడినట్లే, నూరేళ్ళతరవాత ఉద్యోగులు కేంద్ర ప్రభుత్వంపై తిరుగుబాటుచేయడానికి సిద్ధపడ్డారు. నాడూ నేడూ ఉద్యోగపరిస్థితులపై అసంతృప్తే అశాంతికి ముఖ్యకారణం. హిందీకి, మిగతా భారతీయభాషలకీ దెబ్బలాట రేగింది. ఆహారంకొరతమూలాన ప్రజల్లో అలజడి రేగింది. రెండవ పంచవర్ష ప్రణాళిక ఇబ్బందుల్లో పడింది. విదేశీద్రవ్యాభావంవల్ల కొరడు తభావలు ఏర్పడ్డాయి. పొదుపు, పొదుపు అని ఒకటేనినాదం మారుమ్రోగిపోయింది. కష్టపడి పని చెయ్యడమంటే ఉపన్యాసాలు దంచడమని అర్థం తేలింది. క్రమశిక్షణ అరాజకంగా పరిణమించింది. "మానవకారుణ్యం" పేరుతో విధినిర్వహణం దెబ్బతిన్నది. ప్రజాస్వామ్యం అంటే ప్రజాపరిపాలనఅనికాక సహజీవనమని కొత్త అర్థం బయలుదేరింది. మంత్రివర్గం క్లబ్బులాగా, మంత్రులు ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకోడంగా తయారైంది; మంత్రివర్గానికి సమష్టిబాధ్యత ఉందిగాని సమష్టినిర్ణయాలు లేకుండాపోయాయి.

స్వాతంత్ర్యం లభించినవాడికి వివేచన ఉండదంటారు. రెండవ పంచవర్షప్రణాళిక చూస్తే ఇది నిజమనిపిస్తుంది. విదేశాల దయా దాక్షిణ్యాలమీద ఎక్కువ భాగం ఆధారపడితే గాని నెరవేరని ఆర్థికప్రణాళికను భారతదేశంతప్ప ఇంతవరకూ ఏ నాగరిక దేశమూ తయారుచేసుకోలేదు.

ప్రణాళికకోసం భారతదేశం స్వయంగా పోగుచేసుకున్న డబ్బు 1956 లో రూ. 850 కోట్లుమాత్రమే. ఈ డబ్బు పునాదిమీద కనీసం రూ. 4800 కోట్లు ఖర్చు పెడితేనే గాని పూర్తికాని ఒక బ్రహ్మాండమైన ప్రణాళికాసౌధం నిర్మించ నిశ్చయించారు భారతభాగ్యవిధాతలు. నిశ్చయించి "ప్రణాళిక మునిగితే మునుగుతాం; తేలితే తేల్తాం" అని పాట ప్రారంభించారు. ఈపాటకి నేపథ్యసంగీతంగా, 'ఏ సంవత్సరపు ప్రణాళికలో ఆసంవత్సరం కాస్తకాస్త తగ్గించాలి" అని మొదలుపెట్టారు. ప్రణాళికకల్లా ముఖ్యమైన భాగాలను నిర్వహించాలన్నా రూ 700 కోట్ల దాకా విదేశీద్రవ్యం అవసరమయ్యేట్లు కనిపించింది. గొప్పకోసం ప్రాకులాడడం వల్లనే సరియైన నిర్ణయాలు చేయలేకపోయారు. ఇప్పుడు మొహం చెల్లకపోవటం వల్లనే పిండికి తగటుగా రొట్టెను తగ్గించుకోవడానికి వెనకాడుతున్నారు.

**శ్రీ కృష్ణ**
[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

భారతదేశం ఆర్థికంగా వెనకబడిన దేశం. అవునా! కాని కార్మిక శాసనాల విషయంలోను, సాంఘిక సంక్షేమ కార్యక్రమాల విషయంలోను, బాగా భాగ్యవంతమైన దేశాలతో సమానస్థాయిలో ఉంటోంది. అంతర్జాతీయ వ్యాపార, సుంకాల జనీవా ఒప్పందం (జి. ఎ. టి. టి.) సమావేశాల్లో భారతీయ ప్రతినిధులు తమదేశం వెనుకబడిన దేశం కనుక ఏవేవో రాయితీ లివ్వాలని ఒత్తిడి చేస్తారు. మరోవంక ఆదే జనీవాలో మరో భారతీయ ప్రతినిధివర్గం తమదేశంలో బ్రిటన్‌తో పోల్చదగిన అత్యంత నవీన పద్ధతుల్లో కార్మికశాసనాలు, సాంఘిక శ్రేయః కార్యక్రమాలు ఉన్నాయని గర్వంగా చెప్పుకుంటుంది. రష్యా, జపాన్ మొదలైన దేశాలు ఏదోవిధంగా ప్రజల్ని బాధపెట్టి పారిశ్రామికాభివృద్ధి సాధించాయి. భారతదేశంమాత్రం ఎవరికీ నొప్పిలేకుండా అభివృద్ధి సాధించాలనీ, పైనాకంటే త్వరగా అభివృద్ధి కావాలనీ ఆశ పడుతోంది. ఆశపడితే పడవచ్చునుగాని, కష్టపడి పని చెయ్యాలనే మనస్తత్వమూ, క్రమశిక్షణా దెబ్బతిన్నాయి.

1957 లో భారతదేశపు సంస్కృతి కూడా అమోఘంగా అభివృద్ధి అయింది. సంస్కృతిని ఇంగ్లీషులో 'కల్చర్' అంటారు. కల్చర్‌కు అర్థం ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీలో "విద్యవలన, శిక్షణవలన అభివృద్ధిని, సంస్కారమును సాధించుట" అని ఉంటుంది. "మనస్సు, అభిరుచులు, అలవాట్లు సుశిక్షితములై, సుసంస్కృతములగుట" అనికూడా అర్థం. గడచిన పదేళ్లలో భారతదేశపు కల్చర్‌ను అభివృద్ధి చేయడానికి కోట్లకొలదిధనం వెచ్చించారు. శీతకాలములో న్యూఢిల్లీలో ఎక్కడచూసినా నిర్విరామంగా నాటకాలు, నృత్యాలు, గానసభలు హోరెత్తి పోతూంటాయి. చిత్రకళా, ఛాయాచిత్రకళా, జానపద నృత్య ప్రదర్శనాలు జరుగుతాయి. జాతీయ వస్తుప్రదర్శన మందిరం తయారులో ఉంది. జాతీయ నాటకశాల ప్లానింగ్‌లో ఉంది. నిజమే—కాని మరోప్రక్క సంస్కృతికి సంబంధించిన చిహ్నాలన్నీ ధ్వంసమై పోతూనూ ఉన్నాయి.

న్యూఢిల్లీలో అందమైన పచ్చిక పట్టులు పాడయ్యాయి. రోడ్లపక్క చెట్లు నాశనమయ్యాయి. కేంద్ర సచివాలయం కబాడీ బజారులా తయారైంది. ఇంకా ఇలాటి ఉదాహరణ లెన్నో!

స్వప్రయోజనాలకోసం పిల్లల్ని వాడుకోవడం కూడా గత సంవత్సరపు విశిష్టతలలో ఒకటి. ప్రధానమంత్రి తన జన్మదినం నాడు ఒక పూటంతా పిల్లలతో కాల

...రారు. ఆయన మహాత్మా శ్రీమతి ...ంధీ పిల్లల సంక్షేమానికి చాలా ...ృషి చేస్తోంది. ఇదంతా చూసి పిరుదులలో నం పోకులా జేవారు పిల్లల భుజాలపై భారీ ఎత్తున అంభారీలు వేసి పేరుకోసం ఎగ్రశాకడం సాగించారు. ఇటీవల ఒక జన్మదిన సందర్భా నికి లారీనిండా పిల్లల్ని తీసుకొచ్చారు. ఆ పసికందుల్ని మంచినీళ్ళు కావాలా అని అడిగే దిక్కు కూడా లేదు. అంతగా ఏ పిల్లా డైనా "బొబ్బ" అని ఏడిస్తే తోటలోని ఒక కొలనునుంచి తవపోయుని నీరు పట్టించారు. దీనిపై వేరే వ్యాఖ్యదేనికి?

* * *

1957 లో కల్లా విప్లవాత్మకమైన అంశం కమ్యూనిస్టు ప్రాజెక్టులట. దీనికి లెనిన్‌లాంటి వాడు శ్రీ ఎస్. కె. డే. భారతప్రభుత్వం రెండు స్తంభాలమీద. ఒక స్తంభం కృష్ణ మాచారి. మరో స్తంభం ఎస్. కె. డే.

గత సంవత్సరం కాంగ్రెస్ పరిపాలకులు రెండు కమిటీలు వేశారు. ఒకటి శ్రీ అశోక మెహతా అధ్యక్షతన ఆహారధాన్యాల సంఘం. మరొకటి శ్రీ బల్వంతరాయ్‌గోపాల్జీ అధ్యక్షతన ప్రణాళిక ప్రాజెక్టుల సంఘం. ఈ రెండు సంఘాలూ స్వతంత్రంగా విచారణలు జరిపి కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణంపై ఘాటైన విమర్శలు చేశాయి. ఏనుగుపోతుంటే కుక్కలు మొరుగుతాయట. మొరిగితే ఏనుగు కేంలెఖ్ఖ! కమ్యూనిటీ ప్రాజెక్టులు బ్రహ్మాండంగా పనిచేస్తున్నాయనే ప్రభుత్వం అను కుంటోంది. శ్రీ అశోకమెహతా సోషలిస్టు అందుకని గ్రామాల్లో కాంగ్రెసు బలపడడం ఆయన కిష్టంలేకనే అలా అన్నారేమో! శ్రీ బల్వంత్ రాయ్‌గోపాల్జీకి డబ్బు పొదుపు చెయ్యాలనడం తప్ప ఇంకేమీ అక్కర్లేదు. అందుకనే అలా విమర్శించారేమో!

గ్రామాల్లో ఈనాడు 1½ లక్షమంది కమ్యూనిటీప్రాజెక్టు పనివారు ఉన్నారు. 1961 నాటికి వీరి సంఖ్య 8 లక్షలదాకా పెరగవచ్చునట. కాంగ్రెసుకి మేధావుల్లో పలుకుపడిపోయింది. ఈ సంగతి కాంగ్రెసు నాయకులే ఈమధ్య ఒప్పుకున్నారు. కనక గ్రామప్రజలమీదనే కాంగ్రెసు ఆధారపడి ఉండాలన్నమాట. దేశాన్ని కమ్యూనిజం నుంచి రక్షించడానికి గ్రామస్థాయిలో పని వారిద్వారా డబ్బు విచ్చలవిడిగా వెచ్చించడం ఒకమార్గం అన్నమాట.

* * *

ఒక సంవత్సరం వళిపోతోంది,
మరో సంవత్సరం వస్తోంది.
పాతదాన్ని పోనియ్,
కొత్తదాన్ని రానియ్.
చీకుచింతల్ని పోనియ్,
అధికారగర్వాన్ని
అభిజాత్యమదాన్ని
ద్వేషాన్ని, రోషాన్ని
పోనియ్, పోనియ్!
అసత్యాన్ని పోనియ్,
సుసత్యాన్ని రానియ్.
మధుర తర వర్తనాన్ని, ధర్మప్రవర్తనాన్ని
ఉత్తమోత్తమ జీవితాన్ని రానియ్.
సత్యనిరతినీ, న్యాయపరతని రానియ్.
చెదరనీయని, తలవంచని పౌరుష్ని,
కరుణామయహృదయుణ్ణి రానియ్.
సహ్ర ప్రార్థాల కాంతినీ
సంక్రాంతినీ రానియ్! రానియ్!

★

...్యమికిని గొబ్బిళ్లో!

బృందగానం

కొండ గొడుగుగా గోవులగాచిన
కొండిక శిశువుకు గొబ్బిళ్లో!
దుండగంపు దైత్యుల కెల్లను కల
గుండు గండనికి గొబ్బిళ్లో!

లక్ష్మి

దండి వైరులను తరిమిన వీరుల
గుండె దిగులునకు గొబ్బిళ్లో!
వెండి పైడియగు వెంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో!"

బృందగానం

గొబ్బిళ్లో! గొబ్బిళ్లో!!

లత

చూచితిర ఓయమ్మలారా
మా వదిన
చోద్యంపుపాట విన్నార!
మాధవుడు లేనిదే
మన లేదు మాయింట!
గొబ్బిళ్ళ పాటలో
గూడ మాధవుడంట! చూ-చి!

లక్ష్మి

అమ్మలారా మీరు నమ్మబోకండి!
ఎగతాళి మా మరదలికి సహజమండీ!
ఆమె అన్నయ్య ఈ
యవసరమ్మున లేడు
గాని అన్నిట యీమె
కతడు తోబుట్టువే!

లత

మా వదిన వర్ణనలలో వాసిగాంచినది
తెలియ దీవిషయమ్ము పొలతిలారా మీకు
మా వదిన యలుక మటుమాయమైపోలేదు
చదువు నింకొకపాట సంక్రాంతిపాట.

బృందగానం

గొబ్బియల్లో! గొబ్బియల్లో!!

లక్ష్మి

"చందమామ! చందమామ!
ఓ చందమామ! ఓ చందమామ!!
చందామామకు పిల్లా లెందరు?
నీలాగిరి కన్యాలందరు
నీలాగిరి కన్యాలకు నిత్యమల్లెతోట!
నిత్యమల్లెతోటలోన మంచినీళ్ళ
బావులంట
మంచినీళ్ల బావులకు మల్లెల తాడు!
మల్లెల తాడునకూ గిల్లకల్ల చెంబూ"

బృందగానం

గొబ్బియల్లో...గొబ్బియల్లో...

వాయుగానం

గొబ్బిపాటలా కోలాహలము
కోడిపుంజులా ఘోరావేశము
గంగద్దుల మెడగంటలనాదము
బాలబాలికల ప్రగాఢమోదము
తెలుగుటూళ్ళలో ప్రతిధ్వనించెను.
తెలుగు నేల సంక్రాంతి రహించెను.

* * *

గంగద్దులవాడు

డూం డూం బసవన్నా!
డూం డూం బసవన్నా!
అయ్యగారికీ దండం పెట్టు
అమ్మగారికీ దండం పెట్టు
పట్టుకోకలు పెడతారు
పైడిముత్యాలు కడతారు
డూం డూం బసవన్నా!
డూం డూం బసవన్నా!
శివుని మాటలకు శిరసాడించి
పార్వతి మురియగ పరుగులు దీసి
వెండికొండపై వెలసిన బసవా!
నందిదేవరను పోల్చిన బసవా!
డూం డూం బసవన్నా!
డూం డూం బసవన్నా!
ముందుకాళ్లతో మొక్కరించరా
వెనుకకాళ్ళపై నిలిచియుండరా
దొరగారొసగే జరీవస్త్రముల
విరాన మూపున ధరించరా. ||డూం||

లత

నందిదేవరను పోల్చిన బసవా!
దయతో ఆటను రక్తించవయా!
మా వదినగారు మామంచివారు
పట్టువస్త్రమును బహూకరింతురు.

లక్ష్మి

ఓ బసవయ్యా! ఓ బసవయ్యా!
ఒక్క నిముసమే నిల్చవయ్యా!
మా మరదలి అన్నయ్యగారి కా
ర్యము చాలునను మీ కొసంగదను.

మాలతి

ఇంకొక నిముష మాగు బసవయ్యా!
ఎట్లాగయినా నిల్చొంటే నా
చెల్లెలి వదినకు తల్లిగారిడిన
పట్టుచీర నే బహూకరింతును.

గంగద్దులవాడు

డూం డూం బసవన్నా!
దొరగారిది మా దొడ్డ చేయిరా!
అమ్మగారిదీ అమృతహస్తమే!
ధనధాన్యాలతో ఘనముగ మీరూ
కలకాలము వర్ధిల్లారె!
మీ
చ్చగాళ్ళ కడుపులు నిండారా.

వాయుగానం

సంక్రాంతి శుభోదయ వేళా
హా
మంతరమూ జీవనహేల!





# చంద్రలోకయాత్ర



బహుమతి కథ:

కాళ్లకూరి శేషగిరిరావు

"రెండు ఖూనీలుచేసిన నేరానికి వారంటునుతప్పించుకుని గతమూడేళ్ల నుంచి దేశంలోని పోలీసుదళాన్ని ముప్పు తిప్పలుపెట్టి ఎన్నో అత్యాచారాలుచేసిన దొంగరాముడికి ఉరిశిక్ష విధించబడమైనది. ఇంకొక వారంరోజులలో ఇతడు ఉరితీయబడతాడు" అంటున్న జడ్జి తీర్పువాక్యాలు నా కుడిచెవిలోంచి ఎడమచెవిద్వారా ఆకాశంలోకి దూసుకు వెళ్ళిపోయాయి. న్యాయాన్ని తప్పించుకు తిరిగేవాళ్ళకి పక్కలో బల్లెమవడం, చాటునఉండి లోకానికి అపకారంచేసే ఘరానామనుష్యులని బయటికి తేవడం, ఎంతో తెలివిగా నాపైమోపిన నేరాల్ని తప్పించుకొని, నా నిర్దోషిత్వాన్ని నిరూపించుకోడానికి ప్రయత్నిస్తూ పరిస్థితుల ప్రాతికూల్యంవల్ల నా బ్రతుకుకోసం తమాషా కార్యాలుచేయడం నేను చేసిన అత్యాచారాలు అయ్యాయి. నాకు ఉరిశిక్ష పడడంవల్ల సంతోషించేవాళ్లెంతమందున్నా, విచారించేవారు కూడా ఉన్నారులే అనే ధైర్యంతో చిరునవ్వుతో రక్షకభటులమధ్య బోనులోంచి దిగాను.

ఇంకొకవారంలో ఈ తుచ్ఛజీవితం అంతమౌతుంది...ఇంకా ఆరు రోజులు...ఐదు రోజులు...నాలుగు రోజులు. అ, ఏమిటది! ఖైదు తలుపుదగ్గర తాళం చప్పుడవుతోందేం! కొళ్ళలా సాగుతున్న రొట్టెలుతిని వార్డరిచ్చిన మురికినీళ్ళతో దాహం తీర్చుకొని ఇంకా రెండుగంటలన్నా కాలేదే! అదిగో ఎందుకో సబిన్స్పెక్టర్‌గారు వస్తున్నారు. 'నడు బయటికి' అనే కేకతో ఉలిక్కిపడి ఖైదు బయటికివచ్చి అక్కడున్న ఇంకో అర్దరితో కలిశాను. ఇంకా నాలురోజుల వ్యవధి ఉందనుకున్న శుభముహూర్తం అప్పుడే వచ్చేసిందా అనుకుంటూ, తక్కినవాళ్ల సంకెళ్ళచప్పుడుతో శ్రుతికలుపుతూ ఇవతలికి వచ్చాను.

విజిటర్ల గదిలో నలుగురు పెద్దమనుష్యులు కూర్చొని ఉన్నారు. సబ్‌ఇనస్పెక్టరుగారు వాళ్ళందరికీ వందనం సమర్పించి మాలో ఒక్కొక్కర్ని చూపిస్తూ, 'ఇతడు రతన్ సింగ్ బి. ఎ., ఇతడు రమేష్ బి. ఎ., ఇతడు రామారావు బి. ఎస్. సి." అంటూ మమ్మల్నందర్నీ పరిచయం చేశాడు.

ఆ తర్వాత ఓ పెద్దమనిషి లేచి మాలో ఇలా అన్నాడు: "మీరందరూ ఘోర నేరాలుచేసి ఇంకో వారంలోగా ప్రాణాలు పోగొట్టుకోబోతున్న దౌర్భాగ్యులు. కాని మీకు ఇంతకన్నా ధైర్యంగా ప్రాణాలు పోగొట్టుకొనే అవకాశం ఇవ్వడానికి మేము ఇక్కడికి వచ్చాము. మా ఎటామిక్ రిసర్చి ఇన్స్టిట్యూట్‌వారు చంద్రగ్రహానికి ఇప్పటికి ఏడురాకెట్లు పంపించారు. వాటన్నిటిలోనూ కుక్కల్ని, కుందేళ్ళనీకూడా పెట్టారు. ఈరాకెట్లలో ఐదు భూవాతావరణం దాటకుండానే నేలమట్టమై భస్మపటలం అయిపోయాయి. తక్కినరెండూ, ఏమైనాయో పత్తాలేదు. వాటిలోంచి సిగ్నల్సు ఒకటి రెండు గంటలసేపు వచ్చి ఆగిపోయాయి. ఇప్పుడు ఆ విధమైన పరిశోధనలు మాకు ఉపయోగించవనీ, మనుష్యులే రాకెట్లలో వెళ్లాలనీ నిశ్చయించాము. ఇలాంటి పరిశోధనల్లో ప్రాణం కోల్పోవడానికి సైతం సిద్ధపడేవారు కొంతమంది ఉన్నా, ఇప్పటివరకూ జరిగినవాటినిబట్టిచూస్తే విలువలేని ప్రాణాల్నే ముందు త్యాగంచేయడం మంచిదని మాకు తోచింది. అందుకే మీవద్దకు వచ్చాము. ఎందుకూ పనికిరాకుండా ఉరిశిక్షపొందడంకన్నా ఇలాంటి పరిశోధనల్లో

...ణాన్ని త్యాగంచేయడం మీకూ మంచిదే. మరణశిక్ష పొందినవారికి అదే ఇంకోవిధంగా ఇచ్చినట్లుంటుంది కాబట్టి మాకూ బాధలేదు. దీనికి ఇష్టపడి ముందుకు వచ్చేవారికి మేము తయారుచేసిన కొత్త రాకెట్లు నడపడంలో తగిన శిక్షణ ఇచ్చి పైకి పంపిస్తామని మాత్రం చెప్పగలను."

ఈ మాటలు వింటూంటే అగాధంలోకి పడిపోతున్నవాడికి పట్టుకొమ్మ దొరికినట్టయింది నాకు. అదీ చందనపుకొమ్మ! నా బరువు ఆనగానే విరిగిపోయినా దానితోపాటు నేలపాలైన నాకు దాని విలువన్నా దక్కుతుంది గదా అనే తృప్తికలిగింది. అయనమాట్లాడ్డం ఆపగానే 'నేను తయార్' అంటూ సంకెళ్ల గలగలతో ఒక అడుగు ముందుకు వేశాను. ఇంకో రెండు నిముషాల్లో రతన్‌సింగూ, విశ్వేశంకూడా నాతో కలిశారు. తక్కినవారుమాత్రం ఆశపడి దుర్మరణంపొందడంకన్నా, తాపీగా ఉరిశిక్ష అనుభవించడమే మంచిదనుకున్నారు కాబోలు, మాట్లాడక ఊరుకున్నారు.

## 2

దాదాపు నెలరోజుల్లో రాకెట్ నడపడం, సిగ్నల్స్ ఇవ్వడం పూర్తిగా నేర్చుకొన్నాము. చేతికి సంకెళ్ళు లేకపోయినా మామీద ఎప్పుడూ మశ్త్రీ పహరా చాలా కఠినంగానే ఉంటూ ఉండేది. కాని ఒక సాహసకృత్యానికి చిరునవ్వులతో తయారవుతున్న మమ్మల్ని చాలామంది సానుభూతితోనే చూస్తుండేవాళ్ళు. మేము ముగ్గురంగాక తక్కిన ఖైదీలన్నిటినుంచి మొత్తంమీద ఇరవైమంది మమ్మల్ని చేరారు. ఆ ఇరవై ముగ్గురిలోనూ ముగ్గురు జెట్ విమానాల ట్రయల్ ఫ్లైట్‌లో ప్రమాదంలో చిక్కుకొని మరణించారు. తక్కినవాళ్ళని నాలుగు బృందాలుగా విడదీశారు. నేనూ, సింగు, మోహన్‌లాల్ రెండవ బ్యాచీలో పడ్డాం.

ఆ రోజు మొదటి బృందం వాళ్ల ప్రయాణం, వాళ్ళ నలుగురిలోనూ విశ్వేశంకూడా ఉన్నాడు. ప్రొద్దున్న 8-30 గంటలకి రాకెట్ బయలుదేరింది. రాకెట్ బయలుదేరడాన్నిబట్టి అది తప్పకుండా భూవాతావరణం దాటిపోతుందని అనుకున్నారు. ఇంకా అనుకోవడంపూర్తికానేలేదు, ఆకాశమంతా పొగతో నిండిపోయి, పెద్ద మంటలతో రాకెట్ నేలమట్టం ఐంది. ఒక వేడి నిట్టూర్పుతో మేమంతా వెనుదిరిగాం.

ఇంకో ఐదు రోజుల్లో మా ప్రయాణం ఉందనగానే మమ్మల్ని రాకెట్ పరీక్ష చేయనిచ్చారు. మా రాకెట్ దాదాపు 80 అడుగుల ఎత్తుంది. దానిలో క్రింది 15 అడుగులవరకు జెట్‌ని తయారుచేసే మిషన్లూ అవీ ఉన్నాయి. పై కంపార్ట్‌మెంట్‌ని నిచ్చెన మీదుగా ఎక్కాలి. ఇక్కడ రాకెట్ గోడల మందం దాదాపు ఒక అడుగుదాకా ఉంది. లోపలంతా ఎయిర్ కండిషన్ చేయబడి, పీడనశక్తి ఎప్పుడూ ఒకే విధంగా ఉండేటట్లు అమర్చబడి ఉంది. విద్యుచ్ఛక్తి తయారుచేసే డైనమోలు, సిగ్నల్స్ ఇవ్వడానికి రేడార్, కూర్చోడానికి సోఫాలు, ఈ కంపార్ట్‌మెంట్ చాలా సుఖంగానే కనిపించింది. నేను మెషినరీ అదీ జాగ్రత్తగా పరీక్షించి ఎక్కడా లోటు అదీ లేదని నిర్ధారణ చేసుకుని, వదులుగా ఉన్నట్లనిపించిన స్క్రూలనీ, నట్లనీ బాగా బిగించి క్రిందికి దిగాను. మాకు దాదాపు 15 రోజులకి సరిపడ ఆహారాన్ని, 4 తుపాకుల్నీ, 4 టార్చిలైట్లనీ, ఒక చిన్న హెలికాప్టర్ విడిభాగాలనీ దాంట్లో పెట్టించాము.

ఆరోజు మధ్యాహ్నం 12 గంటలకు మా ముహూర్తం నిశ్చయమైంది. ఎనిమిదిగంటలకల్లా సయించకపోయినా నాలుగు మెతుకులు కొరికి రాకెట్ వైపు నడిచాను. నా వెనకాలే సింగూ, లాలూ వచ్చారు. ఎమ్. ఎస్. సి. పట్టా పుచ్చుకున్న లాల్ పాపం అమాయకుడు. తాళికట్టిన భార్యని ఎలా చంపగలిగాడా అనిపించింది అతన్ని చూడగానే. అంత చదువున్నవాణ్ణి, ఇలాంటి అవకాశాన్ని జారవిడిచి ఉరితీయించుకోనా అనే అభిమానంతో ఈ సాహసానికి ఒడిగట్టాడే గాని, తీరా సమయం దగ్గరికి వచ్చేసరికి చప్పగా చల్లారిపోయి, పాలిపోయిన మనిషి! నేనెంత ధైర్యం చెప్పినా ఇంకా బిరికిగా తయారయ్యాడు. సింగు మాత్రం నిండుకుండ-తొణకదు. అతని భావాలేమిటో దేవుడికెరుక! 'కలిసి చావడానికి సిద్ధపడ్డాం. మనమిద్దరం ప్రాణమిత్రులం భాయీ!' అన్నాడు నాతో. మాలో ఎంతో ఆనందాన్ని పైకి కనబరుస్తున్నది నేను మాత్రమే. "ఒక అత్యున్నతమైన కార్యాన్ని చేయబోతున్నాననీ, దీంట్లో కృతార్థుణ్ణయితే ఈ ప్రపంచానికంతా మార్గదర్శకుడినౌతాననీ, లేక వశించానా రేపువచ్చే చావు ఇవాళే వస్తుందికదా అనేధీమాతోనూ ధైర్యంతోనూ పొంగిపోతున్నాను.

మేము స్పేస్ సూట్సు అవీ ధరించేసరికి 9 గంటలయింది. మాకు రెండు ఫర్లాంగుల దూరంలోనున్న ఆడిటోరియం అప్పుడే కిటకిటలాడడం మొదలుపెట్టింది. మా అంత్య ప్రయాణం చూసేటందుకు. సిగ్నల్ ఆపరేటర్లూ వాళ్ళూ సిద్ధంకావడం మొదలుపెట్టారు. నేను రేడారూ, డైనమో మొదలైనవన్నీ పనిచేస్తున్నట్లు ఇంకోసారి టెస్ట్ చేసి చూసుకొన్నాను. క్రింది కంపార్ట్‌మెంటంతా గాలిదూరకుండా గట్టిగా ఉన్నట్లుకూడా సరిచేసుకున్నాను. 10-30 అయ్యేసరికి మాకు కావలసినవన్నీ వచ్చినట్లు నిశ్చయం చేసుకొని రాకెట్ తలుపు బంధించివేశాను. లోపల ఏర్ కండిషనింగ్ చేసే మిషన్లూ, పీడనశక్తిని సరిచేసే మిషనూ పనిచేయించాను సింగ్

# ★ చంద్రలోకయాత్ర ★

ఈలోగా. మాకున్న గడియారాలన్నింటినీ సరిగ్గాచూసుకుని 11-30 అవగానే జెట్ బాగా చిక్కపడేందుకు మరతిప్పి, సింగ్‌నీ, లాల్‌నీ బెల్టులు కట్టుకోమన్నాను. లాల్ తన కళ్ళకి గంతల్నీ, చెవుల్లో దూదినీ పెట్టమని అడిగాడు. అలాగే చేశాను. ఒక్కసారిగా సెకండుకు ఏడున్నరమైళ్ళ వేగంతో రాకెట్ బయలుదేరే ఖంగారులో నాలిక పళ్ళ మధ్యపడి తెగకుండా ఉంచేటందుకు సింగుకీ, లాల్‌కీ చెరో పెన్సిలూ నోట్లో పెట్టుకోమని ఇచ్చాను. సింగు విషాదంగా చిరునవ్వు నవ్వి, ఆ పెన్సిల్ తీసుకున్నాడు. నేను జెట్‌ని అతి వేగంగా బహిర్గతంచేసే మర పక్కనున్న సోఫాలో నన్ను గట్టిగా సీట్‌కి కట్టేసుకున్నాను. ఈ లోపునే ఒక్క ఊపుతో పోడవకుండా ఉంచేటందుకు రేడార్నీ, డైనమోనీ, తక్కిన అన్నింటినీ, (ఒక్క పీడన కక్షి మినహతప్ప) బంధించి వేశాను. పెన్సిల్‌ని పళ్ళమధ్య కరుచుకొని పైకి చూశాను. 11-58 అయింది. ఎదురుగా ఉన్న గాజు కిటికీలోంచి దూరంగా మాకేసే చూస్తున్న జనసమూహానికి కళ్ళతోనే వీడ్కోలిచ్చాను. దాంట్లో నేలీలగా కనిపిస్తున్న భూమాతవద్దకూడ సెలవుతీసుకున్నాను భయంతో లాల్ వణికిపోతున్నాడు. సింగు నిమీలిత నేత్రాలతో రాకెట్ పైకప్పు చూస్తున్నాడు. అప్పుడు 11-58. మరవైపుకి నా చేతులు వణుకుతున్నాయి. నవనాడులూ క్రుంగిపోతున్నట్లుంది. క్షణ క్షణంగా 12 సమీపిస్తోంది. మానవ సహజమైన భయకి హృదయాన్నాక్రమించుకొని చేతికి వణుకు పుట్టిస్తోంది. కాని తప్పదు. నేను భూమినివదిలి పోదల్చిందే అయితే చంద్రలోకానికి, లేక యమసదనానికి! పెద్దముల్లు, చిన్నముల్లు సెకండ్లముల్లు 12 వద్ద కలవగానే చెయ్యి, ఒక్కసారిగాదూకి మర నొక్కేసింది. ఘోరమైన ధ్వనితో చెవులు గింగురుమన్నాయి! కళ్ళుబైర్లు కమ్మేశాయి! నోట్లోని పెన్సిలు ఫటుక్కున విరిగిపోయి అలాగే పడిపోయాను!

## 3

కళ్ళు తెరవగానే గడియారం వైపు దృష్టి మళ్ళింది. 12-5. అంటే భూమినివిడిచి అప్పుడే 2250 మైళ్ళు వచ్చేశామన్నమాట! అంటేభూవాతావరణందాటేశామన్నమాట! ఒక్క ఊపులో బెల్టులు ఊడదీసుకుని లేచి నుంచున్నాను. సింగుఇంకానిమీలిత నేత్రాలతో అలా చూస్తూనే ఉన్నాడు! లాల్ ఇంకా వణుకుతూనే ఉన్నాడు. త్వర త్వరగా వాళ్ళిద్దర్నీ కూడా లేవదీశాను. సింగు నన్ను కౌగలించుకుని "ఐతే మనం నేలమీద కానట్లేగా" అన్నాడు. 'ఇప్పటికింతే లాల్! పని చూడు' అని చెప్పి త్వరత్వరగా రేడార్‌ని తిప్పి, స్పీడ్ మీటర్ వంక దృష్టి మరలించే సరికి ప్రాణం పోయేటంతపనైంది.

ఆకర్షణశక్తి ఎదురురావడంవల్ల సెకండుకు 7½ మైళ్ళతో బయలుదేరిన మా రాకెట్ వేగము ఇప్పుడు సెకండుకి 3 మైళ్ళకి దిగిపోయింది. ఇంతలో రేడారులోంచి సిగ్నల్స్ వస్తున్నాయని తెలిసి, 'కోడ్' గుర్తుల ద్వారా భూమిమీది ఆపరేటరుని మా రాకెట్ వేగం తగ్గిపోయినట్లూ, మళ్ళీ క్రిందికంపార్టుమెంటుని జెట్‌తో నింపి చిక్కబరచడానికి ప్రయత్నిస్తున్నట్లూ తెలియబరిచి, చంద్రమండలానికి చేరాలంటే ఏ దిక్కుగా వెళ్ళవలసిందీ తెలియజేయవలసిందిగా కోరాను. నేనిచ్చిన సిగ్నల్‌నుబట్టి మేమెంత దూరంలో ఏ వైపున ఉన్నామో వాళ్ళకి తెలుస్తుంది కాబట్టి, మారాబోవు కార్యక్రమాన్ని వాళ్ళే చెప్పగలగాలి. ఒక రెండు నిమిషాల్లోగా మా దిక్సూచి పనిచేస్తోందా అని అడిగాడు ఆపరేటర్. వాతావరణ పరిధిని దాటేయడంవల్ల అయస్కాంతము దాని దిక్సూచిత్వాన్ని కోల్పోయింది. ఈవిషయం తెలియచేయగానే మేం ప్రస్తుతం వెళ్తున్న దిక్కుకి ఎడమవైపు మూలగా నలభై డిగ్రీలకోణంలో రాకెట్‌ని తిప్పి సెకండుకు 7½ మైళ్ళ వేగంతో వెళ్తే ఇంకో 7½ గంటల్లో చంద్రమండలాన్ని చేరగలమని చెప్పాడు ఆపరేటర్.

ఈ సంభాషణంతా జరిగేసరికి దాదాపు ఇంకో 10 నిమిషాలు పట్టింది. ఈలోగా మా రాకెట్ వేగం చాలావరకు తగ్గిపోయి సగటు వేగంతో భూప్రదక్షిణం చేయడానికి సిద్ధపడుతున్నట్టు కనిపెట్టాను. మా రాకెట్‌లోని జెట్ మళ్లీ చిక్కబడడానికి ఇంకో రెండునిమిషాలు పడుతుంది. కాని ఏం చెయ్యగలను! ఈలోగా మా రాకెట్ తన ప్రదక్షిణాన్ని మొదలుపెట్టి దాదాపు 250 మైళ్ళు ఎడమవైపుగా వచ్చేసింది. ఈమాటికి లాల్ కొంచెం పుడుటపడి విషయం తెలిసికొని తనకున్న గణితశాస్త్ర ప్రావీణ్యం వల్ల రాకెట్‌ని ఎడమమూలగా 15 డిగ్రీలు తిప్పితే చాలన్నాడు. వెంటనే రాకెట్ ముఖాన్ని 15 డిగ్రీలకు తిప్పి, వాళ్ళిద్దర్నీ మళ్ళీ కట్టేసుకోమనిచెప్పి, నన్ను నేను బంధించివేసుకుని జెట్ పూర్తిగా నిండగానే సెకండుకు 7½ మైళ్ళతో బహిర్గతం చేశాను. ఈసారి నాకు వణుకూ రాలేదు; సింగుకి నిమీలిత నేత్రాలూ పట్టలేదు. లాల్ కళ్ళకి గంతలు కట్టుకోనూ లేదు. రాకెట్ వేగం సమంకాగానే మేము కష్టా

...ని లేచి కూర్చున్నాము. నేను ...గా కిటికీవద్దకువెళ్ళి దృశ్యం చూడడం మొదలుపెట్టాను. అంతా శూన్యంగాఉంది. మా స్పీడో మీటర్ తిరగడం తప్పిస్తే అసలు మేం కదులుతున్నామా అనిపించింది. భూమి కనిపిస్తుందేమోనని ఆత్రంగా అన్నిదిక్కులూ చూశాను గాని ఎక్కడా ఫికరులేదు. ఇంతలో సింగు నా పక్కకివచ్చి 'రాకెట్ తలుపు తెరిస్తే ఏమవుతుంది' అని అడిగాడు. 'ఇప్పట్లో తెరిస్తే బయటంతా శూన్యంగానూ నిష్పీడనంగానూ ఉంటుంది గాబట్టి లోపలి గాలంతా ఒక్కసారిగా బయటికి వెళ్ళడానికి ప్రయత్నించడంవల్ల రాకెట్ పేలిపోవచ్చు. కాబట్టి మనమంతా స్పేస్‌సూట్‌కి బయట అదనంగా గాలి సంచులు తగిలించుకుని, రాకెట్‌లోని ఏర్ కండిషనింగ్ మిషను నీ సమపీడన శక్తికలిగించేయంత్రాల్ని ఆపివేసి తలుపు తెరవవచ్చు. బయట ఎటువంటి ఆకర్షణా ఉండదు కాబట్టి బోల్ట్లకి అయస్కాంతాల్ని తాపడం చేస్తే మనం కూడా బయటకు వెళ్ళవచ్చు, అని చెప్పాడు వెనకనుంచి లాల్. అలాంటి బోల్టు రాకెట్ లోనే ఉండడంవల్ల మేమంతా వాటిని తొడుక్కుని, గాలిసంచులు చుట్టూ బిగించి కట్టుకుని రాకెట్‌లోని యంత్రాల్ని ఆపేశాము. అలా చేసేసరికి మా బరువులన్నీ దూదిలా తేలికయిపోయినట్లయి మేము ఎక్కడికో తేలిపోతున్నామా అనిపించింది.

నెమ్మదిగా రాకెట్ తలుపు తెరుచుకొని ఇవతలికి వచ్చాము. మా రాకెట్ నిజానికి చాలా వేగంతో వెళ్తున్నా అసలు ఎక్కడికీ కదలకుండా నిస్తబ్ధంగా ఉన్నట్లుంది. రాకెట్ బయట ఉన్న ఇనుప రజనుకి మా అయస్కాంతాలు అంటిపెట్టడంవల్ల మేమీ దానికి అంటుకుపోయి ఉన్నాముగాని, గాలిలోని దూదిపింజల్లా అల్లల్లాడి పోతున్నట్లుంది. సరిగ్గా మాకు వెనకగా అఖండమైన వెలుతురుని విరజిమ్ముతున్న భూమి కనిపించింది! దాదాపు ఐదు వేల మైళ్ళ దూరాన్నున్నా మేమో భూమియొక్క గోళత్వం మాకు గోచరించింది. కాని మేము చూస్తున్నదే ప్రదేశమో ఏమిటో ఏమీ అర్థం గావడం లేదు, వెలుతుర్ని విరజిమ్ముతున్న పెద్ద గోళాకారపు విద్యుద్దీపంలా కనిపించింది భూమి అక్కడికి. సూర్యుని వేడిమిని ఆపడానికి ఏ గాలీ లేక పోవడంవలన ఆ వేడి అతితీక్షణంగా తగిలి మా గాలి సంచులకున్న రబ్బరు కరిగిపోడం మొదలు పెట్టింది. ఇంకో సేపుంటే మేము గూడా మాడి పోతామేమో నన్న భయంతో, త్వరత్వరగా లోపలికివెళ్ళి తలుపులు వేసేసుకున్నాం. లోపల గూడా మహా వేడెక్కి పోవడంవల్ల వెంటనే మా యంత్రాలన్నిటినీ తిప్పిన పదినిమిషాలదాకా మేము తాపీ పడలేకపోయాం. మేముచూసిన విషయాలన్నీ రేడారులో క్రింది వాళ్ళకి తెలియజేసి కాలంలెక్క వేసుతూ కూర్చున్నాము.

## 4

నెమ్మదిగా సెకండ్లు, నిమిషాలు దొర్లి గంటల్లోకి మారుతున్నాయి. వాతావరణాన్ని దాటిన మొదటి రెండు మూడు గంటల్లోను మా ప్రాణాలు ఉగ్గపట్టుకు కూర్చోవలసి వచ్చింది. భూప్రదక్షిణం చేస్తున్న నాలుగైదు ఉల్కలు మాకు చాలా దగ్గరలోనే తారసపడ్డాయి. వాటికి మా రాకెట్ గుద్దుకోకుండా ప్రయాణం చేయడం మా అదృష్టమనే చెప్పాలి. మేము

# చంద్రలోకయాత్ర

చాలా వేగంతో దూసుకుపోవడంవల్ల అవి పెద్దగా, గుండ్రంగా ఉన్నాయనే విషయం తప్ప ఇంకేమీ గమనించడానికి వీలులేక పోయింది. ఒకటి మాకు చాలాదగ్గరలోనే తారసపడడంవల్ల దాని ఆకర్షణతో మా రాకెట్ రెండు డిగ్రీల దిక్కు మార్చి వేసింది. దాన్ని వెంటనే సరిదిద్దుకున్నాము.

నేను రెండోసారి జెట్ వదిలాక రాకెట్ చాలావరకు సమవేగంతోనే నడిచింది. కాని ఇంకా ఆకర్షణకి ఉండడంవల్ల సెకనుకి ఒకమైలుదాకా పోగొట్టుకుంది. మా టైమ్ ప్రకారం 7-45 అయేసరికి రాకెట్ వేగంలో మార్పువచ్చిందని గ్రహించి, త్వరత్వరగా యంత్రాలు ఆపివేసి బయటవెళ్ళి చూసేసరికి మాకు అల్లంత దూరంలో పెద్దగోళాకారం కనిపించింది. వెంటనే లోపలికి వచ్చేసి సింగునీ, లాల్‌నీ మళ్ళీ కట్టేసుకోమని చెప్పి, నేనుకూడా కట్టివేసుకుని స్పీడోమీటర్ వంక చూశాను సెకనుకి 8½ మైళ్ళ వేగం వస్తోంది. వెంటనే నెమ్మది నెమ్మదిగా రాకెట్‌ను వెనక్కి తిప్పడం మొదలుపెట్టాను. పక్కనే క్రింది కంపార్ట్‌మెంట్‌ని జెట్‌తో నింపే మరని కూడా తిప్పేశాను. రాకెట్ పూర్తిగా వెనుతిరిగేటప్పటికి మా వేగం సెకనుకి 10 దాకా వెళ్ళింది. దాదాపు చంద్రమండల అవధిని సమీపించామని తెలుసుకుని జెట్‌ని బహిష్కృతం చేశాను, సెకనుకి 7½ మైళ్ళ వేగంతో - ఒక రెండు మూడు నిమిషాలదాకా ఓ బ్రహ్మాండ ప్రళయంలో ఉన్నామా, అనిపించింది. కా: తర్వాత స్తిమితపడింది రాకెట్. ఐతే ఒక పెద్ద చిక్కు వచ్చింది. మా రాకెట్ ప్రస్తుతం ఎంత వేగంతో చంద్రమండలంవైపు వెళ్తోందో తెలియలేదు. ఏమాత్రం అజాగ్రతతో ఉన్నా అతివేగంతో చంద్రమండల తలంపై కొట్టుకుని భస్మీపటలమైపోతుందేమోననే ఆదుర్దా నన్ను క్రుంగతీయడం మొదలుపెట్టింది. పోనీ కట్టువిప్పుకొని కిటికీవద్దకు పోయిచూద్దామా అంటే, మా రాకెట్ ప్రస్తుత పరిస్థితిలో ఆపనిచేస్తే బంతిలాగా పుటికీలు వేయవలసి వస్తుందేమోనని భయం వేసింది. రాకెట్‌ని సెకనుకి 7½ కన్నా ఎక్కువ వేగంతో నడపవచ్చునుగాని, ఏమాత్రం గోడలో బలహీనత ఉన్నా క్రిందిభాగం పేలిపోతుంది. ఇంతలో వాడిలిపోతూ లాల్ రాకెట్టు మండి పోతోందని అరిచాడు. ఈమాట వినగానే నా మనసులో సంతోష విచార చిహ్నాలు సమంగా తలెత్తాయి. , వాటిని అవతలకు నెట్టి, దేవుడిమీద భారంవేసి ఇంకా

మిగిలివున్న జెట్‌ని గంటకి 12 మైళ్లతో ఆవలకి తోశాను. ఇంకోక రెండు నిమిషాలవరకు మళ్లీ మహాప్రళయం అనుభవించాం. బయట మంటలుచల్లారిపోయాయి. కొంచెం పరిస్థితి చల్లబడగానే త్వరగా బంధాలు విప్పుకుని జెట్‌ని మళ్ళీ నింపడానికి మీటనొక్కి కిటికీవద్దకు పరుగెత్తాను. ఇంకో రెండు మూడు మైళ్లలోగా చంద్రమండలం కనిపిస్తోంది. రాకెట్ అతి నెమ్మదిగా కులాసాగా క్రిందికి దిగుతోంది. ఈ లోగా సింగూ, లాల్ కూడా నా పక్కకి చేరి 'చంద్రమండలం చేరేశాం' అని ఉద్రేకపడి అరిచారు. వాళ్ళని మందలించి కట్టుకునే కూర్చోమని చెప్పి కిటికీలోంచి క్రిందివైపునే చూస్తూ నిలుచున్నాను. కొంచెం మళ్ళీ వేగం హెచ్చింది అని అనుమానం తగలగానే చాలా సాదుగా జెట్‌ని బహిష్కృతం చేయసాగాను. జెట్‌ని నా కంట్రోల్లోనే పెట్టుకుని వేగాన్ని హెచ్చిస్తూ, తగ్గిస్తూ రాకెట్‌ని క్రిందికి దిగడానికి పుటికీలు కొడుతూ మా గడియారంలో సరిగా 10.00 గంటలు అయేసరికి చంద్రమండలంమీద రాకెట్ దించాను.

## 5

దాదాపు 7-45కి మా రాకెట్ వేగం హెచ్చి సిగ్నల్స్ ఇచ్చినప్పటినుంచీ ఇంతవరకూ భూమికి మాకూ మాటలు లేవు. చంద్రమండలంలో రాకెట్ దిగగానే రేడార్ ద్వారా మేము సుఖంగా చంద్రుడి సమీపానికి చేరినట్లు తెలియబరిచాం. వారినుండి వచ్చే అభినందనల్ని స్వీకరించేసరికి మాకెంతో సంతోషమూ, గర్వమూ కలిగాయి. మేము ముగ్గురమూ గూడా బయటికి వెళ్ళబోతున్నామనీ, ఎప్పటి విషయాలు అప్పుడు రేడార్ ద్వారా ప్రతీ మూడునాలుగు గంటలకు తెలియబరుస్తామనీ, తెలుసుకోగలిగినన్ని విషయాలు తెలుసుకొని వీలైనంత త్వరలో వెనక్కి వస్తామనీ తెలియబర్చాను. ప్రస్తుతం అక్కడ ఎండా లేక చీకటా అన్న ప్రశ్నకి కిటికీలోంచి చూసి నీరెండలాగా ఉన్నదని సమాధానం చెప్పాను. కిటికీలోనుంచి ఏమన్నా విషయాలు తెలుస్తున్నాయా అనే ప్రశ్నకి, కిటికీకి దాదాపు అరమైలు దూరంలో పెద్దకొండలాగా కనిపిస్తోందనీ, కనిపించినంతవరకూ నేలంతా బోడిగాను, రాళ్ళురాళ్ళుగానూ, పెళ్ళలుపెళ్ళలుగానూ ఉందని తెలియబర్చాను. అక్కడేమైనా వాతావరణంలో ఉండే లక్షణాలు కనిపిస్తున్నాయా అనే ప్రశ్నకి, అలాంటి లక్షణాలేమీ కనిపించడంలేదనీ, కాని మా రాకెట్ వెనక్కి అతివేగంగాదిగుతున్నప్పుడు మంటలు వచ్చాయనీ, ఏదోవిధమైన వాయువుఉండి ఆ ఘర్షణకి మంటలు రావలసిందేతప్ప ఇంకో అవకాశంలేదని, అందువల్లే మా రాకెట్ మండిపోయేదేమో మేమేమైపోతామో అన్న భయముకన్నా ఏదో ఒకవాయువుఉంటుందనే అన్న ధైర్యంతో నాకు సంతోషమే ఎక్కువైనట్లూ చెప్పాను.

నేను రేడార్ని మూసి ఇవతలికి వచ్చేసరికి సరిగా రాకెట్ తలుపు తెరవబోతున్నాడు. అతన్ని ఖంగారుగా ఆపాను. 'ఏం' బయటేదో గాలి ఉంటుందన్నావుగా, తెరిస్తే ప్రమాదమేమిటి' అన్నాడు. గాలి ఉన్నేది ఉన్నా అది చాలాతక్కువగాను, దాదాపు నిష్పీడనంగానూ ఉంటుందనీ, అందువల్ల యంత్రాలు ఆపకుండా తలుపుతీయడం ప్రమాదమేనని చెప్పాను. మేము స్ప్రింగుపట్లు విప్పేసి గాలిసంచీలతో ఉన్న కవచాలని ఆక్సిజన్ సిలిండర్లు వీపుకి కట్టుకుని ముసుగులతో మొహాలు కప్పేసుకున్నాం. ఒకరితో ఒకరు మాట్లాడుకోడానికి మాస్కుల్లోనే మైకులుపెట్టుకొని వైర్లతో తక్కిన ఇద్దరి మాస్కుల్లోకి కలిపాను. మేము బయలుదేరుతోంటే తుపాకీ తీసుకురానా అని అడిగాడు సింగు. అతన్ని తుపాకీ తీసుకోమని, మాకిచ్చిన వస్తువుల్లో కెమేరాలు, ఫిల్ములు ఉన్నట్టు కనిపెట్టి చేరో కెమేరా లోడ్ చేసుకుని బయలుదేరాం.

మేము రాకెట్‌లోంచి దిగగానే ఒకసారి చుట్టూ చూశాను. మేము ఒకలోయలో దిగాం. అన్నివైపులా నూడులు తేలిక కొండలే. నేలంతా పెళ్ళలు పెళ్ళలుగా ఉంది. కాని చాలా గట్టి నేల. గునపాలకి కూడా స్వాధీనంఅయేటట్లులేదు. మా రాకెట్ దిగిన ఒక ఇరవై చదరపు గజాలు తప్ప తక్కిన నేల ఏమాత్రమూ చదునుగా లేదు. ఆకాశంలో పడమటిదిక్కుగా భూమి తెల్లగా కనిపిస్తోంది. తూర్పున సూర్యుడు అతితీవ్రంగా ప్రకాశిస్తున్నాడు. కొంచెంసేపటిలోనే ఇక్కడ సూర్యుడు మామూలుగా తూర్పునే ఉదయిస్తాడనీ, భూమిమాత్రం పడమట ఉదయిస్తుందనీ, ఇవాళ భూమిలో పూర్ణిమ కాబట్టి ఇక్కడ అమావాస్యనీ, అయినా భూమి చాలాపెద్దదవడంవల్ల పూర్తిగా మాయమవకుండా లీలగా కనిపిస్తోందనీ గ్రహించాను.

మా చుట్టుపట్ల ఎక్కడా ప్రాణి సంచలనం ఉంటేటట్లు కనిపించలేదు. ఏదోగాలి ఉండనేతప్ప ఏగాలుందో తెలుసుకోవాల్సి ఉంది. నేను అగ్గిపుల్ల తీసి గియ్యగానే మండకోయి ఆరిపోయింది. దీనినిబట్టి ప్రాణవాయువులేదని అర్థమైంది. ఎక్కడా గాలిలోగాని, నేలలోగాని తేమ కనిపించలేదు. కాబట్టి ఉదజనికూడా ఉండడానికి ఆస్కారంలేదు. ఎందుకయినా మంచిదని లాల్‌ని రాకెట్లోకి వెళ్ళి సున్నం ఎక్కడైనా కొరికే చూసి నీటిలో కరగబెట్టి తీసుకురమ్మన్నాను. వెళ్ళిన పది నిమిషాల్లో సున్నపు తేటతో దిగివచ్చాడు లాల్. ఒక తేటకీని బద్దలుగొట్టి దాని గోడకున్న సున్నాన్ని గీకి నీటిలో కరగబెట్టాడు. రాకెట్ ఇవతలికి రాగానే సున్నపుతేట పాలలా విరిగిపోయింది. అంటే ఇక్కడి వాయువు బొగ్గుపులుసు గాలన్నమాట. కాని ఆకాశంలో ఎక్కడా మబ్బులు లేవు. దీన్నిబట్టి ఇదైనా చాలా తక్కువగా ఉందని తేలింది.

ముగ్గురమూ కలిసి ఎత్తుగా దగ్గరగా ఉన్న ఒక కొండకేసి నడవ నారంభించాం. చంద్రగోళం భూమి కన్నా చిన్నదై ఆకర్షణ తక్కువవుండడం చేతనో లేక మా చుట్టూ గాలి సంచులలోని గాలి బొగ్గుపులుసు గాలి కన్నా తేలికవడం వల్లనో మేము నడుస్తోంటే తేలిపోతున్నట్లు, ఊగిపోతున్నట్లు అనిపించింది. దానికితోడు నేలంతా మొనదేలిన రాళ్ళు ఈవలికి వచ్చి

(95-వ పేజీ చూడండి)




శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితిమావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే

ఉ॥ భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసి ఘోరసం
సారవికారసంతమసజాలవిజృంభణ మాపి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతిం దగు దివ్యుఁ బరాశరాత్మజాం
భోరుహమిత్రుఁ గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.... — నన్నయ]

శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగురూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్. — తిక్కన]

## ఉద్యోగపర్వము: ప్రథమాశ్వాసము

శ్రీ గౌరీవల్లభవపు। రాగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ
యోగీంద్రసంతతాంత। ర్యాగపరీతాశయాబ్జ హరిహరనాథా.

వ॥ దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె:

తే॥ ఎలమి నభిమన్యు పెండిలి యివ్విధమున। జేసి యుల్లాసలక్ష్మి కగ్రాసనిచ్చి మత్స్య
మనుజపతి యన్వయంబు పావనము సేసి। దినచతుష్టయానంతరమునఁ బ్రియమున.

వ॥ ధర్మతనయుండు తమ్ములం గొడుకులం బరివేష్టించియుండ విశాలరమణీయంబగు విరాటుకొలువుకూటంబున కరిగి యుండు:

క॥ విరటుఁడుఁ బాంచాలుండును, హరియును రాముండు వారి యనుజతనూజుల్
పరిణయసమాగతాఖిల, ధరణీశులుఁ బలసి యుండఁ దద్దయు నెమ్మిన్.

వ॥ ఉన్నసమయంబున సభాసదులైన మానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణ యుధిష్ఠిరులతో సంభాషణంబులు సేయుచుండఁ బాండవకార్యార్థియై కృష్ణుండు, తదీయవచనంబులు వారించి వారలఁ గలయం గనుంగొని యిట్లనియె.

మ. కపటద్యూతమునందు సౌబలునిచేఁ గౌంతేయు లాత్మీయరా
జ్యపదభ్రంశము నొంది సత్యనిరతిన్ శక్తాత్ములై యుండియుం
గుపితస్వాంతులు గాక తత్సమయసంతోషంబు గాకుండఁగా
విపినావాసము గూఢచర్యయును గావింపం దలం బొప్పదే.

ఆ. తలఁచినట్టి వ్రతము సలిపి యమ్మాడ్కిఁ బంద్రెండు వత్సరములు పాండవేయు
లకట క్రూరసత్త్వయాతుధానావలి, తోడఁ గానమునఁ గూడి మనరె.

క. పదపడి మత్స్యరఁచునకుఁ గ్రి, యదమూడవ యేఁడు గడపఁబడుట యరిది త
[illegible], లోనవిన [illegible] గలదే.

క॥ వీరలు ధర్మజు వర్తన, గారవ మెఱుఁగుదుర కాదె కావున నా గాం
ధారీతనూభవులకును, వీరలకును హితముగా వివేకప్రౌఢిన్.

తే॥ ధర్మమార్గంబు దప్పక తలఁపు డొక్క, తెఱఁగు ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు
వడయ నోడఁబడఁ డయ్యింద్ర, పదవిమైన నుచితగతి నెంత వడసిన నుల్లసిల్లు.

వ॥ కావునఁ బాండవులకుఁ బితృధనంబగు రాజ్యంబు గపట ద్యూతంబున దుర్యోధనుఁ డపహరించుటయు నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించుకొన్న పదంబగుటయు, ధర్మసూను మహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడుసేయ లేయమియు నీ రెండుదెఱంగులవారికిం బంచి కుడువందగుటయుం దలపోసి తగిన కార్యంబు సెప్ప నర్హుల రేనును నాకన్నంత సెప్పెద వినుండు.

క॥ కుంతీతనయులు సహాయులు, శాంతతమై నడపి తమ భుజాబలమును దు
ర్దాంతోద్యమ శౌర్యము నెఱిఁ, గింతు మనుచు నున్నవారు గినుకెదఁగదురన్.

క॥ వీరితలం పెఱిగిన గాంధారీతనయుఁడు సుహృద్వితానముఁ గూర్చుం
బోరఁ బరిమార్తుఁ గొంచెపువారై యున్నా రని యవశ్యముఁ గడఁకన్.

క॥ అలఘు బలవిక్రమోదాత్తుల కైనను బలము లేక దోర్గర్వము పై
గెలువంగ వశమె సహాయము, కలిమి ననంతంబులగు పగఱసైన్యములన్.

క॥ కావున పాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ బ్రోవగు నిమ్మై
నావీరులు ధీవీరులు, దేవాసుర లట్ల యనికిఁ దెగుదురు గడిమిన్.

వ॥ ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచిన తలం పక్కడివారి చిత్తవృత్తి యెట్టి దగుట యెఱుంగ మెదిరిమతం బెఱుంగక యెట్టి కార్యంబు నిశ్చయింప నెరవగునే కావున నియ్యవసరంబునం దగినమానిసి నందులకుం బుచ్చవలయు దుర్యోధనుండు వీరికి రాజ్యంబు పాలిచ్చిన మేలగుఁగాక తక్కిన నప్పటికిఁ బోలినపని సూచుకొంద మని పలికిన విని బలరామదేవుం డియ్యకొని రాజలోకంబు నాలోకించి యిట్లనియె.

క॥ హరివాక్యము వింటిరె యది, యిరుదెఱఁగుల జనములకును హితమును ధర్మో
త్తరమును నై యున్నది యీ, తెరవున కార్యంబు మనకు వీరలఁ దీర్పన్॥

చ॥ తమ సగఁబాలు గోలుపడి దానిన యిప్పుడు గోరు వీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమసామున నంతసమంది యున్కి యు
క్తము ధృతరాష్ట్రసూనునకు దాన నపాయము లేక యుండుఁ గో
వ ముడిగి వీరు సేయుదురు బాంధవ మిజ్జగముం బ్రియంపడన్॥

వ॥ కావున నిక్కార్యం బెడసేయక యొక్కరుం బనువ వలయు వాఁడునుం జని యభిమతంబు సాధించు నప్పుడు.

ఆ. మాటపొందెఱింగి యోటమై నల్లన, చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి
కనుగుణంబు గాఁగ నానతుం డగుచుఁ బ్రార్థించి యడుగఁ గున్నఁ దెఱఁగుపడదు॥

వ. అది యెట్లనిన ధర్మనందనుం డతని యుద్ధతికిం బయిలోడి మెయివడిగల నడవడిం బ్రవర్తిల్లుచుండియు జూదంబు వెంట మోసపోయి తొడరి చిక్కనంబడియె నదియును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమింజేసియు బంధుజనంబులు దన్నుఁ (వారించుటయు దా నాడుట మాని గాంధారరాజు నియమించినం దత్కాకౌశలంబునం బరిణతుండు గావున నాశకునియాడి యుధిష్ఠిరుం దొడ్డిన యొడ్డిమియు గెలుచుచు వచ్చినట్లగుట నాతనియందును గొఱంతలేదిత్తెరంగున వార లధర్మపరులని నిందింపరాకునికి కారణంబుగా వీరలు వుచ్చినమానిసి వినయంబుతోన యిక్కార్యంబు దీర్చికొని రావలయు ననిన సాత్యకి కోపించి యిట్లనియె.

---

రామాయణంలో సుందరకాండ, భారతంలో ఉద్యోగపర్వములపఠనము కష్టాలను బాపి ఇష్టసిద్ధికి తోడ్పడుతుందని అనాదిగా మనవారి నమ్మకము. ప్రథమంగా ఉద్యోగపర్వాన్ని పేర్కొని ప్రకటించటానికి అదే కారణము. భారత కథారచన, పఠనము ఒకే వరుసలో ఆదినుండి అంతమువరకూ కూడదని కూడా అంటారు.

భారతములో పురాణకథలు, నీతి కథలు వ్రతమహిమలు అనేకం వస్తాయి. అసలు కథకు సంబంధంలేనివాటిని వదలి వేయ దలచినాము. వచ్చే సంచికనుండి 6 పేజీలు చొప్పున వేస్తాము. [సం.]



# ★ సంక్రాంతి ★

రామడుగు శ్రీమన్నారాయణ శర్మ

వచ్చినది సంక్రాంతి
తెచ్చినది నవకాంతి.

తెలుగు పంట పొలాల
వెలుగు పచ్చ దనాల
తెలుగు వీధులు గ్రాల
గలుగు పర్వదినాల...
వచ్చినది...

పాడుకొనుచును వాడ
వాడలకు హరిదాసు
లరుగు దేరగ-నుత్త
రాయణమ్మును రాగ...
వచ్చినది...

అంగనలు, క్రొంగ్రొత్త
సింగార మొలికింప-
రంగవల్లులు గృహా
ప్రాంగణమ్ముల నింప
వచ్చినది...

ముద్ద బంతులు జడల
ముడుచుకొని కన్నియలు
వేషభూషలలోన
వెలిగింప వన్నియలు
వచ్చినది...

"హేమలంబా" రమ్య
హేమంతమున-సౌమ్య
లక్ష్మీకళా వదన
హాసమై-భాసమై...

వచ్చినది సంక్రాంతి
తెచ్చినది నవకాంతి!




సంస్కారంగల ఒకమనిషి ఒకనాడు అటంబాంబును, జపానులోని హిరోషిమా నగరం నడిబొడ్డుమీద వేశాడు! సరిగ్గా అదే రాత్రి ఆంధ్రదేశంలో, ఉత్తరాన వంశధారా నదీతీరంలోని నవిరి గ్రామంలో ఒక సంస్కారం లేనిమనిషి, పదిహేనువందల పల్లీయులని గజగజ లాడించాడు!

ఆ మనిషి సంస్కారం అటంబాంబును ఏ నడిసముద్రంలోనో పడవేయనీకుండా చేసి, రెండులక్షల అరవై వేలమందిని చంపి, ఒకలక్షా అరవైమూడువేల మందిని గాయపరిచి, మూడువేల మూడువందల ఎకరాల మేరను ధ్వంసంచేసి అరవైనాలుగువేల భవనాలు కూల్చివేసింది.

నవిరిలో గజగజలాడిన పదిహేనువందల మందిలో ఇతడికి లేనిసంస్కారం భయాన్ని కల్పించి ఆ గ్రామదేవత నీలమ్మకు నివాళిగా, ఒకరోజు వూరంతా కలిసి ఆటపాటలతో ఉత్సవాన్ని చేసుకొనిచ్చింది!

వంశధార నదిఒడ్డునే గ్రామకంఠంలో వున్న నీలమ్మగుడిలో ఆ రాత్రి శివమెత్తిన దాసుడు రాముడు, గగనానికి వినిపిస్తున్నట్లు అరుస్తున్నాడు.

చప్పిముక్కు, వాలినగడ్డం, విరబోసిన జుత్తు, బొమ్మల్లా తెలుపు నలుపు కలయికతో మెలితిరిగిన మీసాలు, గొక్కుపోయిన ముఖం, వళ్లని బక్కచిక్కిన శరీరం! చిన్నగావంచాకట్టు తప్పించి అతడి ఒంటిమీద బట్టలేదు.

చుట్టూ మూగిన పల్లీయులలో దాసుని శివాలకు, తలలు దించేవారు కొందరు, అక్కడే దాసుడు పాదాలదగ్గర తమగడ్డాలను వంచేవారు మరికొందరు, అయ్యో! ఎంత పొరపాటైపోయిందని విసుక్కునే వారు చాలామందీ వున్నారు.

తనకాళ్లదగ్గర పడ్డ గెడ్డాలకు, ఈ దాసునికీ బాగాపరిచయంవుంది. ఈ దాసుడు రాముడే ఒకప్పుడు మంగలిరాముడనే పేరుతో వుండేవాడు. కొడుకుచేతికి అందే వరకు అతినమ్మకంగా తనే ఎప్పుడూ ఆ మంగలి తోలుపొదిపట్టుకొని ప్రతి ఇంటికీ వెళ్లి క్షురకర్మచేసేవాడు. తన కొడుకు తనలా డిప్పకత్తిరింపు, గడ్డాం, గీస్తే నాలుగు గంట్లు పెట్టడం నేర్చుకోలేదు. "పట్నం బాబులకు క్రాపింగులు కూడా నా బాబు సేస్తాడని" గర్వంగా రాముడు చెప్పుకొంటూండేవాడు. తనకు దొరికిన తీరుబడిలో గ్రామకరణంగారి వెంట వుంటూ కొద్దో గొప్పో ఏ చుట్టముక్క రూపంగానో, లేక, తొడిగింజలరూపంగానో సంపాదించేవాడు.

ఒకనాడు కరణంగారింటికి కొత్త రెవిన్యూ ఇన్స్పెక్టరు వచ్చాడు. ఇదివరకు చాలామందికి కాళ్లు పట్టడం, నలుగు రాయటం, తలకు నూనె రాసి మర్దించడం చేసేవాడు. తను వచ్చేవరకూ ఆ పనిమాత్రం సంతోషంగానే చేస్తుంటానుకొన్నాడు. కాని ఆ ఇన్స్పెక్టరురాకతో తన జీవితంలోనికి కొత్తగ్రహం వచ్చిందని, రాముడే నమ్మకంగా అనుకొన్నాడు. ఆ వేళ ఒంట్లో కొద్దిగా జ్వరంగా వుంది. "కాళ్లు పట్టావా లేదా వెధవా!" అంటూ ఇన్స్పెక్టరు ఎగిరి పడ్డాడు. చేతులు కట్టుకొని తన ఒంట్లో ఏం బాగాలేదని వినయంగా విన్నవించుకొన్నాడు. అధికారి కోపం రెచ్చిపోయింది. అన్నీ వేషాలని, జైల్లో పెట్టిస్తానని జడిపించాడు. చేసేదిలేక కాళ్లు పట్టాడే కాని కడుపు కమిలిపోయింది.

ఆ నిముషంనించి వైరాగ్యం వచ్చింది; ఈ నీలమ్మ గుడిదగ్గర కూర్చున్నాడు. ఒక్కసారి తను ఆ అధికారిమీద అధికారి అయితే ఎంత బాగుంటోదనిపించింది. కాళ్ళు పట్టమని ఆ వేళవాడినే అనుకున్నాడు. ఇంత కష్టపడ్డాను, ఒక్క కానీ ఇచ్చాడు కాదే అనుకున్నాడు. తనేదో అయిపోవలెనే కోరికతో వెనుకకు తిరిగి రెండు చేతులెత్తి, "అమ్మా! నీలమ్మతల్లీ! నా కడుపు కమిలిపోతుందమ్మా! నా బాధ యిని కనికరించు తల్లీ! ఈ మంగలిరాముణ్ణి మనసులో పెట్టుకో అమ్మా!" ఇలా అన్నాడేగాని ఏంకావాలో కోరుకోవటం మరిచిపోయాడు!

గుడి నల్లగావుంది. గుడికి రాతి గుమ్మం వుందికాని తలుపుల్లేవు. లోన ఒకదిమ్మమీద

...క్రవిగ్రహాలున్నాయి. మధ్యనున్న ...లో ఒకటి నీలమ్మతల్లి, రెండోదినీలమ్మ ...న్న ఎర్రన్న, మిగతా రెండూ నీలమ్మ అప్పచెల్లెళ్ళు! త్రోవవెంటపోయే ప్రతివారూ ఒక మొక్కు మొక్కుతారుగానీ, అలనా పాలనా వీటికుండేదికాదు. తన అయ్యకు కూడా ఈగుడి ఎప్పుడు కట్టారో తెలియదట కానీ సచ్చిన తనఅయ్యకు నీలమ్మంటేఎంతో భక్తి! తనకుమాత్రం లేదూ?

కొదినిముషాలు పోయాక రాముడికి ఎంతో జాలివేసింది. నీలమ్మగుడి అంతా బుగ్గితోనూ, పట్టుతోనూ నిండిపోయిందే! గబగబ ఇంటికి వెళ్ళాడు. చీపురు తెచ్చి అంతా తుడిచాడు. పట్టు తీశాడు. తరువాత బొమ్మలకి రంగు లేస్తే ఎంత బాగుండుననిపించింది! గుడికి సున్నంవేస్తే...ఈతల్లికి అలనాపాలనాలేదే! పల్లకివుంటే...డప్పులు ధమధమతో వూరేగునే! అంతా తను అప్పుడేచేస్తే ఎంతబాగుండును! అంతడబ్బుంటే తను చెయ్యగలిగేవాడే! తన రాబడి తనచేతిని నోటివరకూ ఎప్పుడూ పోనివ్వదు. ఊరిలో వాళ్ళతో చెప్తే!...అనుకున్నట్టే నలుగురైదుగురి... చెప్పాడు. వాళ్ళెవరూ వినలేదు. వేళాకోళం చేశారు. మన తాత ముత్తాతల దగ్గరనుంచీ లేనిది, మనం కొత్తగాచేస్తే యేమవుతుందో అని బెంగతో అన్నవాళ్ళుకూడా వున్నారు. ఈతల్లికి ఒక మొక్కు మొక్కడం తప్పించి పూజాపునస్కారాలుచేస్తే కోపం వస్తుందని యింకొక ముసలమ్మ చెప్పింది.

రాముడికిదేమీ నచ్చలేదు. రానురాను నీలమ్మతల్లిమీద భక్తి హెచ్చిపోయింది. ఒక్కొక్కసారి చీకటిపడ్డవరకూ వుండేవాడు. ఒక్కొక్కనాడు చిన్నప్రమిదలో దీపం పెట్టేవాడు. చేతులుకట్టుకుని కూర్చునేవాడు. ఈమధ్య రెండుసార్లు ఇన్‌స్పెక్టరు వచ్చాడు కానీ, కాళ్ళుపట్టమనలేదు! 'నీలమ్మతల్లి తనబాధ విన్నదని గట్టిగా నమ్మాడు!

రానురాను గెడ్డాం పెరిగిపోయింది. కళ్ళు గుబ్బలు కమ్మాయి. రోజూ యేటిలో పుదయమే ఒక మునుగు మునిగి అలా నీలమ్మగుడికి వచ్చేవాడు. తనకు వచ్చిన భాషలో వచ్చినట్లు ప్రార్థించేవాడు. ఇప్పుడు యెవరైనా క్షౌరానికి పిలిస్తే "యీవేళ ఉపవాసం వున్నాను. పొది ముట్టుకొంటే నీలమ్మతల్లికి కోపం వస్తాది" అనటం అలవాటైంది. రెండుమూడుసార్లు భక్తి హెచ్చటంవల్ల గట్టిగా పైకి అనటం నేర్చుకొన్నాడు. పొరుగూరో శివాలువేసే మనిషి దగ్గరకు మూడుసార్లు వెళ్ళి ఆరీతిని నేర్చుకొన్నాడు. గుడిలో ప్రయత్నించాడు. గొంతుకను తర్ఫీదిచ్చాడు!

ఒకనాడు తెల్లవారేసరికి వూరంతా ప్రాకింది! నీలమ్మతల్లి మంగలిరాముడిమీద



"...వాడూ బసవన్న"

చిత్రకారుడు : కోతి ధర్మారావు, (విజయనగరం)

వాలిందని! అదిగో వీరావతారం... వాలింది వాలిందన్నారు సగంజుత్తు నెరసిన అవయసువాళ్లు! "నిజమేనర్రా...అసలు ఆడు రెండు మూడు నెలలై ఈగుడి వదల్లేదర్రా! అతల్లి వుపాసన చేశాడు! వాలింది వాలింది" అన్నారు మరికొందరు.

ఇలా రోజుకి రోజు మరింత భక్తి హెచ్చిపోయింది. శివాలు వెయ్యటంలో మరింత ప్రావీణ్యం వచ్చింది! తను కోరుకున్నవన్నీ జరిగాయి — బొమ్మలకి రంగులు — గుడికి సున్నం; దేవుళ్లకు పుష్పకం, వూరంతటికి తను ఈతల్లికి దాసుడనని ... తనను భక్తి గౌరవంతో చూడటం—ఇదివరలా మంగలి రాముడనకుండా, దాసుడు రాముడనటం—రెవిన్యూ ఇన్‌స్పెక్టరు మళ్ళీ కాళ్ళుపట్టడానికి రమ్మంటే, తను యీసారి ధైర్యంగా రానని తిరిగి కబురు పంపటం—అధికారికి కోపంవచ్చి ఎగిరి పంతంబడితే, వూరంతా ఒకటై ఆదాసుడిచేత ఆపని చేయించటానికి వీలులేదనటం—ఇంతా జరిగింది! ఇప్పుడు దాసుడు ఆవూరికి వేదాంతి! పూజ్యుడు.

అలాంటి గౌరవం ప్రజల్లో సంపాదించుకున్న దాసుడు; చుట్టుపట్ల గ్రామాల్లో కలరా వుండటం విని తనపని తనుచేశాడు. అంచేత తను యీనాడు గొంతుక నెత్తాడు.

గుడిలో ప్రమిదలో దీపం వెలుగుతూంది. చిన్న చట్టాంలో గుగ్గిలం ధూపం వేశారు. గుడిలో పెద్దరైతు, రైతుభార్య గ్రామనాయుడు, (మునసబు) మరి నలుగురు పెద్దలూ కూర్చున్నారు. గుడిబయట చాలా మంది నిశ్శబ్దంగా నిల్చున్నారు.

కళ్ళు మూసుకున్న దాసుడు రాముడు "ఊ" అంటూ వూపిరి ఎగబీల్చాడు. మఠం వేసుకొని వున్నాడేమో, ఇదివరలా బీభత్సంగా కదల్లేదు. ఇక గొంతుకనుంచి పెద మూలుగు బయటపడింది. వెంటనే "నరుడా!" అని అరిచాడు. ఇక రాగాలతో మొదలుపెట్టాడు. "ఓరి నరుడా! సొర్మి అమ్మవారు వెళ్ళిపోతున్నాది. దూతలు తినేస్తున్నాయి—యీ – ఓరీ! దూతలు తినేస్తున్నాయిరా! నాను యీ వూరిని యెంతకని కాస్తానూ... మరి యెంతకని కాస్తానో...నూ! ఆదూతలు యీ వూరిమీద పడి తినేస్తున్నాయిరా! నానెంతకని కాస్తానూ! నరుడా! జాగ్రత్తపడితేగానీ ఊరు...ఊరంతా వుండదు! దూతలు కొల్లెస్తాయి! జాగర్తపడురా నరుడా!"

ఆ డ్డతలకాయతో ఏనుగులాంటి పెద రైతు, రాముడి కాళ్ళమీదపడి, "అమ్మా! తల్లీ! గేమానికి కాసినతల్లివి. నువ్వు కాయక పోతే యింకెవరు కాస్తారు!" అన్నాడు.

దాసుడు గొంతుక గగనానికి మళ్ళీ వినిపించింది! "ఎర్రోడా! నాను తలుచుకుంటే భూచక్రం బుగబుగ మండిపోతుంది! సంద్రాలు ఇంకిపోతాయి! యిటు దిక్కున్న పొద్దు అటు దిక్కు లేస్తాది!"

"నిజం తల్లీ! నిజం! ఈ పిల్లల్ని కనిక

# దగాపడిన తమ్ముడు ★



తించుకల్లీ!" ముసలి నాయుడు అందుకున్నాడు.

దాసుడు ఒక్క నవ్వు నవ్వి "ఓరి నాయనా! నా పిల్లోలంటే నాకు యెర్రిరా! ఆలమీద వల్లని యీగవాలితే నా ఒళ్ళు కందిపోతాది. ఆల్లకి సిన్న సీమ కరిస్తే నాకు గాబరా అయిపోతాది! పక్కన తమ్ముడు యెర్రన్నున్నాడు. ఈడు అక్క చెల్లెళ్ళతో ఒకటే మగబిడ్డ. దొరికినోళ్ళని తినేయడమే యీడిపని - నాగురించి కాదురో...యీడి గురించైనా...ఇన్నాళ్లు వూరుకొన్నారు... పనిపాటల్లో వున్నారని సెప్పకొచ్చినాను ...సంబరం సెయ్యాల్సిరో!...అప్పటే నాను సార్కి అమ్మోరిని, దూతల్ని తగిలేస్తంటే, యీడు సాయం సేస్తాడురో! నాయనలారా! సెయ్యండిరా...సంబరం సెయ్యండి!..."

రాగాలతో దాసుని కోర్కె బయటపడటంతో, అంతవరకూ పిడికిల్లో ప్రాణాలు పెట్టుకొన్నవాళ్ళందరిలోనూ కొద్దిగా ఉత్సాహం బయలుదేరింది. నీలమ్మతల్లి సార్కి అమ్మవారు, ఈ వూరుదిబ్బ సెయ్యకండా కాస్తుంది! ఆ తల్లికి సంబరం సెయ్యాల సెయ్యాలని అందరూ వూసులాడుకుంటూంటే, పెద్ద రైతుగుమ్మం దగ్గర నిల్చొని, గట్టిగా అన్నాడు: "వచ్చే గౌరీ పున్నమనాడు, యీడూ ఆడూ అనకండా వూరంతా కలసి నీలమ్మతల్లికి తిరుగుదులు చెయ్యాల."

"ఓ" అన్నారు అందరూ!!

## 2

గౌరీపున్నమ వచ్చింది! పల్లీయులలో ప్రమోదం హెచ్చింది! పున్నమ అయిదు రోజులున్నదనగా చిన్న తాటాకు బుట్లల్లో ఇసుకపోసి అయిదారు రకాల పప్పుదినుసులు వేసి నీడలో వుంచారు. జాజిపూలు నారకుచ్చుల్లా పెరిగాయి. ఆడమ్మలు ఉపవాసం వున్నారు. జాజవులు జుత్తులో దోపుకున్నారు.

సాయంత్రం దాసుడు గుడిగుమ్మందగ్గర నిల్చున్నాడు. చూపులో సంతోషం, నిల్చోవటంలో నిటారు; జుత్తు విరబోసివుంది. ముక్కులో బంగారం కొడలో యూలి తెరచినిల్చున్నాడు. వాతావరణం వెచ్చగా హాయిగావుంది.

ముఖాలనిండా పసుపులురుద్ది మోదాన్ని గొలిపే ఆడంగులు, ఆనందంతో హాయిగా బిందెలనిండా ముద్రాటాలతో వయ్యారంగా నడుస్తూ దాసునికాళ్ళమీద నీరు పోస్తున్నారు.

ఒక కొంక్కు కొంక్కుతున్నాడు. దాసుడు గర్వంగా చూస్తున్నాడు. తన బ్రతుకు ఎంత మారిపోయినది! కొన్నేళ్ళక్రితం తిట్లందర్నీ, అమ్మతల్లీ అని ప్రతివాలి చోడిగింజలు అడుక్కునేవాడే! అదిగదిగో పెద్దరైతుభార్య! నాయుడి కూతురు. ఇంకా ఎందరు తనకాళ్లమీద పసుపునీటిని కుమ్మరిస్తున్నారు!!

ఏటికీ గుడికీ, మధ్య రంగు రంగు చీరలతో, గాలిన బిందెలతో, పల్లెపనితలు నడుస్తూ నేవున్నారు. కొండమీద పొద్దు కనుగీటి క్రుంకింది.

కనుచీకటి, చంద్రుడు లేచాడు. శరత్కాలపు వెన్నెల శరీరాలని పులకరింపచేస్తూంది! ఒక మూలనించి ఏదో కూనిరాగం. ఇంకోవైపు గంగమ్మతల్లి గలగల్లాడుతూంటే చూస్తున్నవాళ్ల కిలకిలలు! అంతా ఆనందమయం!

భోజనాలయ్యాయ్. దగ్గరనున్న పట్నంనుంచి అద్దెకు తెచ్చిన రెండు పెట్రోమాక్సు లైట్లు వెలిగాయ్. అప్పుడే డప్పులు ధమధమలాడుతున్నాయ్. విశ్వమంతా వెలిగిస్తున్న చందమామను నవ్వ ప్రకాశించి, డప్పులవాళ్లు వరిగ తిరుగుతున్నారో అనిపిస్తున్నట్లు వాదుతున్నారు.

ఉదయంనించి ఉపవాసంవున్న దాసుడు, ఒక్కొక్క బొమ్మనే కర్రవృక్షం ఎక్కించాడు. ప్రజల్లో ఉత్సాహం రేకెత్తింది. అరటిపళ్లూ పువ్వులూ వృక్షంమీదకు విసిరారు! చిచ్చుబుడ్లు కాల్చారు! వృక్షం దాకలివాళ్లి భుజాలమీది కెక్కింది.

రంగులతో అలంకరించుకొన్న విగ్రహాలు ఎర్రని వృక్షంచుట్టూ కలపతోరణాలు, దాసునికి వూరంతా కలిసి ఇచ్చిన నేరేడు పండురంగు పట్టుపంచె,—వెన్నెల్లో మెరిసేనున్న మేసిన గుడి,...ఈ రంగురంగుల కలయిక హరివిల్లు చూసినట్లుగా...కనుల పండుగా వుంది!

అందరిముఖాలు పున్నమి వెలుగులానే మెరిసిపోతున్నాయ్! దాసుడు పీఠాధిపతిలా వృక్షంముందు నిల్చున్నాడు.

నీలమ్మగుడి ఎదురుగా రెండేళ్లక్రితం కొబ్బరితోట వుండేది. 1948 లో పెద్దగాలివాన నాలుగుచెట్లని తప్పించి, మిగతావాటిని

# దగాపడినతమ్ముడు

— ౮

పూశ్చేసింది. ఆ స్థలంలోనే డప్పులు మోగుతున్నాయ్! ఉత్సాహం ముసలివాళ్ళలో కూడా తాండవించింది. పెద్దవాళ్ళ భుజాల మీద చిన్న కుఱ్ఱవాళ్ళు కూర్చుని చూస్తున్నారు. చుట్టుపట్ల గ్రామాలనించి వచ్చిన చుట్టాలు, బంధువులూ, మరింత ఉత్సాహం చూపిస్తున్నారు.

డప్పులు "ఛినక ఛినక్ సో..."అనిమందంగానే మోగటం మొదలు పెట్టాయ్. ఒక విదేశీకుఱ్రాడు మొగ్గలు వేస్తున్నాడు. డప్పులవాళ్ళు గంతులేస్తూ బాదుతున్నారు.

ఇంకో ముసలాడు ముందుకు వచ్చాను పళ్ళూడినా, "ధంజొనకడి ధంజినకడి!"— అని డప్పులవాళ్లను యెగరకొట్టున్నాడు!

"ఇదిగో...వచ్చాడూ!?" అన్న తృప్తి చుట్టూ మూగిన వాళ్లల్లో ఒక్కసారి అవతరించింది! చెక్కు చెదరని ఉక్కులాంటి శరీరం! పంచె లంగోటీలా ఎగగట్టి, మీసాలు మెలు పెడుతూనే రంగంలోనికి పిల్లిమొగ్గతో మధ్య కురికాడు. నలుపైనా నిగనిగలాడే దేహచ్ఛాయ! పొడుగాటి ముక్కుకుతగ్గ పుబ్బిన పెద్దముఖం! కళ్ళు కళకళలాడుతున్నాయ్! మెడలో కాశీతాడు, మణికట్టుకు మరొక నల్లత్రాడు! అదే చెపుంది గరిడీలో వాడు ఘటికుడని! గూటాల్లాంటి దండలు, దూలాలవంటి తొడలు! అంత మనిషి ఒక్క యెగురుఎగిరి గాలిలో తేలిపోతున్నాడు. ప్రతీ కీలు సులభంగా త్రిప్పుతున్నాడు. గేరాగిరజాలు వీపుకు అంటీఅంటనట్టుండి ఎగురుతున్నయ్. వాడే మరెవడూకాదు...పుల్లయ్య!

డప్పులవాళ్లు ఒకచోట నిల్చోలేక పోయారు. అదిగో ముందుకు వెనక్కి రొప్పుక పోతున్నారు.

"ఝునక్ ఝునక్ ఒక్కటికడి ఝునక్ ఝునక్" పుల్లయ్య ఆటకి డప్పులన్నీ కూడి దగ్గరకువచ్చి మోగుతున్నయ్. ఆ చుట్టుపట్ల పది గ్రామాలకీ పేరుపడ్డవాళ్ళు... పుల్లయ్య ఆటకి...అప్పుడప్పుడూ డప్పులు ఆగిపోతున్నాయ్! పెటిపోతున్నాయ్! భళిరా పుల్లయ్యా! అని ప్రజలరుస్తున్నారు!

ప్రక్కన గడ్డి మంటవేసి డప్పులు కాచుకున్నా పోటీకి నిల్చోలేకపోతున్నాయ్! అప్పుడే రెండు డప్పులు పెట్లిపోయాయి. పులి ఆట ఆడుతూ అడుగులువేస్తున్న పుల్లయ్య దప్పున ఆగిపోయాడు; అందరూ గతుక్కుమన్నారు. డప్పులవాళ్ళ ముఖాలు మాడికాయ్! పుల్లయ్య అలసిపోయి ఓడిపోయాడు!!

పుల్లయ్య వాలిక కరుచుకున్నాడు. ఆ

...ఆ మొక్కకుండా మొగ్గలేశాడే! ఎంత వారపాలైపోయింది! గబగబ నీలమ్మతల్లి దగ్గరకెళ్ళి ఒక మొక్కు మొక్కాడు! దానుకి దండంపెట్టాడు! దానుడు చిన్న నవ్వు నవ్వి "భళిరా! పుల్లయ్యా!" అన్నాడు. పుల్లయ్య ఒక్క ఎగురు ఎగిరాడు. ఆ ఊపుతో రంగంలో వచ్చాడు! డప్పులవాళ్ళు కొయ్యబారిపోయారు. వాళ్ళ చేతులకు శక్తి లేనట్లుగా డప్పులు మోగుతున్నయ్. అందరూ గుసగుసలాడుకుంటున్నారు. "పుల్లయ్య, పుల్లయ్య తక్కువోడా?" "ఆడికి గరిడీలో మెట్టుపట్లు మించిన మగోడున్నాడా? లేడు...లేడు...నిబద్దిగా లేడు!" అంటున్నారు.

గర్వంతో ఒక ముసలాడు మీసం దువ్వుతున్నాడు. తనకు గురువు పుల్లయ్య అయినందుకు ఒక చిన్న కుర్రాడు, నవ్వుతూ హాయిగా భుజాలు తట్టుకున్నాడు.

పుష్పకం కదిలింది. ప్రజకదిలారు. ముందుగా చిచ్చుబుడ్లు వెలిగాయ్.

ఊరిలో ప్రతి ఇంటి దగ్గిరా పుష్పకం ఆగుతోంది. ఇల్లాళ్ళు బెల్లం వడపప్పు, అరటిపళ్ళు, నీలమ్మ తల్లికి ఇస్తున్నారు. ఇంటిని చూచి మరీ దానుడు నీలమ్మ భాగాన్ని తీసుకుంటున్నాడు. కొందరు చీరలు చూపించి మొక్కుతున్నారు.

పెద్దరైతు ఇంటి ఎదురుగా మళ్ళీ చాలాసేపు ఆగారు. పుల్లయ్య చేత బాణాకర్ర పట్టుకుని సాముకు లంఘించుకున్నాడు. "ధంజినకడి, ధంజినకడి" అనే శబ్దంతో చెవులు బద్దలైపోతున్నాయ్. రాకెట్‌లా గాలిలో కర్ర తిరుగుతోంది. కంటికి కనబడ్డంలేదు; డప్పులు ఆగిపోతున్నాయ్. అదిగో ఆగిపోతున్నాయ్! ఇదిగో ఆగిపోయాయ్! చెమటలు కక్కుతున్న పుల్లయ్య ఫకాలుమన్నాడు. ప్రజలంతా ఒక గొంతుకతో కేక వేశారు "భళీ! భళీ!!".

అవును—పుల్లయ్య పెద్దరైతు ఇంటి అరుగుమీద మూగిన యౌవనంతో బలిసి మిసమిసలాడే సువాసినుల హృదయాల్లో—అదేదో అనుభూతి కలిగిస్తున్నాడు.

పుష్పకం కదిలిపోతూంది! ప్రజకదులుతున్నారు. పెద్దవీధిలో మరి రెండుచోట్ల గరిడీ పెట్టారు. పుల్లయ్య శిష్యులు గురువు పేరు నిలబెట్టారు. పెద్దవీధి చివర పుష్పకం ఆగింది. ఎదురుగా కలకత్తానుంచి మదరాసుకు పోయే ట్రంకురోడ్డు వుంది. రోడ్డు రెండో వైపు రెండు వీధులున్నాయ్. పుష్పకం రోడ్డు దాటేముందు మళ్ళీ డప్పులవాళ్ళు శక్తిని కొలుకున్నారు.

పుల్లయ్యపిల్లి మొగ్గతో రోడ్డుప్రక్క చేనడి దాను. మళ్ళీ లేచినిల్చుని గిరిమట్టూ తిరిగాడు. ఆ వేళ సంతనుంచి వస్తున్న బళ్ళ సమూహం ఈ ఉత్సవాన్ని చూసి ఆగింది. బళ్ళు ఎక్కి బండినాయుళ్ళు చూస్తున్నారు. మధ్యకొచ్చాడు ఒక కుర్రాడు. మూడు పదూళ్ళ దీన పాపడు! తొడలుదరుచుకొంటూ గంతుతున్నాడు. డప్పులవాళ్ళు గాలిలో ఎగిరిపోతున్నారు. మూతి బిగించి కుర్రాడు వాళ్ళకంటే హుషారుగానే ఎగురుతున్నాడు. ముగలు పొంగి వున్నయ్. గోచీ వూడిపోతూంది! అరకాళ్ళు నిండకపోయినా ఎక్కడ కండ అక్కడుంది. చూపుకి ముద్దుగా, ముచ్చటగా వున్నాడు. అంతా ఆ కుర్రాడిని చూసి వుబ్బిపోతున్నారు.

పుల్లయ్య శిష్యుణ్ణి చూసి "వహవ్వా" అనుకున్నాడు. ఒక్కసారి మధ్య కురికి పిల్లిమొగ్గవేసి కదలకుండా ఒక్కచోటే నిల్చున్నాడు. తల ఆ మెత్తని భూమిమీద ఆన్చాడు. డప్పులాగిపోయాయ్. పాపడు గబగబ పుల్లయ్య గాలిలో వున్న పాదాలవరకూ తాటిచెట్టు యెక్కినట్లు యెగబ్రాకుతున్నాడు. పుల్లయ్య కొనుకో లేదు! కుర్రాడు జారిపోతాడు!! తప్పక జారిపోతాడు!!! అందరూ...బండినాయుళ్ళతో సహా గొణిగేశారు......కుర్రాడు రెండు పాదాల మీద తనచిరు పాదాలు వేస్తున్నాడు...!

నిశ్శబ్దం! నిశ్శబ్దం!! నోళ్ళన్నీ తెరచి వున్నయ్: ముఖాలన్నీ మీదికి ఎత్తి చూస్తున్నయ్.

ఒక్క విజిల్...పాదాలమీద నిల్చున్న కుర్రాడు, భుజాలుతట్టి నవ్వుతున్నాడు!

ఆహా!...భళి...భళి!...ప్రజల కంటి రెప్పలు పడటం లేదు. గుండెలమీద పిడికిళ్ళు పట్టుకున్నారు. పుల్లయ్య ఊపిరి బిగపట్టాడు!

నిలవనీటిలో ఒక బెడ్డవేసినట్లు...తరంగాల్లా వచ్చి పుల్లయ్య చెవులో మాటలు దూరాయ్. ఎవరది? బండి నాయుడే?... "ఇంకెవరికంత సాహసం వుంటాది? ఆకిందోడి కొడుకే మీదోడు!!"

పుల్లయ్య కళ్ళు కాయలు కాసిపోయాయ్. ఆ అన్న మనిషిని చూడాలి! తప్పక చూడాలి! పాపడు బిగిపోయాడు. ఎదురుగావున్న బండినాయుడే! ముసలాడిగా లేని ముసలాడు—వయసులో వున్న ముసలాడు—ఉత్సాహంలో కుర్రాడు. ఇంకా మురిసిపోతూ జొక్కు నోరు విప్పి నవ్వుతున్నాడు.

బళ్ళు కదులుతున్నాయ్. ముసలాడు కొరడాలో దున్నపోతులను అదిలిస్తూ "అదృష్టం అంటే అలాగుండాలి! అయ్య పేరు నిలిపే పాపల్ని కన్నాడు!"

బళ్ళు కదిలిపోయాయ్! పుష్పకం కదిలిపోతూంది! ప్రజాకదులుతున్నారు. పుల్లయ్య కదల లేక పోయాడు!

అవును! కొడుకు!! నా కొడుకు!! నాకా కొడుకు?! నా కెందుకు కొడుకుండకూడదు? నాకూ కొడుకుకావాలి! కావాలి!

ముచ్చటగా, ముద్దుగావున్న పాపడు! అదూ నాలాగే గెరా గిరజాలు పెడ్డాడు! నలుగురిలో నూ మెప్పు తెస్తాడు! దేనికి జడవడు! ఆడిని గరిడీలో ఘటికుణ్ణిచేస్తాను. మాటన్నాడంటే పేణంపోయినా నిలబడతాడు! దొంగల్ని పట్టే దొరవుతాడు! దోసిళ్ళతో దానం చేస్తాడు! మట్టిని నమ్మి సెమటకొర్చి మా పరువు నిలబెడతాడు!!

నా కొడుకు! నా కొడుకు!!

[ఇంకా వుంది]

# ఎదురుచూడని వరుడు

రచన: రావి కొండలరావు

కథానిక



అద్దంముందు కూచుని, పావుగంటగా తన మొహాన్ని తదేకదీక్షగా చూసుకుంటున్న లీల, వున్నట్టుండి ఒక్కసారి దిగ్గున వెనక్కి చూసింది. అంతసేపుగా ఆమె తన మొహాన్ని ఆ అద్దంలో చూసుకుంటున్నట్టు ఎవరన్నా కనిపెడుతున్నారేమో ననే అనుమానం అప్పటికి కలిగింది లీలకు. చుట్టూచూసి, ఎవరూ లేరని, నిర్ధారణ చేసుకుని, కుర్చీలో సర్దుకుని సరిగా కూచుని, మళ్ళి అద్దానికి వప్పజెప్పింది తన మొహాన్ని. మొహాన్ని ఒక ప్రక్కకు వాల్చి, జడను భుజంమీదనుంచి ముందుకు వేసింది. నిదానంగా కుర్చీలో కూచుని చిన్న చిరునవ్వు నవ్వుతూ టేబిలుమీదున్న ఆ పెద్ద అద్దంలో ప్రతిఫలించిన తన బింబాన్ని చూసి మురిసి పోయింది!

ఎంత అందంగా వుంది తను! తనలో ఇంత అందం వున్నట్టు ఈనాడే తెలిసిందా? చాలామంది తనతో అన్నారు—"నువ్వు బావుంటావు" అని ఏమిటో అనుకున్నది. తనకున్నంత కళ్ళు ఇంకెవరికీ లేవని అమ్మ ఎన్నిసార్లో అన్నది.

"మా అమ్మాయికి అందం ఓస్వామ్మ" అని తనతండ్రి ఎంతమందితోనో చెబుతూ వుండగా తను చాటుగా విన్నది. "నీ ముందు ఆ సినిమాతారలు ఏపాటి లెద్దూ!" అని బావ చాలాసార్లు అన్నాడు. ఐనా బావమాటల కేం లెఖ్ఖ!...వట్టి వెర్రిబాగులమనిషి. ఈ సమయంలోనే ఆమెకు పాతవిషయాలు కొన్ని గుర్తొచ్చినై. చదువుకుంటున్న రోజుల్లో తనకు కొందరు కుర్రాళ్ళు ప్రేమలేఖలు రాశారు. ఆ ఉత్తరాల్లో వాళ్ళు తనను వర్ణించిన ఆవర్ణన...వర్ణనాతీతం! ఐతే ఈరకం ప్రేమలు తనుచాలా వినబట్టి, ఆ ఉత్తరాలకు కూడా ఆరకం ప్రేమల కిచ్చిన విలువనే ఇచ్చింది.

ఇప్పుడు లీలకు ఒకదిగులు పట్టుకున్నది. ఆమెకు పందొమ్మిది సంవత్సరాలు. అందం వున్నది—ఐనా ఇంకా పెళ్ళికాలేదు. ఎవరితోనూ నిశ్చయం కూడా జరగలేదు. దీనికి అనేక కారణాలున్నై. లీలతండ్రి పెద్దగా కట్నాలు పొయ్యగలిగే స్థితిలో లేడు. కొన్ని సంబంధాలు లీల తల్లితండ్రులకు నచ్చలేదు—కొందరు కుర్రాళ్ళు ఆమెకు బాగాలేరు! ఒకవేళ అన్ని బావున్నా ఏదో విషయంలో పేచీవస్తూ ఆ సంబంధం పనికి రాకుండా పోతున్నది.

లీల ఇంట్లో ఆమె మేనమామకొడుకు ఒకడున్నాడు. అతనిపేరు ఏమిటో ఎవరికీ తెలిసినట్టులేదు గాని, లీల పిలిచినట్టుగా అంతా 'బావా' అనే పిలుస్తారు. ఈ కుర్రాడు ఇరవైమూడేళ్ళవాడు-కాలేజీలో కొంత వరకూ చదివాడు-ఉద్యోగప్రయత్నం-మని

కీ అందం లేకపోలేదు-కొద్దిగా ఎక్కువగా వాగుతున్నట్టు కనిపిస్తాడు. అతని గదినిండా సినిమాతారల పటాలూ, అందమైన అమ్మాయిల బొమ్మలూ వేలాడుతూవుంటై. ఇవీ అతని పాత్రలో కొన్ని లక్షణాలు. ఈ 'బావ'ను చేసుకోటానికి లీలకు పెద్ద అభ్యంతరమేవుండగా-లీల తలిదండ్రులకు చిన్న చిన్న అభ్యంతరాలుకూడా వున్నై. ఐనా, బావ 'లీల నాదే' అనే ఉద్దేశంలో వున్నాడు.

కొన్ని నెలలుగా లీల తన పెళ్ళికోసం ఎదురుచూస్తున్నది. ఏమంటే, ఆమె తోడి పిల్లలందరూ పెళ్ళిళ్ళు చేసుకొని కాపురాలు చేస్తున్నారు. కొందరు తల్లులుకూడా ఐనారు. 'తగిన వరుడు దొరికేదాకా దీనికి పెళ్ళి చెయ్యను' అంటాడు తండ్రి. లీల ఒక్కత్తే తనకు బిడ్డ కావటంవల్ల. 'తగినవరుడు' అంటే ఎట్లావుంటాడో-ఎప్పుడు దొరకుతాడో లీల ఊహకు అందలేదు!

అద్దంలో కనిపిస్తున్న లీల ప్రతిబింబం దిగులుపడసాగింది. ఏదో ఆలోచిస్తూ నిట్టూర్చింది, అటు కదిలింది-ఇటు కదిలింది...లీల మనస్సు ఎక్కడికో పారిపోయింది.

"అద్దంలో చూసుకుంటున్నంతసేపూ ఎవరి మొహం వాళ్ళకు అందంగానే కనిపిస్తుంది." అంటూ ప్రవేశించాడు బావ సినిమాలో హాస్యనటుడు ప్రవేశించినట్టు! లీల ఒక్కసారి వెనక్కు తిరిగింది. తన ఆలోచనలను పాడుచేసిన బావకేసి చిరాగ్గాచూసి- "ఏమిటేఁ?" అన్నది దీర్ఘంతీస్తూ.

"ఏమిటో ఆ వేళాను గాని లీలా-ఈ రోజు మాత్రం నువ్వు చాలా అందంగా వున్నావు సుమా!" అన్నాడు మృదువుగా సినిమాలో హీరో పలికినట్టు. ఈ మాటకు లీల ఆశ్చర్యపడలేదు. ఎంచాతంటే-ఈ రకమైన డైలాగులు బావ ఉచ్చరించటం కొత్తకాదు.

"అట్లాగా" అన్నది లీల.

"నిజం" అన్నాడు బావ దగ్గరకుపోతూ.

"ఏమిటి కారణం?" అన్నది లీల.

"నాకు తెలుసు" అన్నాడు బావ సీరియస్ గా.

"చెప్పు"

"నేను వేరే చెప్పాలా? నీకు తెలీదు పాపం!...ఇంతకూ ఆ వచ్చిన వాడిని చూశాక ఆ ఆరటం అంతా ఎగిరి పోతుందిలే!" అన్నాడుబావ.

"ఏవచ్చినవాడూ-ఏమిటికథా?" అన్నది లీల ఆత్రంగా.

"మీ పెద్దనాన్నగారి ఉత్తరం చూడలా నువ్వు?...తెలిసే నా చాత మరోసారి చెప్పించుకోవాలని. నేను చెప్పనుపో" అన్నాడు బావ చిన్న పిల్లాడల్లే బుంగ మూతి పెట్టి.

"చెప్పుబావా!" అన్నది లీల ఇంకా చిన్న పిల్లల్లే బూరాలాగా మూతి బిగించి.

"నిజంగా తెలీదా లీలా?" అని కూచున్నాడు బావ.

"ఒట్టమ్మా"

"నామీదా?" అన్నాడు బావ నవ్వుతూ.

"అబ్బ...చెబుదూ మరీనూ!"

ఈ సంగతి లీలకు పాపం తెలీదని గ్రహించుకున్నాడు బావ.

గొంతు సవరించుకుని చెప్పటం మొదలెట్టాడు-

"అనగా అనగా ఒక వూళ్ళో లీల అనే అమ్మాయి వుందట-ఆ అమ్మాయి ఎంత అందమైందటా అంటే అంత అందమైనదట — అప్సరసలూ, వూ...మేనకలూ, రంభలూ"

"అసలు సంగతి చెబుతావా చెప్పవా?" అని లేచింది లీల.

"కథగా వొద్దా? ఆ మాట చెప్పావు కాదేం?...ఐతే విను. మీ పెద్దనాన్నగారు రేపు ఉదయం బండీలో ఇక్కడ దిగుతున్నారు. ఆయనతో పాటు 'ఒక పెళ్ళికుమారుడు' కూడా దిగుతున్నాడు నిన్ను చూసే ఉద్దేశంతో."

ఈ మాట వినగానే లీల గుండెలో దడదడ మనేశబ్దం ప్రారంభమైంది. మొహంలో ఏదో భావంరాగా, బావముందు దాన్ని అణచిపెట్టి-ఇష్టంలేనట్టు మొహం పెట్టింది. ఈ మొహం చూసేసరికి బావకు సంతోషం పెల్లుబికిపోయింది. తనకూ ఇష్టంలేనట్టుగానే మొహంపెట్టి - ఆమె చెవిదగ్గరగా నోరుపెట్టి 'గుసగుసల' ధ్వనిలో-"నీకేం భయంలేదు లీలా - నేనున్నాగా, చూసుకుంటాలే. అసలు ఆ పెళ్ళికొడుకు ఇంటిగుమ్మం ఎక్కనివ్వకుండా చెయ్యగలను. నువ్వు విచారించకు." అని అభయమిచ్చాడు-ప్రేయసిని రక్షించే రాజకుమారుడి ధోరణిలో.

"చాలే బడాయి" అన్నది లీల దిగ్గున లేస్తూ.

"బడాయికాదు లీలా—ఇది నగ్నసత్యం నా పరాక్రమం నువ్వెరగవు గాని—"

"ఇక నోరు మూస్తావా?"

బావ ఛటాలున రెండు చేతులతో నూ నోరుకప్పేసుకుని ఓక్షణం పోయాక నెమ్మదిగా "ఇదిగో ఉత్తరం. నీకంత నమ్మకం లేకపోతే—" అని అందించాడు.

"ఆ ఉత్తరాన్ని జేబులో పెట్టుకుని తిరుగుతున్నావా—అసలు అది ఎందుకుతీశావ్! అని గద్దించింది లీల.

"నీకు చూపిద్దామనే ఉద్దేశంతో తీసుకొచ్చాను"

బావచేతిలోంచి ఉత్తరాన్ని లాక్కుని చదివింది. తన పెద్దనాన్న తన తండ్రికి రాసిన కార్డు. దాంట్లో ముక్తసరిగా మూడు ముక్కలు మాత్రం రాసివున్నై.

"చి॥ రామనాధానికి—

శుక్రవారం బండిలో ఒక పనిమీద దిగుతున్నాను. నాతోపాటు నా స్నేహితుడి అబ్బాయిని వెంటబెట్టుకొస్తున్నాను లీలను చూస్తాడు. కావలసిన ఏర్పాట్లు చెయ్యి. మిగిలిన వివరాలు ముఖస్థంగా మాట్లాడుకుందాము. అంతా క్షేమం.

—శేషాచలం"

ఈ వుత్తరాన్ని లీల ఒకటికి రెండు పార్లు చదివింది. తనను చూడటానికి అబ్బాయి దిగుతున్నాడనే వాక్యం ఆమెకు ఎంతో హాయిగా కనిపించింది. సంతోషంలో ఒళ్ళుమరచి కూనిరాగం తియ్యబోతే ఎదురుగా బావకనిపించాడు!

"తెలిసిందా! ఇదీ సంగతి. ఇప్పుడేం చెయ్యటం?" అన్నాడు బావ దిగులుగా.

"ఏం చెయ్యాలో పోయి మామయ్యను అడుగు! చెప్తారు" అన్నది లీల.

"నీకు మతిపోయిందా ఏమిటి లీలా— ఈసంగతి మామయ్యను అడగటమేమిటి?" అన్నాడు బావ, తెలివైనవాడు నవ్వినట్టు నవ్వుతూ.

"నాకు తెలిదు ఐతే" అన్నది లీల.

"నన్ను నమ్ము. నీప్రాణానికి నాప్రాణం అడ్డువేస్తాను. ఆ పెళ్ళికొడుకు మన యింటి గుమ్మం ఎటాఎక్కుతాడో నేనుచూడనూ!"

లీలకు బాగా కోపం వచ్చింది. మొహం ఎరుపెక్కి—

"అనవసరంగా వాగక పోతావాపోనా?" అన్నది గట్టిగా. బావకు ఆశ్చర్యం వేసింది. ఈసారి ఆమెమాటలో 'సీరియస్ నెస్'ను కనిపెట్టి-లీలకు ఆ పెళ్ళికొడుకుమీద ఇష్టం కలిగిందని గ్రహించి" "చూస్తాగా-ఎట్లా వొస్తాడో...వాడూ వాడి తాతా..."అని ఏమేమో అరుస్తూ చరచరా బయటకు వెళ్ళిపోయివాడు సినిమాలో విలన్ కుమల్లే. లీలకు భయంవేసింది. ఈ బావకు అది తెలిసీ తెలియని జ్ఞానమో, నిజమో, ఆమెకు అర్థం కాలేదు. కొంపతీసి, ఏమన్నా చెయ్యరాని, పని చెయ్యడుగదా;...సరే, బావను మంత్రంతో కట్టెయ్యవచ్చునను కుని-రాబోయే వరుడినిగురించి ఆలోచనలోపడిపోయింది లీల.

ఇదివరకు ఎందరో తనను చూడటానికి వచ్చారు. అందులో ఒక అబ్బాయి తనకు వచ్చాడు, ఎంత బావున్నాడని! అచ్చంగా



గడపలో గొబ్బిళ్లు

చిత్రకారుడు : వెల్లటూరి పూర్ణానందశర్మ.

# ★ ఎదురుచూడని వరుడు ★

హీరోలాగా వున్నాడు. అటువంటివాడు తన భర్త అంటే తనకు ఎంత గర్వమో అనుకున్నది. తనభర్తను గురించి మిగిలినవాళ్లంతా ఎంతగానో చెప్పుకుంటారు!...ఐతే ఏవో కారణాలవల్ల ఆ సంబంధం కలిసి రాలేదు- ఆ సిరిసిల అబ్బాయి ఎలా మాత్రం?- బంధువులు అంతా బాగా చేస్తున్నారు. ఒక సంబంధాన్ని తానే తిరస్కరించింది. తనతండ్రి ఈమధ్య చూడబోతే! తను అర్థం చేసుకోగా అయిన వర్తించుకోలేదు. ఈ సంబంధం సుతరామూ తనకు ఇష్టంలేదు. ఎంచాతంటే ఆఅబ్బాయి మంచివాడు కాడట- అతను చాలామంది అమ్మాయిలకు ప్రేమలేఖలు రాశాడట! ఈరకమైన కుఱ్రాడని తనతో ఎవరో చెప్పగా, తనే ఈ సంబంధం వొద్దని నిర్ధారణ చేసుకున్నది. తన తండ్రి కూడా సంతోషించాడు...అవునుమరి. అటువంటి లాకాయిలూకాయివాడిని చేసుకొని తనేం సుఖపడేట్టు! ఇంకో అబ్బాయినికూడా తనే వద్దన్నది. ఉద్యోగంలేదు-సద్యోగం లేదు-ఎప్పుడో ఏవో చెయ్యబోతాడట- సిగరెట్లుమాత్రం విపరీతంగా కాలుస్తాడట! ...అబ్బ! ఈరకం మనుషులతో ఎవత్తె చెయ్యగలదు కాపురం!...

ఈవచ్చే వరుడు ఎట్లాంటి వాడో... తెల్లగా వుంటాడా?—అందంగావుంటాడా? డబ్బున్నవాడా?...నల్లగావుండి, కళగా వుంటాడా?... అని అనేకరకమైన ప్రశ్నలు వేసుకున్నది. ఈ ఆలోచనల్లో ఆమెకు ఒక ఇంగ్లీషు సినిమాలో హీరో ఎందుకో జ్ఞాపకం వచ్చాడు!

ఛటాలున లీల అద్దం దగ్గరకుపోయి తన మొహాన్ని చూసుకున్నది. ఈసారి ఇంకా అందంగా కనిపించింది. మొహాన్ని అద్దానికి దగ్గరగాచేర్చి, కొన్ని నిమిషాలపాటు రెప్ప వెయ్యకుండా చూసుకున్నది!

ఆక్షణంనుంచీ లీలకు మనసులో కొత్త భావాలు లేచినై. ఇదివరకుకూడా ఇట్లాగే పెళ్లికొడుకులు వచ్చినా అప్పుడెందుకో ఈ భావాలు కలగలేదు. ఈమధ్య లీలకు, తను వెంటనే పెళ్ళిచేసుకోవాలనే ఉద్దేశం కలగటంవల్లనే ఈభావాలు కలిగివుండవచ్చు. మొహంలో ఉత్సాహాన్ని ఏమాత్రం బయటకు కనిపించనివ్వకుండా వంటింట్లోకి పోయింది! తల్లి కాంతమ్మ కూర తరుగుతూవుంటే, ఆ ప్రక్కనేచేరి "నేను తరగనా అమ్మా?" అన్నది లీల.

"ఇదేం అమ్మా ఇవాళ? ఇప్పుడా సూర్యుణ్ణి పడమట అస్తమించనివ్వావా ఏం?" అన్నది కాంతమ్మ.

"పొద్దున్నే తూర్పున ఉదయించినవాడు ఇప్పుడు పడమటఅస్తమించక ఏంచేస్తాడులే!" అన్నది లీల వంకాయలు తీసుకుంటూ.

"నామాట విను. అవి నేను చేస్తా లే. ఎందుకు నీకీపని ఇవాళ? వెళ్ళి ఏ పుస్తకమో చదువుకోరాదూ?" అని, "రేపు పెళ్లివారొస్తున్నారు తెలుసా?" అన్నది కాంతమ్మ.

లీల మాట్లాడలేదు. ఆ విషయం తనకు తెలుసనిగాని, తెలీదనిగాని ఏమీ అనలేదు. తరిగిన వంకాయ ముక్కలను యెగరవేస్తూ కూచున్నది.

"మరీ చిన్నపిల్లలే ఏమిటే ఇదీ?" అన్నది కాంతమ్మ విసుక్కుంటూ.

"ఈరోజు ఏం వండుతున్నావమ్మా?" అన్నది లీల ఏదో అడగాలని.

"ఏదో నా మొహం. నువ్వు అవతలకు పోతేనే వంటా పెంటానూ. రేపు పొద్దున్నే వాళ్ళొస్తున్నారట—పెద్దనాన్నగారు ఉత్తరము రాశారు. పో—రేపటికి చీరలూ అవీ ఉన్నాయో లేదో చూసుకో. లేకపోతే ఆ బావను చాకలిదగ్గిరికి పంపు!" అన్నది.

"ఈ మాట ఆ బావ విన్నాడు కాదు. విన్నా నన్నా అమాంతం మింగేసి వుంటే వాడు!" అన్నది.

ఎం—ఇదివరకు ఎప్పుడే పని కావా న్నా చెయ్యటం లేదా ఏం?" అన్నది కాంతమ్మ

"అది కాదులే. ఇది వేరు!" అన్నది లేస్తూ లీల మామూలుగా.

గోడగడియారం ఆరు కొట్టింది. ఇంకా లీల మొహం కడుక్కో లేదు. ఆమెకు 'ఏమిటో'గా వున్నది. ఏమీ తోచటంలేదు. జడ విప్పుకుంటూ నెమ్మదిగా బావగదిలోకి దారితీసింది.

బావది పెద్ద 'గదేం' కాదు. ఐనా ఉన్నంతలో దాన్ని నీటుగా వుంచి, ఒక ప్రక్కగ మంచం వేసుకున్నాడు. ఇంకో ప్రక్క చిన్న బల్ల వేసుకుని దాన్నిండా ఏవేవో సినిమా పత్రికలూ, పుస్తకాలూ సరుకుంటాడు. లీల గదిలోకి ప్రవేశించేసరికి బావ మంచంమీద పడుకుని 'డిటెక్టివ్' నవల చదువుకుంటున్నాడు, అతనికి లీలమీద బాగా కోపం వచ్చింది. బావకు ఎవరిమీద ఎప్పుడు కోపం వచ్చినా చెయ్యాల్సిన మొదటి పని—చరచరా తనగదికి పోయి ఏ పుస్తకమో తీసుకుని, ధామ్మని మంచంమీద వాలబడి అదేపనిగా దాన్ని చదువుతూ వుండటం!

లీల నెమ్మదిగా ప్రవేశించటంవల్ల అతను గమనించలేదు. బావ తనమీద కోపంగా ఉన్నట్టు ఈ 'చదువే' చెబుతున్నది. తను ఒక్కసారి పలకరిస్తే చాలు—బావ కోపం అంతా ఎగిరిపోతుంది!

"బావా" అన్నది లీల కోమలంగా

ఈ పిలుపు బావ విన్నాడు. ఎందుకో మరింత కోపం వచ్చింది. లీల అనుకున్నట్టు ఈ ఒక్క పిలుపుకే ఆ కోపం అంతా ఎగిరి పోలేదు.

"బావోయ్!" అన్నది ఈ సారి గట్టిగా.

"ఇక్కడ లేదు!" అన్నాడు బావ పుస్తకంలోకి చూస్తూనే.

"లేదూ-పానీలే! నేను నీకోసం వచ్చాను!" అన్నది లీల.

"నాతో నీకేంపని?"

"చెబుతా గా"

అతను పలకనూ లేదు-ఉలకనూ లేదు.

"ఇదేం పుస్తకం బావా?" అన్నది లీల బావను మాట్లాడించే ఉద్దేశంతో ఒక నిమిషం నిశ్శబ్దంగా గడిచింది.

"ఇష్టంలేని పెళ్ళికొడుకులను చూడకుండా వుండాలంటే ఏం చెయ్యాలో ఏ పుస్తకాల్లోనూ రాయరు!" అన్నది లీల నిరుత్సాహంగా నిట్టూరుస్తూ.

ఈ వాక్యం బావకు నచ్చింది. ఐనా వూరుకున్నాడు.

"ఏం బావా!" అని మళ్ళీ కదిలించింది లీల.

"అటువంటివి పుస్తకాల్లో వుండవు. మన బుర్రల్లో వుంటాయి" అన్నాడు బావ పుస్తకంలోకి చూస్తూనే.

"ఏమోనబ్బా — నా బుర్రకేం తట్టటం లేదు!" అన్నది లీల.

ఒక నిమిషం పోయాక, ఏదో ఆలోచించి బావ లేచాడు.

"నీకు నిజంగా అతన్ని చూడాలని లేదా లీలా?" అన్నాడు.

"ఎందుకుంటుంది చెప్పూ—"

"మరిందాక ఆ మాట చెప్పలేదేం?"

"నీతో చెప్పడం ఎందుకు—నేనే ఆలోచిద్దామనుకున్నాను"

బావ తనలో గొప్పతనం వున్నట్టు నవ్వి, "నేను ఆలోచిస్తాలే" అన్నాడు.

"ఐతే మామూలుగా నేను ఆ అబ్బాయిని చూస్తాను. అంతే. అమ్మవాళ్లతో 'నా కొద్దు - బాగాలేడని చెప్పేస్తాను. ఏం?' అన్నది లీల.

"రాకుండానే చేస్తే?" అన్నాడు బావ.

"పాపం రానిద్దాం. ఏంపోయింది! ఇది వరకు ఎంతమంది చూశారు కారు-అందులో ఇతనొకడు!" అన్నది లీల.

"అంతేనా?" అన్నాడు బావ జయించినట్టు మొహంపెట్టి.

"అంతే" అన్నది లీల బావ మొహంలోకి చూస్తూ.

ఈ చూపుకు బావ ముగ్ధుడైపోయాడు. ఈ మధ్య ఎప్పుడూ అతను లీలదగ్గర ఈ రకమైన చూపు వున్నదని గ్రహించలేదు. వెంటనే కళ్ళుమరచి ఉషారుగా "లాలా లలలా" అంటూ రాగం ఆలపిస్తూ అద్దంముందు నించుని అదేపనిగా తలదువ్వుకోటం ప్రారంభించాడు!

## ఆఫీసు పని

ఆఫీసులో హెడ్ గుమాస్తా తన క్రింది ఉద్యోగితో—

హె. గు: ఇంటిపని ఆఫీసులో చేస్తారేమండి మీరు?

ఉ: నేను కాకపోతే నా యింటి పని ఎవరుచేస్తారండి? ఆఫీసు పని నేను తప్పితే మరి యొకరు చేస్తారు.

* * *

హె. గు: పని చేయకుండా ఖాళీగాకూర్చున్నారేమండీ?

ఉ: పని చేయడం ఖాళీగా కూర్చోటం ఒకేసారి ఎలా సాధ్యమవుతుందండీ!

టి. వి. శాస్త్రి.
హైదరాబాదు.



# ఎదురుచూడని వరుడు

ఆరాత్రి లీలకు నిద్రపట్టలేదు. పదకొండు కొట్టినా పక్కమీద అటుదొర్లింది—ఇటు తిరిగింది—లేచి ఇంటిముందు తోటలోకి వచ్చింది. తోటంతా వెన్నెల్లో మెరిసి గుమ్మెత్తిపోతున్నది—పూల వాసనలతో. అంతా నిశ్శబ్దం. ఈ వాతావరణంలో లీల మనసులో వింతవింత భావాలు లేచినై. ఆ వెన్నెల్లో ఒకచోటరాబోయే ఆ పెళ్ళికొడుకుకూడా ఆమెకు కనిపించాడు. ముందు ముందు తన వైవాహికజీవితాన్ని తలచుకుంటూ, ఆచందమామను చూస్తూ ఆతోటలో వున్న అరుగుమీద అట్లాగే ఎంతసేపో కూచున్నది లీల!

తెల్లవారిన దగ్గర్నుంచీ అంతా హడావుడే! రామనాథంగారు ఏదోఏర్పాట్లు చేస్తున్నాడు—కాంతమ్మగారు వంటలు చూసుకుంటున్నది—లీల సరేసరి—తన అందాన్నంతా ఈరోజు ఒకలబోయ్యటానికి సిద్ధపడుతున్నది. చక్కగా తలంటుపోసుకున్నది-మల్లెపువ్వులాంటి సిల్కుచీర కట్టింది. అద్దం ముందు కూచుని, తలదువ్వుకుంటూ వుంటె బావవచ్చాడు. అందరి సందడితోపాటు బావకూడా సందడిగానే వున్నాడు. ఉషారుగా లీల దగ్గరకొచ్చి "వచ్చేవేళయింది" అన్నాడు నవ్వుతూ. లీలకూడా నవ్వింది.

"సరదాగా వాడినికొన్నేపు ఏడిపించరాదూ?" అన్నాడు బావ నవ్వుతూ.

"అబ్బ...అదె నీదగ్గరున్నది. వద్దంటే వినిపించుకోవుగదా" అన్నది లీల చిరాగ్గా.

"సారీ—పూరికే అన్నాను...కాని లీలా...ఏమిటి ఇంత అందంగా వున్నావు?" అన్నాడు బావ.

"నేను ఎప్పుడు అందంగా లేనో చెప్పు!" అన్నది లీల.

బావ చెప్పలేకపోయాడు. "అహా!... ఇవాళ ఎంతో—అందంగా కనిపిస్తేనూ" అన్నాడు 'ఎంతో'ను సాధ్యమైనంత సాగదీస్తూ.

సుమారు పదకొండు గంటలవేళకు, ఇంటి ముందు బండిఆగిన చప్పుడుకాగా రామనాథం బయటకు వచ్చాడు. శేషాచలం బండి దిగాడు—"ఏంరా" అని పలకరిస్తూ. అతనివెనకాలే పాతికేళ్ళ అబ్బాయి కూడా దిగాడు. రామనాథం శేషాచలాన్నీ ఆ అబ్బాయినీ లోపలకు తీసుకుపోయాడు. ఆ అబ్బాయి ముందు గదిలో కూచుని, గోడలకేసీ, పటాలకేసీ చూడసాగాడు. "నాకు త్వరగా స్నానానికి ఏర్పాటు చెయ్యి. కోర్టుకు పోవాలి" అన్నాడు శేషాచలం ఆదుర్దాగా.

"స్నానానికి అంతా సిద్ధంగానే వుంది-పద!" అన్నాడు రామనాథం. శేషాచలం రెండు నిమిషాల్లో స్నానంచేసేసి, అదరాబాదరాగా నోట ఇంత అన్నం కుక్కుకుని-చరచరా బయటకుపోతూ ఆ అబ్బాయితో-"అబ్బాయ్. సాయంత్రం వస్తాను. కోర్టుకు టైమైంది. మొహమాటం పెట్టుకోకుండా భోజనం చెయ్యి?" అని సమాధానంకోసం కూడా ఆగకుండా బండెక్కాడు. శేషాచలానికి కోర్టువేళ మించిపోతున్నది. "సాయంత్రం అంతా మాట్లాడదాంరా!" అన్నాడు రామనాథంతో. భోజనంచేస్తున్నప్పుడు కాంతమ్మ "అంతా కులాసాగా వున్నారా?" అంటే-"ఆ" అని మాత్రం వూరుకున్నాడు.

"ఏం బాబూ! స్నానం చేస్తారా?" అని అడిగాడు ఆ అబ్బాయిని. "చేస్తానండీ!" అని లేచాడు అబ్బాయి.

అతను స్నానానికి పోతూవుంటే చాటుగా నించుని లీల అతన్ని చూసింది. అబ్బాయి అందంగానే వున్నాడు మనిషి పొడుగు-చామనచాయ. ముక్కు కన్నూ తీరుగా వున్నై. చక్కగా మెలికలు తిరిగిన జుట్టు నుదుటిమీద పడుతూవుంటే-అందులో లీలకు ఎంతో అందం కనిపించింది! లీలకు అంతటితో సంతృప్తి కలుగలేదు. ఆ అబ్బాయీ తనను చూడాలి!

స్నానంచేసి వస్తూవుంటే, బావ అతన్ని ఎగాదిగా చూశాడు. ఈ బావచూపును ఆ అబ్బాయి గమనించాడుగాని, లక్ష్యపెట్టలేదు. చావిట్లోనే వున్న తన పరుపు విప్పుకుని ఒక పైజమా, చొక్కాతీసి తొడుక్కున్నాడు. తల దువ్వుకుంటూ వుంటే బావ ప్రవేశించి ఎదురుగా కుర్చీలో కూచున్నాడు. రెండు నిమిషాలు పోయాక రామనాథంగారు భోజనానికి తీసుకుపోయాడు. భోజనం దగ్గర రామనాథం ఏదన్నా మాటాడదామా అని నోటి దాకా వచ్చి-తన అన్న వుంటే అన్నీ ఒక్కసారి మాట్లాడుకోవచ్చునని వూరుకుని-పేరు మాత్రం అడిగాడు—

"చంద్రశేఖరం అండీ!" అన్నాడు అబ్బాయి, భోజనం దగ్గర ఎక్కువగా మొహమాట పడుతూ.

"అంత మొహమాట పడకండి. మీ యిల్లే అని భావించుకోండి!" అన్నాడు నవ్వుతూ రామనాథం. చంద్రశేఖరం చిన్నగా నవ్వి భోజనం పూర్తిచేశాడు.

ఆపూట లీల నోట్లోకి రెండు మెతుకులు కూడా పోలేదు. ఆమె కడుపునిండా కావలసినంత సంతోషం నిండిపోయే వున్నది!

లీలకు చంద్రశేఖరం నచ్చాడు. ఐతే, అతను రాకపూర్వం అతన్ని ఇంకోవిధంగా వూహించుకున్నది. ఆవూహకు పరిపోక పోయినా ఈఅబ్బాయి బాగున్నాడనుకున్నది. పోతే ఆమెను ఒకబాధ వేధించసాగింది. అతనుమాత్రం తనను చూడలేదు. ఎట్లాగన్నా అతనికంట పడాలనే కోరిక ఆమెలో బాగా పనిచేస్తున్నది బావ ఒకడు అడ్డువస్తున్నాడు. పైగా నిప్పు తొక్కిన కోతల్లే అటూ ఇటూ తిరుగుతున్నాడు! నీ గదిలోకిపోయి కూచోరాదా' అంటే ఏమనుకుంటాడో అని లీల వూరుకున్నది.

"సాయంత్రం అమ్మాయిని చూపిద్దామా ఏమిటి?" అన్నాడు రామనాథం.

"మీ అన్నయ్య లేకుండా ఎందుకూ?-ఆయనకూడా రానీండి. ఐనా మనం చూసుకోలేదుగాని, ఈరోజు అంత మంచిరోజుగా కూడా కనిపించటంలేదు" అన్నదికాంతమ్మ.

రామనాథం కొంచెం తక్కువగా ఆగి, ఏదో ఆలోచించి "అవును రేపు దివ్యమైనరోజు" అన్నాడు.

మధ్యాన్నం ఒంటిగంట దాటింది. రామనాథంగారు తనగదిలో నిద్ర పోతున్నాడు. కాంతమ్మ ఇంకా ఆవంట గదిలోనే ఏదో పనిచేసుకుంటున్నది. బావ తనగదిలోనే వున్నాడు — నిద్రపోతున్నాడో చదువుకుంటున్నాడో తెలీదుగాని! శేఖరం ముందు



## సంక్రాంతి బొమ్మలకొలువు

ఫోటో : సి. ఎస్. రావు—రాజమండ్రి.

గదిలోనే చాలాలు విప్పి జేరబడి, ఏదో పుస్తకం చదువుతున్నాడు. లీల తనగదిలో కూచుని కలలు కంటున్నది.

పది నిమిషాలు పోయాక నెమ్మదిగా లేచి వంటగదిలోకి పోయి చూసింది. అక్కడి నుంచి తండ్రి గదిలోకి పోయింది. తర్వాత బావ గదికేసి వెళ్ళింది. బావ మంచంమీద వెల్లకిలా పడుకుని దూలాలకేసి చూస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అడుగుల చప్పుడు విని, లీలను గమనించినా పలకరించ లేదు.

"ఏదన్నా పుస్తకం ఇవ్వు బావా— చదువుకుంటాను" అన్నది లీల పుస్తకాలను వెదకుతూ.

"నీకు పనికొచ్చేవేం లేవు" అన్నాడు బావ.

ఈ వ్యంగ్యధోరణి లీలకు సరిగా అర్థం కాక-ఏదో ఆలోచనలో వుండి- "ఏదో ఒకటి ఇద్దూ" అని డిటెక్టివ్ పుస్తకం ఒకటి తీసింది. "మహాఘోరం!" అన్నది చూస్తూ.

"అమ్మయ్యో – అదొద్దు లీలా – పట్ట పగలే భయం!" అన్నాడు బావ.

లీల ఫక్కున నవ్వి- "ఐనా నాకీ పుస్తకాలొద్దు. ఏమిటో ఏది చదివినా ఒక్కలాగే కనిపిస్తున్నది," అన్నది.

"అందులో మజా నీకేం తెలుసు?" అన్నాడు బావ. ఆ 'మజా'ను బాగా ఆస్వాదించినవాడల్లే.

"నాకీ పుస్తకం అక్కర్లేదు! పోయి పడుకుంటాను" అని బయటకు పోసాగింది.

"లీలా!" అని పిలిచాడు బావ.

లీల వెనక్కు తిరిగింది.

"అబ్బాయిని చూశావా?" అన్నాడు;

"ఫో—" అంటూ తన గదికిపోయింది.

"హా హా హా హా" అని నవ్వాడు బావ.

ఏదో చప్పుడవటంవల్ల కాగా, ముందు గదిలో వున్న శేఖరం తల ఎత్తి చూశాడు. సావిట్లోంచి ఏదో తీస్తున్న లీల కనిపించింది. లీలకూ శేఖరం కనిపించాడు. ఒక్క క్షణం వాళ్ళిద్దరి కళ్ళూ కలుసుకున్నై! అంతలోనే లీల సిగ్గుపడుతూ చరచరా వెళ్ళిపోయింది! ఈ చూపుకు అతని గుండెలు టపటపా కొట్టుకున్నై. ఆమె అందాన్ని చూసి, ముగ్ధుడై, చదువుతున్న పుస్తకాన్ని అటు పారేసి ఆలోచనల్లో పడిపోయాడు శేఖరం!

ఆ సాయంత్రం దీపాలువెలిగిస్తూ కాంతమ్మ అబ్బాయి విషయమై అడిగింది — "కుర్రాడు బాగానే వున్నాడు కదూ?"

"అవును – చాలా నెమ్మదయిన వాడు. బుద్ధిమంతుడులాగా కూడా వున్నాడు" అన్నాడు రామనాథం.

"కట్నం అదీ కొంచెం మాట్లాడుకుంటే ముహూర్తం పెట్టుకోవచ్చు" అన్నది.

"అన్నయ్యగారికి. ఐనా ఆ విషయాలను ఈ అబ్బాయి పెద్దవాళ్ళకూడా వచ్చి మాట్లాడాలిగా!" అన్నాడు రామనాథం.

"లీలను చూస్తే అతను అన్నిటికీ ఒప్పుకుంటాడని నా అభిప్రాయం!" అన్నది.

(99-వ పేజీ చూడండి)

సంక్రాంతి అభివందనములతో

ప్రేక్షక మహాజనులకు సమర్పించు

మా రాబోవు కానుకలు

తప్పక చూడండి!

నంది వారి

శ్రీకృష్ణగారడి







నంది పిక్చర్స్ వారి

సౌభాగ్యవతి

మోహినీ రుక్మాంగద

అనుపమ వారి

మాలపల్లి

కాటమరాజు కథ

ప్రకాష్ స్టూడియోస్ వారి

రాజద్రోహి

వి. టి. ఫిలిమ్సు వారి

ఉత్తరగోగ్రహణం

ప్రొడక్షన్ నెం 1

ప్రొడక్షన్ నెం 1

# ప్రభాత్ పిక్చర్సు (ప్రై) లిమిటెడ్....

విజయవాడ.... సికింద్రాబాద్..

N.P.R

NVKR-VJA..




వి. పరబ్రహ్మశాస్త్రి

మరి ఆ తరవాత చాలా బోల్డురోజులనించీ నేను మీకు కనిపించటంలేదుగందా! మాంచేత కొనిని వందలమంది నాకు ఉత్తరాలు రాసేస్తున్నారు. మరిమ్మన్నట్లు, ఏం తమాషా, జరిగిందినే!

అవ్వాళ ఆదివారం. యిస్కూలుకేమో శెలవు. నాన్నకూడా ఆఫీసుకి శెలవు. అంచేత, అమ్మ లడ్డూలు చేసింది. నాకేమో ఒకటో, మూడో పెట్టి మిగతావన్నీ దాచేసింది. అప్పుడు నాకు భలే కోపంవచ్చేసింది. అయినా మాంచి అయిడియా తట్టిందిలే. రాత్రి అందరూ పడుకున్నాక, నెమ్మదిగా, వంటింట్లోకి (బామ్మ ఆఫీసు గది) వెళ్ళాను. లడ్డూల కొరకే తీస్తుంటే ఎవడో వచ్చి వెనకనించి, నా కళ్ళు మూసేశాడు. "ఉత్తినే తీస్తున్నాను. నిఝంగా తినటానికి కాదు" అని చెప్పినా వాడు వినలేదు. కొంచెం సేపు ఆగి, నన్ను దొడ్లోకి లాక్కుపోయాడు. ఆశ్చర్యం! అక్కడో విమానంవుంది. వాడు, నన్ను ఆ విమానంలోకి యెక్కించేశాడు. అది, గభిక్కున, బుయ్‌మంటూ, ఝామ్మని, మాయింటిమీద ఝెండాకంటే, పక్కింటి పిన్నిగారి కొబ్బరిచెట్టుకంటేగూడా, ఇంకా బోల్డు ఎత్తు పైకి ఎగిరిపోయింది. "ఒరేయ్ విమానం వాడూ, నన్నెక్కడికి తీసుకుపోతున్నావు" అని అడిగితే, వాడు మొద్దట చెప్పలేదు. కాంతేత బాబాయిని పిలుస్తానని భయపెట్టేశాను. పాపం, వాడు భడిసిపోయి, 'మరేం లేదు. మా చంద్రలోకంలో నీలాంటి అబ్బాయి వొకోడు వున్నాడు. వాణ్ణిన్ను తీసుకురమ్మన్నాడు." అని చెప్పేశాడు.

విమానం మబ్బుల్లోంచి, భలే స్పీడుగా పైకి ఎగిరిపోతోంది. విమానంవాడు "నీకు భయం వేస్తోందా" అని అడిగాడు.

అప్పుడు నేను "నాకు విమానాలంటే భయం లేదులే. కిందటి జన్మలో చాలాసార్లు బోల్డు విమానాలూ, నిఝంఝుటకాలూ ఎక్కేవాణ్ణి" అని చెప్పాను. నిమ్మిషంలో, మా విమానం, చంద్రుడిదగ్గిర్కి వచ్చి, చంద్రలోకంలోకి వచ్చేసింది. అక్కడంతా చీకటిగావుంది. 'మీవూళ్లో ఎలక్ట్రీదీపాలూ అవీ లేవా. ముందస్తుగా చెపితే, మా బామ్మనడిగి ఓదీపం తెచ్చేవాణ్ణిగదా' అన్నాను. అప్పుడు వాడు నవ్వేసి, "హుబ్బే! యిదంతా వూరి బయటచోటు. మాంచేటిలా చీకటిగా వుంది. వూళ్ళోకిపోతే ట్యూబులైట్లూ, కిర్సనాయిలు బుడ్డీలూ అవీ అన్నీ వుంటయ్యి" అని చెప్పాడు. యింతలో విమానం, ఓ మేఘం దగ్గరికి వచ్చి ఆగిపోయింది. విమానంవాడు నన్ను ఆ మేఘంలోకి రమ్మన్నాడు.

సరేనని, నేను యింటోకి వెళ్లాను. మా యెదురుగ్గా ఓ చిన్న అబ్బాయి వచ్చేసి, నన్ను గాటిగా ముద్దెట్టేసుకున్నాడు. "ఒరేయ్! నీ పేరేమిట్రా అని అడిగాను; వాడు వెంటనే. "నా పేరు బుడుగు" అన్నాడు. "మరి నేను బుడుగు నేకందా" అని అరిచేశాను. అప్పుడు వాడు "నీపేరు B బుడుగు, నా పేరు C. బుడుగు. B. అంటే భూలోకం, C. అంటే చంద్రలోకం" అని చెప్పేసి, నన్ను చూసి కొంచెంసేపు నవ్వేశాడు. నాకుకోపంవచ్చేసి వాడితో "అలా నవ్వకూడదు. నవ్వితే నాల్గు నష్టాలుట" అన్నాను. అప్పుడువాడు "ఓస్ మరి నాలుగుఅంటే మా చంద్రలోకంలో సున్నాగందా, అందుకని యేం నష్టం వుండదు" అన్నాడు.

"ఒరేయ్ C. బుడుగూ, అన్నట్టు నా సంగతి, నీకు ఎల్లా తెల్సిందిరా" అని అడిగాను. "ఓస్స! మాయింట్లో, ఓ పేద్ద మాజిక్కు అద్దం వుందిలే! దాంట్లో, నువ్వూ, మీ శిగానపెసూనాంబా, ప్రక్కింటి పిన్నిగారి ముగుడూ, ఇంకా అనేకంమందిలూ కనిపించారు" అన్నాడు. తరవాత, ఆC. బుడుగ్గాడు, నన్ను "ఒరేవ్, బీడీ కాలుస్తావా" అని, నాకో బీడీ యిచ్చాడు. వాళ్ళలోకంలో, చలి జాస్తీ వుంటుందిట. అందుకని, వాళ్ళంతా యెప్పుడూ బీడీలు కాలుస్తారుట. మరినాకేమో కాల్చటం చేతగాదుగందా! వొందుకని వద్దన్నాను. అయినా వాడు నామాట వినలేదు. "మీ బామ్మవాళ్లు చూడ్రులే, కాల్చు" అని, అనేసి, నాకో బీడీ ముట్టిచ్చేసి, వాడు, వాళ్ళమ్మనడిగి లడ్డూలూ,



చంద్రలోకంలో B. బుడుగు, C. బుడుగు

#  బుడుగు చంద్రలోక యాత్ర 

జిలేబీ, శెనగపప్పూ అన్నీ తీసుకు రావటానికి యింట్లోకిపోయాడు. గబుక్కున, నాకో అయిడియా తట్టేసి, ఆబీడీ ముక్కని లాగూ జేబులో దాచేశ్నాను. వాడు మళ్ళీ వచ్చి, ఖాల్చావా అని అడిగాడు. 'ఓస్స! యింత శేపా, సెఖండుకి సవాలక్షు బీడీలు ఖాల్చెయ్యగలను' అని, వాడికో పేద్దస్టంటు కొట్టేశ్నాను. పాపం, వాడు నిఝంగా హాశ్చర్యం పడిపోయేశ్నాడు. అయినా, మళ్లీ మూణ్ణిముషాల్లో మామూలుగా నేఐపోయాడనుకో. తరవాత్తి, లడ్డూలూ అవన్నీ నాక్కాసినిచ్చి, వాడుకూఢా నాలుగో, సున్నాయో తినేశ్నాడు.

ఇంతలో, యిదివరఖటి, విమానంవాడు (వీడుం. బుడుగ్గాఢివాన్నిం!) వచ్చేశ్ని, చాలారాత్తిరి అయింది కాబట్టి, పడుక్కోమన్నాడు. నేనుం. బుడుగుగాడితో యింటికెళ్లిపోతాను అన్నాను. "రేపు మాయాబజారుమాళ్ళీ చూస్సేసి వెళ్దువుగానిలే" అని వాడన్నాడు. మరి నాకేమో, నిఝంగా నిద్దర్రావట్లేదు. అయినా పడుక్కోవాల్లిగందా! సరేనో పావు నిమ్మిషంసేపు దొంగనిద్రపోయాను. (ప్రైవేటు మేస్ట్రు వచ్చినప్పుడు, దొంగనిద్రపోతున్నట్టు నటించటం, నాకు బాబాయి ఇదివరకే నేర్పేశ్నాడు. అస్సలు ఈ విద్ యమా బాబాయికే మో, వాళ్ళ బాబాయీ వాళ్ళబాబాయి నేర్పేట్ట!) హాందుఖని యిప్పుడు C. బుడుగ్ గాడిక్కానా ట్రిక్కు తెలీదులే.

పాపం వాడు గురఖపెట్టి పడుక్కున్నాడు. ఖంచెం సేపయింతర్వాత, వాణ్ణి నిద్దర్లెప్పి, ఒకటికి వెళ్లాలన్నాను. నిఝమనుకుని, వాడు నమ్మేశ్నాడు. నమ్మేశ్ని, "మా విమానం షెడ్డుదగ్గిర్కి వెళ్ళి పోస్కో" మన్నాడు. అప్పుడు నాఖో అయిడియా తట్టేసి, విమానం షెడ్డులోకివెళ్ళి, విమానంలో యెక్కేశాను. అది మనం ఎక్కడికి పోమంటే అక్కడికి వెళ్ళిపోతుంది. యిలాని సి. బుడుగు చెప్పాడు. హాందుచేత (హి చేత అనికూఢా అనొచ్చు.) మా యింటి పోనిమ్మన్నాను. నిమ్మిషంలో అది ఝామ్మంటూ, రష్షియావాళ్ళ చందమామకంటే స్పీటుగా భూమివైపు దిఘిపోత్తోంది. దానిమోతకి, సి. బుడుగగాడు, వాళ్ళ నాన్న అమ్మ అందరూ లేచి, బయటికివచ్చి నన్ను వెనక్కి వచ్చేయ్యమని కేకలేశారు. అప్పుడు నాకు భలే భయం వేశ్నింది. అయినా మన్ని భయం యేమ్మీ చెయ్యదుట. (యిలాని యిదివరకు పకోడీలు తెచ్చే ఓ హేమ్స్ట్రు చెప్పాడు.) అందుకని విమానాన్ని, హింఖా జోల్డు స్పీటు పెట్టేశ్నాను. మూణ్ణిముషాల్లోనో, ముప్పయ్ సెకండ్లలోనో అది సరాసరి మా దొడ్లోకి దిఘిపోయి, నన్ను దింపేసి, మళ్ళీ వెనక్కి ఎఘిఱిపోయింది.

హాశ్చర్యం! వంటింటి తలుపులు యింకా తీశేస్సే వున్నాయ్. హింకా డబుల్ హాశ్చర్యం!! అక్కడ దొడ్లో మా బాబాయి రెండు రెఝడల సీతో మాట్లాడుతున్నాడు. నన్ను చూసి, రెండురెఝ్ళ్ళీ సీతి పారిపోయింది! నాన్నతో చెప్తానేమోనని, బాబాయి నన్ను పారిపోకుండా గాతిగా పట్టుకోటానికి వచ్చాడు. నేను జోల్డు రైచేసి అమ్మదగ్గిర్కి పరిగత్తాను అయినా మరి వెనఖాల బాబాయి పరిఘెట్టుకు వస్తున్నాడు గదా. అందుఖని ఘాతిగా అరిచి అమ్మని నిద్దర్ లేపాను. అమ్మ లేచి "యెప్పుడూ, వెఁవ కలవరింతలూ, వీడూనూ" అని అనేశ్ని నా నెత్తిమీద ఫదో, ఓటో ఒంకిజెల్లిచ్చింది. నాకు ఖోపంవచ్చి కళ్లు తెర్చి చూశ్నాను. హాశ్చర్యం!!! నేనిందాఖట్నించీ అమ్మదగ్గిరే పడుకునివున్నాను. యిదంతా కలట!!! కాని, హాచ్చెరంవు! రేయ్ జేబులో బీడీముక్కలుమా త్తరంఉన్నాయిరోయ్!! ★



గంగిరెద్దు
చిత్రకారుడు : వెల్లటూరి పూర్ణానందశర్మ.

# ★ విభిన్నమనస్తత్వాలు ★

అడుగుపెట్టగానే నాకళ్ళ కెదురుగా కనిపించిన దృశ్యాన్ని నమ్మలేకపోయాను.

ఎదురుగా రెండుకుర్చీలు. ఒక దాంట్లో దొరస్వామికూర్చున్నాడు నెత్తి టోపీపెట్టుకుని, రెండవదాంట్లో ఒక అమ్మాయి కూర్చునివుంది. ఆమె పెళ్ళి దుస్తుల్లో నే వుంది. ముఖం అసలు కనిపించనంత క్రిందికి దించి వేసుకునివుంది. వారికి ఎదురుగా పరచిన జంబుఖానా మీద ఇరవై ముప్ఫై మంది ముత్తయిదువలు కూర్చునివున్నారు. ఇద్దరు స్త్రీలు మంగళహారతి పళ్ళెంపట్టుకుని ఏవో పాటలుపాడుతున్నారు.

నేను నిశ్శబ్దంగా నిట్టూర్చాను. గుండె బరువెక్కినట్టయింది. వాళ్ళు పాడుతున్న మంగళహారతి పాటలు చాలా 'బిట్టర్'గా వినపడుతున్నాయి. బరువుగా అడుగులు వేసుకుంటూ నా గదిదగ్గరకు వెళ్ళి, తలుపుతీసి, లోపలికివెళ్ళి, తిరిగి తలుపులు వేశాను...."ఆ గంథం రాములక్కకి కూడా రాయండి. గామెక్కడా తొరలో అగ్గం పడుతుద్ది" అన్న 'పెళ్ళికొడుకు' మాటలకి నా ఒళ్ళు వివ్యాకారంతో జలదరించింది.

...పదారిక్రితం మాట. నేను కాలేజిలో క్రొత్తగా జాయిన్ అయాను. అమ్మా నాన్నా అంతా పల్లెటూర్లో వుండేవారు. అందుచేత హాస్టల్ లో వుందామనుకుంటే, కాలేజీ చిన్నది కావటంచేత వసతిసౌకర్యం లేకపోయింది. అందుచేత విడి గదులకోసం వెతకటం ప్రారంభించాను. కాలేజీకి దగ్గరలో, తక్కువఅద్దెలో, సౌకర్యంగావుండే 'గది' లేక 'గదుల' కోసం అన్వేషించ సాగాను.

ఒకరోజున ఒక స్నేహితుడు శ్రోత్రావాడులో రెండుగదులు ఖాళీగా వున్నాయని చెప్పాడు. ఆ సాయంత్రం అతనూ నేనూ ఆ ఇల్లు చూడటానికి వెళ్ళాం. ఇంటి యజమానురాలు గదులు చూపించింది. అద్దె ఏమంత ఎక్కువ కాదు. అందుకని వెంటనే ఒప్పేసుకున్నాను.

అద్దె ఎడ్వాన్సు చెల్లించి వస్తూంటే నా గదికి ఎదురుగావున్న మరొక పోర్షను గది తలుపులు తాళం వేయబడివున్నాయి. "ఆ తాళం వేసివున్న గదికూడా అద్దెకు ఇస్తారా?" అని అడిగాను..."అది అద్దెకిచ్చేది కాదయ్యా! అందులో దొరస్వామి వుంటున్నాడు" అందామె.

ఆ గదితలుపులకు తాళం వేయబడివుంది. కాబట్టి దొరస్వామి వంటరిగాడనీ...ఆఫీసుకు పోయేటప్పుడు తాళం వేసుకుపోయి వుండివుంటాడనీ అనుకొన్నాను. కానీ, ఆ యింటిలో ఆ చీకటికొంపలో కూడా ప్రాణాలు బంధింపబడి వున్నాయని కానీ, అందులో రెండుప్రాణులకు సూర్యరశ్మి అన్నది సోకి ఎన్నో రోజులయివుండివుంటుందని కానీ ఊహించలేక పోయాను.

## 3

దొరస్వామిలాంటి వ్యక్తులు నా కళ్ళ

కొబ్బంలో ఉన్నారంటే నమ్మలేం. అయితేనేం! నట్టి ఘోరకలి! అంచేత అల్లాంటి మనుష్యులున్నారేమో!

గౌరస్వామిని చూస్తూంటే వికటాట్టహాసం చేసే సినిమా విలన్ జ్ఞాపకం వస్తూంటాడు నాకు. అతని ముఖంలో క్షుద్రతా, హీనత్వమూ, అసంస్కారిత్వమూ కొట్టొచ్చినట్టు కనబడతాయి.

అతనికి సుమారు ముప్పై అయిదేళ్ళుంటాయి. మనస్సులో గల కౌటిల్యమంతా ముఖంపై కనిపిస్తూంటుంది. అతనికి ఆరేళ్ళ క్రితం మొదటి పెళ్ళి అయింది. పెళ్ళయిన ఏడాదికి పుత్రుడు కూడా జనించాడు. గౌరస్వామి కొడుకు పుడుతూనే తల్లి ఆరోగ్యాన్ని లాగివేసి కొన్నాడు. అప్పటి నుంచి ఆమె రోగాలతో తీసుకుంటూనే వుంది. మొదటిభార్య రోగిష్ఠి కావటంచేత రెండో పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళి అయిన ముహూర్తం నుంచి అత్తమామలని కాని, బావమరదులని కాని గుమ్మం తొక్కనివ్వలేదట. అందుచేత ఈ రెండవ భార్య తన పుట్టింటివాళ్ళతో సంబంధబాంధవ్యాలు పూర్తిగా త్రెంచి వేసుకోవలసి వచ్చింది. 'కాపరాని'కొచ్చిన తరువాత ఆమె 'పుట్టింటి'కి వెళ్ళలేదు. ఈమె తల్లిదండ్రులు గర్భదరిద్రులు. పైగా ఎవరో 'పెద్దలు' మోసపు మాటలు చెప్పి ఆ అమ్మాయిని ఈ గౌరస్వామి చేతిలో పెట్టించారు. అందరికీ వివాహమనేది ఆనందదాయకమయినదయితే, ఈ యిద్దరి స్త్రీలకు అది మరణంకంటె ఘోరంగా తయారయింది.

పెద్దభార్య రోగంతో తీసుకొంటూంటే ఈ రెండవభార్య ఇంటిలోని పనులు చక్కబెట్టేది. ఈ యిద్దరూ గుమ్మందాటి బయటకు రాగా నేనెప్పుడూ చూడలేదు. కుళాయి దగ్గరనుంచి నీళ్ళు గౌరస్వామే పట్టుకెళ్ళి ఇంటిలో పోసుకుంటూండేవాడు.

ఆ పెద్దమనిషి ఆఖరికి కొడుకుని కూడా బయటకు రానిచ్చేవాడు కాదు. ఎప్పుడూ చీకట్లో వుండటమే ఆ కుర్రవాడికలవాటయిందున, వెలుగులోకి వస్తే, కళ్ళు మిటకరించి చూసేవాడు. తండ్రి సాయంత్రం ఆఫీసు నుంచి వచ్చి తలుపుతీసినప్పుడు, ఆ కుర్రవాడు ఇవతలకొచ్చి, అడుగో పెండుకు సిద్ధపడేలోగానే. అతను (అంటే గౌరస్వామి) "బాబూ! కమిన్" అనేవాడు ఇంగ్లీషులో.

ఇది నేను ఇరుగుపొరుగు వాళ్ళ దగ్గర నుంచి గ్రహించింది. ఇంక నాకు తెలిసిన కథని సూక్ష్మంగా చెప్పేస్తాను.

నేనాయింట్లో ప్రవేశించిన తరువాత సంవత్సరం నాటికి, ఒకరోజు నాగదిలో కూర్చుని "ఎకనామిక్స్" చదువుకుంటున్నాను. ఎదురింట్లోనుంచి ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళు ఘొల్లున ఏడుస్తున్నటు వినిపించింది. బయటకువచ్చి చూశాను... మొదటిభార్యకు ప్రాణంమీదకు వచ్చింది.... ఆమెతల్లి వచ్చి ఏడుస్తోంది...డాక్టరు పెదవి విరిచాడు.

రెండుమూడు రోజుల తర్వాత గౌరస్వామి మొదటిభార్య అతని అసంస్కృత సంకుచిత కఠినహృదయానికి బలిఅయిపోయింది. అతనికొడుకు తల్లి లేనివాడయ్యాడు.

అక్కడితో ఒక 'చాప్టర్' 'క్లోజ్' అయింది.

## 4

గౌరస్వామి మొదటిభార్య మరణాన్ని గురించి, రెండవభార్య తండ్రికి ఎవరో చెప్పారుట. చెల్లెలెలావుందో చూసిరమ్మని కొడుకును పంపించాడాయన. అతను వచ్చినప్పుడు మామూలుగానే తలుపులు తాళం వేసి వున్నాయి. ప్రక్కింటాయన్ని వాళ్ళ బావా - చెల్లెలూ కలిసి ఎక్కడికెళ్ళారని అడిగాడు. ప్రక్కింటాయన విరసంగా జవాబిచ్చాడు—వాళ్ళ బావా చెల్లెలూ 'కలిసి' వెళ్లలేదనీ, వాళ్ళబావ 'దఫ్తర్'కు పోయాడనీ, చెల్లెలు ఇంట్లోనే వుందనీ. అతనికి తన బావగారి 'ప్రతాపం' తెలియనట్లుంది-ఆశ్చర్యపోయాడతని మాటలు విని. ప్రక్కింటాయన సంగతంతా చెప్పి, నిష్ఠూరంగా అన్నాడు, "ఎంత డబ్బులేని వాళ్ళయినా కన్నకూతురి కష్టసుఖాలు చూడటానికైనా వస్తూపోతూంటారు. మీరు అదీ చేయలేరా?" అని.

ఆ పల్లెటూరివాడి రక్తం వేడెక్కింది. అతను తలుపుదగ్గరగా వెళ్ళి 'అమ్మాయీ!' అని పిలిచాడు. లోపలినుంచి "అన్నయ్యా!" అని వినిపించింది.

"అవును నేనేనమ్మా! వస్తున్నాను. తలుపు తెరుస్తాను ఉండు" అన్నాడు అన్నయ్య.

పక్కవాళ్ళింటిలోంచి సుత్తి అడిగి పట్టుకు వచ్చాడు. ఒక్కదెబ్బతో గొలుసుతోసహా తాళం వూడివచ్చింది. తలుపులు తెరుచుకున్నాయి.

"అన్నయ్యా!" అంటూ చెల్లెలు వచ్చి మీదపడి, వెక్కి వెక్కి ఏడవసాగింది. ఆమె ఏడుపులో అతనికి భాషాతీతమయిన బాధలన్నీ వినిపించాయి. అతనిలో భ్రాతృప్రేమ పొంగిపొరలింది. అతని కళ్ళవెంబడి కూడా నీళ్ళు కారాయి. "భయపడకమ్మా! నేను వచ్చానుగా. మరేం భయంలేదు" అన్నాడు.

తరువాత అన్ని బాధలూ ఆమె అతనితో మొరపెట్టుకుంది...ఈరకమైన జీవితంకంటే 'చావు' ఆనందదాయకమైనదైనా, చావుకంటే ఆనందదాయకమైన జీవితంకోసం ఆమె ఎదురుచూస్తోంది - చావలేక...అందుకోసమని అన్నయ్యతో మొరపెట్టుకుంది. అతన్ని ప్రశ్నించింది. "నన్నిక్కణ్ణుంచి తప్పిస్తావా? లేక చావమంటావా?"

# ★ విభిన్న మనస్తత్వాలు ★

సాయంత్రం అయిదయింది. దొరస్వామి సరాసరి ఇంటికి వచ్చేశాడు. అలవాటు ప్రకారం తాళంచెవులకోసం జేబులో చేయి పెట్టాడు. తలుపులు తెరిచి ఉండటం గమనించి ఆశ్చర్యపడ్డాడు. ఇంటిలో బావమరిది కనిపించాడు. అతన్ని చూసి పలకరింపుగా కళ్ళెగరేశాడు: "ఎప్పుడొచ్చావ్" అన్నాడు.

"ఒకటికొట్టంగా" అన్నాడు బావమరిది.

"తాళంచెవు లెక్కడివి?" అని రెండవ ప్రశ్న ప్రశ్నించి, కుర్చీలో కూలబడుతూ "సో-కాల్డ్" భార్యకేసి తిరిగి "మంచినీళ్ళు పట్టుకురా!" అని ఆజ్ఞాపించాడు.

"పగలకొట్టాను."

ఆసంగతి ముందే గ్రహించాడు దొరసామి. నిష్ఠూరంగా అన్నాడు "మర్యాదలు తెలిసేడిసేగా పల్లెటూరి బైతులకి... మంచినీళ్ళంటే నీక్కాదూ..."

ఆమె మంచినీళ్ళు తీసుకు రావటాని ఉద్యుక్తురాలయింది. "ఆగు" అనే పలుకు విని ఆగిపోయింది.

బావమరిది ముఖమంతా ఎర్రబడిపోయింది అతను కుడిచేతి గుప్పిలిబిగించి ముందుకు వస్తూ "ఎవర్రా పల్లెటూరి బైతులూ..." అంటూ ఎడంచేతితో దొరస్వామి మెడ దగ్గర 'కాలర్' పట్టుకుని పైకెత్తుతూ ముఖం మీద ఒకగుద్దు వేశాడు. బావమరిది మళ్ళీ కాలర్ పట్టుకుని పైకెత్తి మరోకసారి చరిచాడు— "ఎంతమంది ఆడవాళ్ళని చంపుతావురా, రాక్షసుడా!" అంటూ.

దొరస్వామి కొడుకూ, అతని భార్య ఒకమూలగా బొమ్మల్లాగా నుంచుండిపోయారు. అతని కొడుక్కయితే అసలేమీ అర్థంకాలేదు.

దెబ్బకి దెయ్యం జడిసిందికాని, గొప్పలు మాత్రం మానలేదు. "నా యింటికొచ్చి, తాళం పగలకొట్టి నన్ను ఖూనీచేస్తామనుకుంటావు, ఛీ! పోలీసులకి రిపోర్టిచ్చి నిన్నేం చేస్తానో చూడు" అన్నాడు అతను.

"నీకు చేతనొచ్చింది చేసుకో, పో!" అన్నాడు బావమరిది. "రా! చెల్లీ, పోదాం!" అన్నాడామెకేసి తిరిగి. చెల్లెలు అన్నయ్యకేసి నడిచింది.

దొరస్వామి తత్తి "ఎక్కడికే?" అన్నాడు.

"నోరెత్తావంటే మూతి విరగ్గొడతా!" జవాబిచ్చినవాడు బావమరిది. "అది ఇంక నీ గుమ్మం తొక్కదు. అంచేత నోరు మూసుకో...దాన్ని మా ఊరు తీసుకుపోతున్నా...మళ్ళీ నువ్వుగాని అక్కడ కనిపించావో కాళ్ళూ, చేతులూ, మెడా విరగ్గొట్టి పూడ్చేస్తా, ఖబడ్దార్" అన్నాడు అతని బావమరిది.

"మళ్ళీ వచ్చి కాళ్ళు పట్టుకున్నా ఇంట్లోకి రానిచ్చేదిలేదు...అది చూసుకుని మరీ పో!" అన్నాడు భర్త.

దొరస్వామి ఊహాశక్తి చూసి అంత కోపంలోనూ నవ్వు వచ్చింది బావమరిదికి. "మళ్ళీ నీ యింటికొచ్చి కాళ్ళెవరట్టుకుంటార్రా, లుచ్ఛా!" అన్నాడు.

ఇక్కడితో దొరస్వామి జీవితంలో రెండవ "చాప్టర్" "క్లోజ్" అయింది.

## 5

నేను మొదట చెప్పిన సన్నివేశమే మూడవ "చాప్టర్"కు మొదలు.

గదిలోకివచ్చి కూర్చోగానే నా ఆలోచనలు దొరస్వామిపై మళ్లాయి. విచిత్రమయిన మనిషతను...అతని విచిత్ర ప్రకృతి ఇదివరకే ఇద్దరి స్త్రీల జీవితాలని నాశనం చేసింది.

ఇప్పుడు మరొక జీవితాన్ని నాశనం చేయటానికి సిద్ధపడుతోంది...ఈ అమ్మాయి ఎవరోకాని ప్రపంచంలో దౌర్భాగ్యురాళ్లలో దౌర్భాగ్యురాలుగా కనిపిస్తోంది...

ఆ అమ్మాయి తల్లిదండ్రులు అసలా పెళ్ళి ఎలా చేయగలిగారు?...వాళ్ళకు దొరస్వామి ప్రకృతి తెలియదా?...లేక వాళ్ళుకూడా అల్లాంటివాళ్ళేనా ... లేకపోతే "అనాథ" (క్షమించాలి!) అయిన ఆమెను ఏ మేనత్తో, ఏ బాబాయో పెంచి, ఆమెను "సనాథ"గా చేసి, తద్వారా ఆమె "పీడ విరగడ" చేసుకొనేందుకు ఈ పెళ్ళి చేశారో?...

ఎవరు చేసినా, ఆమె జీవితాంతమూ నరకాన్ని అనుభవించాలికదా, పాపం...అనిపించింది నా మనస్సుకి.

ఇక్కడ నా గురించి నేను చెప్పకోవలసి వుంటుంది...ఈ రచనలో నా ఉద్దేశ్యం విభిన్న మనస్తత్వాలను విశదీకరించటం కాదు విమర్శించటం అంతకన్నా కాదు. అది నాకు సాధ్యాతీతమయినపని అని నాకు తెలుసు. అంతకంటె మనుష్యుల హృదయానుభూతులు (ముఖ్యంగా నాలాంటి మనుష్యుల) ఎంత చంచలములో చూపుదామని.

దొరస్వామి మూడవభార్యగా పరిగణింపబడుతున్న ఆ 'అమ్మాయి'పై నాకు 'కొండంత' సానుభూతి కలిగింది. నా ఊహాశక్తి ఆమె నికృష్టమయిన భవిష్యజ్జీవితాన్ని ఊహించటంలో ఎంతవరకూ వెళ్ళగలదో అంతవరకూ వెళ్ళింది. ఆమెను ప్రపంచంలో అందరికంటె దౌర్భాగ్యురాలుగా ఊహించు

కాని, తత్ఫలితంగా కలిగే అనుభూతిని, నా అనుభూతికి దూరంగా తీసుకున్నాను. అందుకనే నేను ఈనాడు నిజంగా సిగ్గు పడుతున్నాను.

ఒకనాటి సాయంత్రం, దొరస్వామి, అతని కొడుకూ మరొక స్త్రీ ముగ్గురూ తలుపులు తాళాలు వేసుకొని ఎక్కడికో పోతున్నారు. చూడగానే ఆమె, అతను మొన్ననే పెళ్ళాడిన స్త్రీ అనిగ్రహించాను.

చిత్రమేమిటో కాని, ఆమె ముఖం చూడగానే నాలోని సానుభూతి అంతా ఏ ఏటి వరదకో కొట్టుకు పోయినట్లయింది. అరె! ఈ ముఖం గురించేనా నేను ఇంత ఆలోచించింది అని అనుకున్నాను. నేను నా ఊహాలోకంలో సానుభూతు లర్పించిన ఇరవై యేళ్ళ సుకుమారికీ ఈమెకీ ఎక్కడా పోలిక లేదే!... ఈమెకీ ముప్పై ఏళ్లుంటాయి. నల్లగా ఉంటుంది. అందమైనది కాదు, సుకుమారి అంతకంటె కాదు. ఆమె అనాకారి కాకపోయినా, ముఖంపైని గల పొక్కులు ఆమెని అనాకారిగా చేశాయి. అనాగరికత ముఖంపై కనిపిస్తోంది......

ఈ 'నూతన వ్యక్తి' రాకతో దొరస్వామి జీవితంలో కూడా మార్పువచ్చింది. ఆఫీసుకు పోయేటప్పుడు తలుపులు, తాళాలువేసే వాడు కాదు... వాళ్ళ "బాబూ"ని బడిలో వేశారు... వీధిలో పిల్లలతో ఆడుకో నిస్తున్నారు.

రెండుమూడు సార్లు నాకు పబ్లిక్ గార్డెన్స్‌లో వాళ్ళుముగ్గురూ కలిసికను పించారు. నా 'ఇంటర్' పూర్తికాగానే నేనా 'రూం' విడిచివేశాను. కాని ఇప్పటికీ వాళ్లు నాకు సినిమాహాల్స్ దగ్గర, పబ్లిక్ గార్డెన్స్‌లోనూ కనిపిస్తూంటారు.

నాకిదే ఆశ్చర్య మనిపిస్తుంది. అనాకారి అసుకుమారీ అయిన ఈ స్త్రీ హృదయ విహీనుడయిన ఈ వ్యక్తిలో మార్పెలా తీసుకురా గలిగింది? అతనిలో మార్పుకు కారణం ఆమెయా? లేక పరిస్థితులా?

అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విష యాన్ని చెపుతాను.

దొరస్వామికి మూడో భార్య, పెళ్ళికి ముందు 'అపరిచిత' కాదట. అంతకుముందే అతను ఆమెను "ఉంచుకున్నాడట."

ఈవిధంగా అతను పేరు పడని సంస్కారి కూడా అయాడు.

ఆమెకు ఏ విధమయిన సానుభూతులు అవసరము లేనట్టుంటుంది. ఆనందమయ జీవితాన్ని గడుపుతున్నట్టుంటుంది. ★

ఆంధ్ర ప్రజలకు సమర్పించు

# సంక్రాంతి శుభాకాంక్షలు

## రాబోవు చిత్రములు

| | | |
|---|---|---|
| బి. ఎ. యస్. ప్రొడక్షన్స్<br>**చెంచులక్ష్మి**<br>అంజలి, నాగేశ్వరరావు, రేలంగి. | శారదా ఫిలింస్<br>**జయభేరి**<br>అంజలి, నాగేశ్వరరావు, రేలంగి | అన్నపూర్ణ పిక్చర్సు<br>**ప్రొడక్షన్ నెం. 3**<br>సావిత్రి, నాగేశ్వరరావు, రేలంగి. |
| శంభు ప్రొడక్షన్స్<br>**నమ్మినబంటు**<br>సావిత్రి, నాగేశ్వరరావు, రంగారావు. | రాజ్యం పిక్చర్స్<br>**కృష్ణలీలలు**<br>లక్ష్మిరాజ్యం, జూ॥ శ్రీరంజని, రంగారావు. | సెల్వకోటి పిక్చర్సు<br>**రత్నకిరీటం**<br>సావిత్రి, గణేశన్. |
| ప్రభా ప్రొడక్షన్స్<br>**ఆడపెత్తనం**<br>అంజలి, నాగేశ్వరరావు, రేలంగి<br>(సర్కారులకు మాత్రమే) | సారణి ప్రొడక్షన్స్<br>**కాళిదాసు**<br>శ్రీరంజని, నాగేశ్వరరావు | ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్<br>**ఇల్లరికం**<br>జమున, నాగేశ్వరరావు |
| సారథి స్టూడియోస్<br>**ప్రొడక్షన్ నెం. 2**<br>? ? ? | గొప్ప సంక్రాంతి విడుదల<br>సారథి స్టూడియోస్<br>**ఎత్తుకు పైయెత్తు**<br>లక్ష్మిరాజ్యం, జానకి, రేలంగి,<br>క్రొత్త నటుడు బాలయ్య | విక్రమ్ ప్రొడక్షన్స్<br>**ప్రొడక్షన్ నెం. 10**<br>? ? ? |

## రాబోవు హిందీ చిత్రములు

| సర్కారు, రాయలసీమలకు | | | నైజాంకు మాత్రం |
|---|---|---|---|
| * భగీ సిపాయి<br>* మధు<br>* జైలర్<br>* తైమూర్<br>* రేస్‌కోర్సు | * వైట్ హార్స్<br>* 12'0 క్లాక్<br>* ఢిల్లీకాఠగ్<br>* హౌరాబ్రిడ్జి<br>* డిటెక్టివ్ | * పోస్టు బాక్సు 999<br>* మధుమతి<br>* ఆర్. కె. ఫిలింస్-?<br>* మహాబూబ్<br>* ప్రొడక్షన్స్- ? | * దాహాన్ సైకల్స్<br>* లజ్‌వంతి<br>* ప్రొడక్షన్ నెం. ? |

# నవయుగ ఫిలింస్

విజయవాడ..గుంతకల్లు..సికింద్రాబాద్..మద్రాస్

'NVKR'




## శుభాకాంక్షలు

చాలా ఏళ్ళతరవాత ఆంధ్రవారపత్రిక సినిమా ప్రత్యేకానుబంధాన్ని సంక్రాంతి కానుకగా పాఠకమహాజనులకు అందజేస్తోంది. భారతదేశంలోని వివిధ కేంద్రాల్లో సినిమా పరిశ్రమ స్థితిగతులూ, తెలుగుసినిమా పరిశ్రమలోని కొందరు ప్రముఖుల జీవితవిశేషాలూ, అమూల్యాభిప్రాయాలూ—ఇవేకాక, చిత్రపరిశ్రమకే తలమానికమనదగిన విజయసంస్థను, వారిస్టూడియోలను సంబంధించిన అనేక విశేషాలను, ఛాయాచిత్రాలనుకూడా ఈ అనుబంధానికి ముఖ్యాకర్షణగా ప్రకటిస్తున్నాము. మా యీకృషిని పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

'అన్నవస్త్రాలలాగే మెదడుకు మేత కూడా అతిముఖ్యం' అని ప్రముఖ చలనచిత్రకారులు శ్రీ బి. ఎన్. రెడ్డి (63 వ పేజీ) అన్నారు. నిరక్షరులు అధికంగా ఉన్న భారతదేశంలో అసంఖ్యాక ప్రజానీకానికి ఈనాడు మెదడుకు మేత పెడుతున్నది చలనచిత్రాలే అంటే అతిశయోక్తి కాదు. ఈ మేత ఆరోగ్యకరంగా ఉంటోందా, అనారోగ్యకరంగా ఉంటోందా అనేది వేరే సంగతి. చలనచిత్రాల నిర్మాణం కొన్ని కోట్ల రూపాయల ఆదాయంతో నడిచే భారీ పరిశ్రమ. అన్ని పరిశ్రమలలాగే ఇదికూడా కొన్ని ఆర్థిక సూత్రాలకు కట్టుబడి నడుస్తోంది. తయారయే చిత్రాలపై ఈ ఆర్థిక సూత్రాల ప్రభావం స్పష్టంగా, నిర్దిష్టంగా కనిపిస్తోంది. ఏపరిశ్రమ అయినా ప్రజల క్షేమం కోసమే గనుక ఏ ఆర్థిక ప్రయోజనాలనైనా ప్రజాక్షేమానికి అనుగుణంగానే మలచుకోవాలి. అయితే సినిమాపరిశ్రమ ఉత్పత్తి చేసేది లక్షలాది ప్రజల జీవిత విధానంపై, మానసిక సంస్కారంపై, గుణ శీలాలపై అనన్య ప్రభావంకల ఒకానొక లలితకళ. గనుక ఈ పరిశ్రమ తాలూకు ఆర్థిక ప్రయోజనాలను ప్రజాశ్రేయస్సుకు అనుగుణంగా మలచుకోవలసిన బాధ్యత ఇంకా ఎక్కువ. ఈ బాధ్యత ప్రధానంగా మన చిత్ర నిర్మాతలదే.

ఈ దృష్టితో ప్రముఖ నిర్మాతలు శ్రీయుతులు నాగిరెడ్డి, చక్రపాణి బి. యన్. రెడ్డి, మధుసూదనరావు, బెంగాలీ దర్శకుడు శ్రీ ఖగేన్ రాయ్ తెలుగువారి అభిమానతార శ్రీమతి భానుమతి ఈ సంచికలో వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆలోచనా ప్రేరకాలుగా ఉన్నవనడంలో పాఠకులు మాతో ఏకీభవిస్తారని ఆశిస్తున్నాము.

గత సంవత్సరం ఎన్నడూ లేనన్ని తెలుగు చిత్రాలు విడుదల అయ్యాయి. ఈ యేడు మరిన్ని విడుదల కాబోతున్నాయి. తెలుగు చిత్రపరిశ్రమ నానాటికీ అభివృద్ధి అవుతూ కొత్త పుంతల వైపు, కొత్త వింతలకేసి ప్రయాణిస్తోంది. కొత్త సంవత్సరం తెలుగు చిత్రనిర్మాతలకు, కళాకారులకు, ప్రేక్షకులకు అభ్యుదయప్రదం, శుభప్రదం కావాలని ఈ సంక్రాంతి పర్వసందర్భంలో మా శుభాకాంక్షలు ప్రకటిస్తున్నాం. ★

## వచ్చే పేజీలలో....

# చిత్ర నిర్మాణంలో ఉత్తమ సం 'విజయ'

వ్యాపార దక్షులు, ప్రజ్ఞాశాలురు, ప్రగతిశీలురు అని పేరు తెచ్చుకోబోతున్న కృష్ణార్జునులవంటి మిత్రులిద్దరు, 1949 వ సంవత్సరం నవంబరు 5 వ తేదీని, అట్టే తారాగణం, ఆర్భాటం ఏమీ లేకుండా వాహినీలో ఒక చిత్రం నిర్మాణం ఆరంభించారు.

ఆ చిత్రం పేరు షావుకారు.

ఆ నిర్మాతల జంట, 'జంటపేరు' నాగిరెడ్డి & చక్రపాణి.

ఆ రోజుల్లో తెలుగు చలనచిత్రసీమలో అది పెద్ద విశేషం. పగటిగనిదన్న నీతివాక్యాన్ని ప్రపంచించే, ఆ చిత్రం తెలుగుచిత్రాల కథలో కొత్త ఒరవడి పెట్టింది. కథ సూటిగా కట్టినది; సూటిగా తీసినది. నిడివి తక్కువ. కళాప్రమాణాల దృష్ట్యా రసజ్ఞులందరూ ఆ చిత్రాన్ని మెచ్చుకున్నారు. కథ వాస్తవిక గ్రామీణ జీవితాన్ని, యథాతథంగా ప్రతిబింబించిందని మెచ్చుకున్నారు. విజయవారు తొలిసారి ప్రయత్నంలోనే ఒక కొత్తనటిని (జానకి) పరిచయంచేసి పైకి తీసుకురావడం ముదావహ మన్నారు. రంగారావు వంటి కొత్త నటుడిలో అజ్ఞాతప్రజ్ఞను కనిపెట్టి సద్వినియోగం చేసుకున్నారని ప్రశంసించారు.

'షావుకారు' చిత్రం ఆ తరువాత ఎన్నో చిత్రాలకు ఒరవడిపెట్టింది. ఈ చిత్రానికి ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వం నిర్వహించారు.

ఈ చిత్రం, సినిమా పరిభాషప్రకారం బాక్సాఫీస్ హిట్ కాలేదు కాని, నిర్మించిన సంస్థకు మంచిపేరు తెచ్చిపెట్టింది.

అప్పటికే వాహినీ స్టుడియో 'విజయ' సాంధుల ఆధ్వర్యాన మంచి సాధన సంపత్తి, అనేక ఆధునిక సదుపాయాలు సమకూర్చుకొంది. సమర్థులైన టెక్నీషియన్లను చేకూర్చుకొంది. ఈ సంపత్తినీ ఇప్పుడున్న నిర్మాణ పటుతను, ఇక్కడ చేరినవారి ప్రతిభనూ ప్రదర్శించగల చిత్రాన్ని సర్వజనరంజకంగా ఈసారి నిర్మించాలని నిశ్చయించారు. ఈ ప్రయత్నం భారీఎత్తున సాగింది. దర్శకుడు. కె. వి. రెడ్డిగారు. రచయిత నాగేంద్రరావు గారు.

ఈ రెండవచిత్రం తెలుగు, తమిళ, కన్నడ దేశాలలో ఆబాలగోపాలాన్ని ఆనందపరచింది. ఇందులో మాటలూ, పాటలూ ప్రతినోటా వినబడ్డాయి. 28 కేంద్రాలలో శతదినోత్సవాలు, మూడు కేంద్రాలలో రజతోత్సవాలు జరుపుకున్న 'పాతాళభైరవి' చిత్రం సాధించిన ఈవిజయం తెలుగు చలనచిత్ర చరిత్రలో అపూర్వం. సాంకేతిక విలువలదృష్ట్యా; కళాప్రమాణాల దృష్ట్యా కూడా ఇది సర్వుల ప్రశంసలందుకొంది. ఇందులో సమస్యలూ సందేశాలూ లేవు. వినోదమే ముఖ్యలక్ష్యం. ఆలక్ష్యం పూర్తిగా సిద్ధించింది. దాంతోపాటు, ఈ చిత్రంలోని పనివాడితనంకూడా మంచి ప్రమాణాలను అందుకొంది. 1952లో మనదేశంలో అంతర్జాతీయ చలనచిత్రోత్సవాలు జరిగాయి. అందులో దేశదేశాల చిత్రాలను ప్రదర్శించారు. వాటిలో దక్షిణభారతం నుండి ఎన్నిక అయినది ఈ విజయవారి తెలుగుచిత్రం 'పాతాళభైరవి' కావడం గర్వించదగినవిషయం.

ఈ చిత్రం ఆర్థికవిజయం సాధించడంతో నిర్మాతలు తమ ఆధ్వర్యాన ఉన్న వాహినీ స్టూడియోకు మరిన్ని మంచి పరికరాలు తెప్పించి, భవంతులు కట్టించి వృద్ధి చేశారు.

విజయావారి తరువాతి చిత్రం 'పెళ్లిచేసి చూడు'. ఇది మళ్లీ సరికొత్త పంథాలో తయారైంది. ఒక చిత్రం విజయవంతం అయినపుడు, అదే పద్ధతిలో, దాదాపు అదే కథను కొందరు పునర్నిర్మించ పూనుకోవడం చూస్తూనే ఉన్నాము. అసలు చక్రపాణిగారికి స్వతహా, సాంఘిక ఇతివృత్తంగల హాస్యరస ప్రధాన చిత్రాలంటే అభిమానం. 'పెళ్లిచేసి చూడు'లో మధురము సుందరము అయిన హాస్యం ఆద్యంతం చిప్పిలుతుంది. దాని వెనుక, సమకాలిక సాంఘికసమస్యను నిలిపి బలం చేకూర్చారు. కథావస్తువు గౌరవానికి అనుగుణమైన స్థాయిలోనే హాస్యాన్ని పోషించారు. 'పాతాళభైరవి' లాగా ఈ చిత్రానికి, నిర్మాణకాలం ఒక సంవత్సరం. ఇది అఖండ విజయయాత్ర చేసింది.

విజయవారు అమితవ్యయ (25 లక్షలు)



సింహద్వారంలో నుండి కనిపించే

# ప్రాధాన్యాలు నెలకొల్పిన సంస్థ

ప్రయాణ (దాదాపు వాలుగెట్లు)లను ఓర్చి, సాధన సంపత్తిని శక్తి సామర్థ్యాలను వినియోగించి తీసిన 'చంద్రహారం' సాంకేతికంగా ఉత్తమోత్తమ ప్రమాణాలను అందుకుంది. దానిని అంత నిర్దుష్టంగా తీర్చి దిద్దడానికి 400 కాల్‌షీట్లు పట్టింది.

దీని తరువాత తిరిగి, విజయవారు సాంఘిక చిత్రం తీశారు. ఇది 'మిస్సమ్మ'. 'పెళ్ళి చేసి చూడు' కన్న సుందరతరంగా, హాస్యరస భరితంగా ఇది రూపొంది ఆబాలగోపాలాన్ని ఆనందపరచింది.



వాహినీ కార్యాలయభవనం

తరువాతది తిరిగి 'కాస్ట్యూమ్' చిత్రం. పౌరాణిక కథ. దేశకాల పరిస్థితులకు అతీతమైన ఈ కథను, అత్యంత మనోహరమైన హాస్యరసచిత్రంగా రూపొందించారు. ఈ చిత్రందర్శకుడు కె.వి. రెడ్డిగారు. ఇందులో లలిత సుందరమైన ప్రణయ సన్నివేశాలను, చిత్రకారుడి నైపుణ్యంతో అమర్చారు. రచన నాగేంద్రరావుగారు. అఖండ విజయం సాధించిన ఈ చిత్రం 'మాయాబజార్'.

* * *

ఈ ఎనిమిదేళ్లలోనూ విజయవారు నిర్మించినవి ఐదే చిత్రాలు. అయినా ఈనాడు ఈ చిత్రాలకు, ఈ సంస్థకు పరిశ్రమలోను, ప్రజలలోనుకూడా గొప్ప పేరుఉంది. ఆ పేరును గౌరవాన్ని ఆర్జించిపెట్టినవి ఆ చిత్రాలే అనడానికి ఏమీ సందేహం లేదు.

ఇంత అందమైన చిత్రాలు, కథలూ వగైరా చెప్పాక, నిర్మాతల గురించి చెప్పే మాట లేమిటి?

కట్టుదిట్టమైన పద్ధతులలో, సమగ్రంగా కార్యక్రమం రూపొందించుకొని, ఓపికతో పట్టుదలతో, నిగ్రహంతో నిర్మాణం సాగిస్తే, ఇంతటి మంచి ఫలితాలు లభిస్తాయని.

కథ గురించి, నిర్మాణం ఆరంభించడానికి చాలకాలం ముందుగా, చాల రోజులపాటు చర్చిస్తారు. ఎక్కడా గతుకులు లేకుండా సరిచేస్తారు. ఉన్న లోపం, కృత్రిమంగా అతుకులు వేయకుండా వాటికోసం ఆలస్యమైనా తిరిగి కూలంకషంగా చర్చించి సహజమైనదనిపించే రూపం ఇస్తారు. మిగతా నిర్మాణం అంతా ఒక ఎత్తు, ఈ రచన విభాగం ఒకటే ఒక ఎత్తు అన్నట్టుంటుంది. అందువల్ల, కథలో అంతర్గతమైన సౌందర్యం, బాహ్య రూపంలో కూడా ప్రతిబింబిస్తుంది. సినిమా పరిభాషలో 'లూజ్ ఎండ్స్' అంటారే లోపాల్లా, ఇతర అవలక్షణాలూ ఉండవు. అలాగే సన్నివేశాల చిత్రణ నిర్దుష్టంగా ఉండడానికి 'విజయ' బృందం తీసుకునే శ్రద్ధ, చేసే కృషి చాలా ఎక్కువ. [illegible] నటుల రిహార్సల్సు ఎన్ని రోజులు పోయినా వాటికి స్వస్తి చెప్పని సంస్థలలో ఇదొకటి. డబ్బు, కాలం, ఎంత ఎక్కువ ఖర్చుఅయినా, సన్నివేశం ఏర్పాటు, నటన తృప్తిగా కుదిరేవరకూ తొందరపడరు. సన్నివేశాలు అందరికీ సంతృప్తికరంగా ఉన్నాయనిపించేవరకూ, ఎన్ని 'టేక్'లైనా తీయడానికి వెనుతీయరు. వ్యాపారరీత్యా ఇది అందరికీ సాధ్యం కాకపోవచ్చు. కాని ఈ నిర్మాతల సౌందర్య పిపాస అలాంటిది. నిర్దుష్టంగా సుందరంగా ఉండడం గీటురాయి. విజయావారి చిత్రాల విజయానికి ఇదే కారణం.

రెండవ ముఖ్య కారణం ఇక్కడి సాంకేతిక నిపుణుల ప్రజ్ఞ. ఛాయాగ్రహణ దర్శకుడు మార్కస్ బార్ట్లే. శబ్దగ్రహణ దర్శకుడు కృష్ణయ్యర్, లేబొరేటరీ చీఫ్ కన్నప్ప, ఈ చిత్రాలు ఇంత సుందర రూపం ధరించడానికి దోహదం చేశారు. ఈ టెక్నీషియన్ల ప్రజ్ఞ సంస్థకు గర్వకారణం. ఇంతవృద్ధిలోకి వచ్చి గొప్ప పేరు తెచ్చుకొంటున్న ఈ సంస్థ తంత్రులకు గర్వకారణం.

* * *

"మా సంస్థలో పనిచేసే రెండు వేలమంది లోనూ టెక్నీషియన్లదగ్గరనుండీ, చిన్న పనివాడివరకూ, అందరి కార్యదక్షత, శ్రద్ధ మాకు గర్వకారణం" అంటారు నిర్మాతలు సగర్వంగా.

ఫ్లోర్ ల పరిమాణాలు :

| ఫ్లోర్ | పొడుగు | వెడల్పు | ఎత్తు |
|---|---|---|---|
| 1 | 100 అ॥ | 65 | 80 |
| 2 | 100 | 65 | 21 |
| 3 | 180 | 50 | 20 |
| 4 | 150 | 60 | 25 |
| 5 | 60 | 40 | 25 |
| 6 | 120 | 60 | 22 |
| 7 | 144 | 60 | 25 |
| | విజయలో | | |
| 8 | 100 | 55 | 25 |
| 9 | 120 | 60 | 80 |
| 10 | 110 | 60 | 80 |
| 11 | 100 | 55 | 25 |

ఒకటి, రెండు ఫ్లోర్ ల మధ్య రెండంతస్తుల భవనం ఒకటి ఉంది. అందులో మేకప్ రూములుదుస్తులు,ఆభరణాలూ ఉంచేగదులూ ఏర్పాటుచేశారు. ప్రొజెక్షన్ థియేటర్లు, వాహినీలో మూడు, విజయాలో రెండు ఉన్నాయి. ఇవికాక, నాగిరెడ్డిగారు కొత్తగా కొలుకుతీసుకొని నిర్మించిన విజయా గార్డెన్స్‌లో (ఇది వాహినీకి ఎదురుగా ఉంది) ఇంకో పెద్ద థియేటర్ ఉంది. నాగేశ్వరరావు శతదినోత్సవం ఇక్కడే జరిగింది. రెండు వేలమంది కూర్చోడానికి సదుపాయం ఉన్న అధునాతన థియేటర్. ప్రొజెక్టర్ నుండి తెరకు 180 అడుగుల దూరం ఉంటుంది. ఇంత పెద్ద 'త్రో' ఉన్న థియేటరు మద్రాసు మొత్తం మీద ఇదే. ఇందులో డబుల్ ప్రొజెక్టర్లు ఉన్నాయి. వైడ్ యాంగిల్ స్క్రీను అమర్చారు.



ఛాయాగ్రహణ దర్శకుడు
మార్కస్ బార్ట్లే

రెండు స్టుడియోలలోను మొత్తం. సినిమా కెమెరా యూనిట్లు ఉన్నాయి; సౌండ్ రికార్డింగు యూనిట్లు ఎనిమి- ఉన్నాయి. ప్రొజెక్టర్లు 4 ఉన్నాయి.

ఈ యూనిట్లతో, ఒకసారి అ- చిత్రాల షూటింగ్ జరుపవచ్చును. రెం- చిత్రాలకు పాటల రికార్డింగ్ చేయ- చ్చును. రీ రికార్డింగు అయితే మూడు థి- టర్లు ఇందుకు అమర్చుకోవచ్చును. ఇవన్- వెస్ట్రెక్స్ యంత్రాలు.

షూటింగ్ రెండు పూటలా రద్దీ- ఉండే పక్షంలో ఒకరోజు- 13 చిత్రాలు షూట్ చేయడానికి తగిన స- పాయాలున్నాయి. ఇందుకై 12 యూనిట్- సిబ్బంది సిద్ధంగా ఉంటుంది. ఫ్లోర్ ఇన్‌చా- రామానుజం.

చిత్రాలకు కావలసిన సెట్లు వేయ- నికి సముద్రం, సెక్లు, ఆకాశం, మేడ- అడవులువంటివి తెరలమీద చిత్రించ- పెయింట్ శాఖ ప్రత్యేకం ఉన్నా- మామూలుగా 12 గంటల వ్యవధిలో సెట్ నిర్మించివేయడానికి తగిన బలగం సిద్ధం- ఉంటుంది. పెద్ద పెద్ద సెట్లు అయి- కొంత ఎక్కువ వ్యవధి అవసరం కావచ్చు-

సెట్లమీద లైటింగ్‌కై నాలుగు- లైట్లు ఉన్నాయి. ఇవికాక జానపద, పౌ- ణిక చిత్రాలలో పెద్ద పెద్ద సెట్లలో- ఆర్క్ లాంప్‌లు ఉన్నాయి. ఈ స్టుడియో- లలో ఉండే పరికరాలన్నీ అధునాత- మైనవి,

ఈ స్టుడియోలో అతిముఖ్యమైన శా- గాఫ తెకాతెటు, ఉనాక్ర పరికరా-



విజయాస్టూడియో (పూర్వం రేవతి)లోని ప్రొజెక్షన్ థియేటర్.

# వేయి చిత్రాలలో ఆరితేరిన



ఛాయాగ్రహణ దర్శకుడు

**కొండా రెడ్డి**

ఇక్కడ అమర్చారు. షూట్ చేసిన ఫిలింను డెవలప్ చేసి, ప్రతులు తీసే పని అంతా ఇక్కడ జరుగుతుంది. ఇది అంతా ఆటోమాటిక్ ప్రోసెసింగ్. రసాయన ద్రవ్యాలు కలిపిఅమర్చితే మిగతా పనిఅంతా, యాంత్రికంగాను, అతివేగంగానూ జరుగుతుంది. నెగటివ్ ఫిలిం ప్రాసెస్ చేయడానికి పాజిటివ్ కాపీలు తీయడానికి వేర్వేరు యంత్రాలు ఉన్నాయి. నెగటివ్ యంత్రాన్ని కృష్ణగోపాల్ అనే ఆయన, పాజిటివ్ యంత్రాన్ని 'ఫిలిం సెంటర్' అధిపతి మజీద్ గారు రూపొందించారు.

ఈనాడు విజయ లెబొరేటరీలో రోజుకు లక్షన్నర అడుగుల ఫిలింను ప్రాసెస్ చేయవచ్చును. రోజుకు, దక్షిణ భారత చిత్రాలు (అంటే 18 వేల అడుగులవి) తొమ్మిది, అత్యవసరం అయితే పది కాపీలవరకు తీయవచ్చును. చిత్రం ఎంత బాగా షూట్ చేసినా పాటలు ఎంత జాగ్రత్తగా రికార్డు చేసినా, ప్రాసెసింగ్ సవ్యంగా లేకపోతే అవి ఎందుకూ కొరగాకుండా పోతాయి. అందువల్ల చలనచిత్ర నిర్మాణంలో ఈ శాఖకు విశేష ప్రాముఖ్యం ఉంది. విజయా లెబొరేటరీలో 70 మంది పని చేస్తున్నారు.

ఎడిటింగ్ శాఖ ఒక ప్రత్యేకభవనంలో ఉంది. ఇందులో పది ఎడిటింగ్ గదు లున్నాయి. ఇదివరకు రెండు మూవియోలాలు ఉండేవి. ఇప్పుడు ఆరు ఉన్నాయి.

ఇవన్నీ అలా ఉండగా వాహినీ, స్టూడియోల ప్రత్యేకాకర్షణ, అక్కడి ఉద్యానవనాలు.

సినిమా ప్రపంచం స్వర్గసీమ అని కలలు గని చూడవచ్చే వారికి ఒకొక్కసారి ఈ దీపాలవేడీ, బల్లలు, తెరలూ చూచాక వేరు భావం కలుగుతూ ఉంటుంది. కాని, ఈ స్టూడియోకి వస్తే నందనవనం(ఊహలో) కన్న సుందరమైన ఉద్యానవాటికలను చూడవచ్చు. మధ్యాహ్నం మూడుఅయేసరికి స్టూడియోలో తోటలన్నీ నీటితో తడుపుతారు. పూలమొక్కలకూ, ఆకుపచ్చని తివాసీలవంటి లాన్‌లకు, నీళ్లుపోస్తారు. అవి కళ్లకు చల్లగా కనబడతాయి. కన్నులపండువగా ఉంటాయి.

నాగిరెడ్డిగారికి వీటిమీద ఎంతో అపేక్ష. స్టూడియో కౌలుకు తీసుకొన్న నాటినుండి, అందులో ఇన్ని భవంతులు కట్టించి, ఇన్ని నవీన పరికరాలూ, సదుపాయాలు అమర్చ



చీఫ్ సౌండ్ ఇంజనీరు

**కృష్ణయ్యర్.**

టానికి ఎంత పట్టుదలతో, కార్యదక్షతతో, ఉత్సాహంతో కృషిచేశారో నేత్రపర్వ మొనరిగిన ఈ తోటల, బాటలమీదకూడా అంత ఉత్సాహంతోను పనిచేశారు. మరి వీటిలో ఎక్కడా ఆడంబరం కనబడదు.

* * *

వాహినీ స్టూడియో మద్రాసు వడపళని పేటలో సరిగ్గా మద్రాసు పడమటి సరిహద్దు మీద ఉంది. గేటెదుటగానే సుందరని లాన్, దానిపై ఠీవిగా రెండు పోకచెట్లు కనబడతాయి. గేటు కుడివైపున పెద్ద చెట్లు వాటివాటి నీడన కార్లషెడ్డు. ఎడమవైపున స్టోర్ రూం, అవతలగా మౌల్డింగ్, వడ్రంగం కార్ఖానాలు ఉన్నాయి. వీటిలో 175 మంది పనిచేస్తున్నారు. ఎడంవైపున చిన్న తోట వెనుక కనబడే భవనమే లెబరేటరీ. లాబ్ చీఫ్ ఎస్. పి. సెన్ గుప్తా అక్కడ ఉంటారు. ఈయన 1948 నుండి ఇక్కడ పని చేస్తున్నారు. ఈయనకు అసిస్టెంట్ రంగనాథంగారు. ఈ శాఖలో 70 మంది పని చేస్తున్నారు. గేటుకు సూటిగా కనబడే రెండంతస్తుల మేడ కార్యాలయం. అందులోనే క్రింది అంతస్తులో కుడివైపున నాగిరెడ్డి, చక్రపాణిగారల గదులున్నాయి.



అసిస్టెంట్ ఇంజనీరు

**వల్లభజోస్యుల శివరాం.**

ఎడమవైపున వాహినీ స్టూడియో జనరల్ మానేజరు ఎస్. వి. సుబ్రహ్మణ్యంగారి గది ఉంది. తమిళనాడులో 'ఎస్. వి. ఎస్.' కు కథా రచయితగా మంచి పేరుంది. వాహినీ స్టూడియో నెలకొన్ననాటినుండి ఈయన ఇందులో పనిచేస్తున్నారు.

ఇక్కడే ఎకౌంటింగ్ శాఖ ఉద్యోగు గదులూ ఉన్నాయి. ఈ గదులకు మధ్యగా

# సాంకేతిక నిపుణులు



విజయా లాబొరేటరీ చీఫ్
నిర్మల్‌చంద్ర సేన్‌గుప్త.

స్టుడియో ప్రవేశద్వారం ఉంది.

మేడమీద వరసగా, కళాదర్శకుడు, ప్రముఖ కథారచయిత అయిన మా. (మాధవపెద్ది) గోఖలే, స్క్రిప్టు రచయిత పింగళి నాగేంద్రరావు, దర్శకులూ ఉండే గదులు కేటాయింపుగా ఉన్నాయి. చివర, రిహార్సలు కని పెద్దహాలు ఉంది.

ఈ భవనం దాటగానే అందమైన ఆర్చిలు, వాటిఅవతల తోట, పక్కని పూలతోట, పచ్చికబయలుమధ్య ఫౌంటెన్ నేత్రపర్వంగా కనుపిస్తాయి. దీని కుడిపైపున రికార్డింగ్ థియేటర్ ఉంది. ఇందులోనే ప్రధాన ఛాయాగ్రహణ దర్శకుడు మార్కస్‌బార్లే గదిఉంది. బార్లే ఛాయాగ్రహణశిల్పం విజయావారి చిత్రాల విశిష్టతకు దోహదంచేసిన వాటిలో ఒకటి. 1937 లో ఈయన చిత్రసీమలో ప్రవే-



ఎడిటర్ సి. పి. జంబులింగం.

శించారు. అంతకుముందు న్యూస్‌రీల్ కామెరామన్‌గా పనిచేశారు. వాహినీ చిత్రాల్లో 'స్వర్గసీమ'కు మొదట ఛాయాగ్రాహకుడుగా పనిచేశారు. స్టుడియో నెలకొన్నప్పటినుండి ఇక్కడే పనిచేస్తున్నారు. కామెరాశాఖలో, ఈయన తరువాత, నాగిరెడ్డిగారి తమ్ముడు బి. ఎన్. కొండారెడ్డి ముఖ్య ఛాయాగ్రాహకుడు. వీరుకాక, నలుగురు ఆపరేటివ్ కామెరామెన్, పన్నెండుగురు ఫస్ట్ అసిస్టెంట్స్, మరి పన్నెండుగురు సెకండ్ అసిస్టెంట్సు ఉన్నారు.

రికార్డింగ్ శాఖ చీఫ్ ఇంజనీరు కృష్ణన్, ఆయన అసిస్టెంట్ వల్లభజోస్యుల శివరాం. ఈయన భక్తపోతనచిత్రంలో పోతన కుమారుడిపాత్ర నిర్వహించాడు. వీరుకాకమరిద్దరు రికార్డిస్టులు. 24 గురు సౌండ్ అసిస్టెంట్‌లు, ఇంకో పదముగురు పనివారు ఈశాఖలో ఉన్నారు. లాన్‌కు ఎడమపైపున ఎడిటింగ్ శాఖభవనం ఉంది. ఎడిటింగ్ చీఫ్ సి. పి. జంబులింగం. ఈయన 1945 లో వాహినీవారి 'స్వర్గసీమ'కు ఎడిటర్‌గా పనిచేసి అప్పటినుండి ఈ స్టుడియోలో ఉంటున్నారు. విజయవారి చిత్రాలన్నిటికీ ఈయనే ఎడిటింగ్ నిర్వహించారు. ఈ శాఖలో ఆరుగురు సహాయకు లున్నారు. లాన్‌కు ఎదురుగా వరసన నాలుగు ఫ్లోర్లు కనబడతాయి. వాటిలో ఒకటి, రెండుఫ్లోర్ల



కళాదర్శకుడు మా. గోఖలే

మధ్యనున్న రెండంతస్తులమేడమీద మరొక ఆర్ట్ డైరక్టర్ కళాధర్ ఉంటారు. ఈయన 1945 లో 'గృహప్రవేశం' చిత్రానికి తొలిసారిగా కళాదర్శకత్వంనిర్వహించారు. విజయా ప్రొడక్షన్స్ నెలకొన్నప్పటినుండి ఇక్కడే పనిచేస్తున్నారు. వీటికి వెనుక ఒకఫ్లోర్ ఉంది. కుడివైపున ఇదివరకు ఆరుబయలుప్రదేశం ఉండేది. అక్కడ ఇపుడు ఇంకో రెండుఫ్లోర్లు ఉన్నాయి. వీటికి ఎదురుగా మరొక చిన్నలాన్, దానికి ఒకపక్కన ఆఫీసురూములు ఉన్నాయి. ఇవతలపక్క మరొక ప్రొజెక్షన్ థియేటర్ ఉంది.

వాహినీకి కుడిపైపున 'చందమామ' భవనాలూ, నాగిరెడ్డి, చక్రపాణిగారల ఇళ్ళూ ఉన్నాయి. వాటిమధ్య మరో సుందరోద్యానవనం ఉంది.

వాహిని వెనకనే ఇప్పుడు కొత్తగా వెలసిన విజయాస్టుడియో ఉంది. ఆరు, ఏడు ఫ్లోర్లపక్కగాఉన్న సరిహద్దు గోడను పడగొట్టి, ఇందులోంచి ఆ స్టుడియోలోకి విశాలమైన బాటవేశారు. దానికి అటూఇటూ నేల చదునుచేసి మంచి లాన్‌లు మొక్కలూ వేయిస్తున్నారు. ఈ స్టుడియోలో నాలుగు ఫ్లోర్లు ఉన్నాయి. ఇవికాక మరొకటి కట్టడానికి ఏర్పాట్లు పూర్తి అయ్యాయి. దీనికి కొత్తరూపం ఇచ్చే కార్యక్రమం రాత్రింబవళ్ళు నాగిరెడ్డిగారి పర్యవేక్షణకింద పోటాపోటిని జరుగుతోంది. నాలుగు ఫ్లోర్లలోను చిత్రాల షూటింగ్ యథాప్రకారం సాగుతోంది. ఈ స్టుడియోలో రెండు ప్రొజెక్షన్ థియేటర్లు ఉన్నాయి. ఒకదానిలో ప్లాస్టిక్ స్క్రీను అమర్చారు. అధునాతన విధానాలలో శబ్ద ప్రసార సదుపాయాలు ఏర్పాటుచేశారు. ఇది విజయావారి స్వంతస్టుడియో.

మొత్తంమీద విజయాసంస్థ ఆధ్వర్యాన నడుస్తున్న ఈ రెండుస్టుడియోలలోను రాత్రింబవళ్ళు వెయ్యిమంది ఉద్యోగులు, టెక్నిషియన్‌లు, కళాకారులూ పనిచేస్తున్నారు. వాహిని అవతరించినపుడుఅక్కడ(లావణ్య) అనే తమిళచిత్రం వాహినీవారి 'గుణసుందరి'

(98-వ పేజీ చూడండి)



# విజయ ★ చక్రపాణి

ద్వారబంధానికి చేరబడి నిలుచుని తొలి వానచినుకులకి తడిసిన భూమిలోంచి వచ్చే మధుర పరిమళాన్ని ఆఘ్రాణిస్తూ, కాపురానికి తీసుకెళ్తానని భర్త రాయవలసి ఉన్న ఉత్తరం గురించి ఆలోచిస్తూ నిల్చుంది ఒక అమ్మాయి...హోదాలో, ప్రజ్ఞలో తనకన్న తక్కువవాళ్లెందరో కొడుకుల పెళ్ళిళ్ళకి, కట్నాలు పూర్తిగా రాబట్టుకుని పుస్తెముడిపడనిచ్చారు; తనుమటుకు బకాయి పెట్టనిచ్చి బోర్లాపడ్డాడు. ఇప్పుడది రాబట్టుకోగలిగితే ఎంత బాగుంటుంది అనుకుంటున్నాడు ఒక వియ్యన్నగారు అమాయకంగా...తనవేపు చూడని ప్రియురాలిని కనుమరుగుపుదాకా చూపులతో సాగనంపి, గజమున్నర నిట్టూర్చి గొంతు సరిగ్గాలేని ముడతకుర్చీలో కూర్చోబోతున్నాడు ఒక రోమియో.

వీళ్ళందరూ తలోరకమైన కలలు కంటారు. వాళ్ళవాళ్ళ సమస్యల్ని అందంగా ఆనందకరంగా పరిష్కరించుకోడానికి. ఈ కలలన్నీ కలగా పులగం అయితే జీవితం అవుతుంది. ఈ కలలన్నిటినీ ఒక అందమైన సూత్రంలో కలగా పులగం చేసే కథ అవుతుంది. అది [illegible] కళ. కలలు కనే వాళ్ళందరి సమస్యలూ జీవితంలో అందంగా పరిష్కారం కాకపోయినా, కలలతో కట్టిన సుందర ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు అనిర్వచనీయమైన తృప్తి కలుగుతుంది. హాయిగా ఉంటుంది. మామూలు కళ్ళకి, [illegible] చదువుతూనే వాటికి పైస్థాయిన ఉండే ఆ లోకం, మనోహరంగా ఉంటుంది.

దాన్ని అక్షరాలా మనోహరంగా నిర్మించగల ప్రజ్ఞ, 'విజయా' సహాయనిర్మాత చక్రపాణిగారి సొత్తు. పెళ్ళిచేసి చూడు, మిస్సమ్మ చిత్రాలూ, వాటిలోని వివిధ సన్నివేశాలూ ఇందుకు నిదర్శనాలు.

చక్రపాణి సినిమా రచనలకు ఉపక్రమించింది 1940 లో. అప్పుడు ఫేమస్ ఫిలింస్ వారి 'ధర్మపత్ని' చిత్రానికి సంభాషణలు వ్రాశారు. నాలుగేళ్ళ తరువాత వాహినీవారి 'స్వర్గసీమ' కు కథను రూపొందించారు. 'విజయా' సంస్థ, సంస్థాపనకు ముందు, చలనచిత్రసీమలో ఆయన వ్రాసినవి ఇవే. అయితే, అంతకుముందునుండీ చక్రపాణి పేరు ఆంధ్రదేశంలో అందరూ ఎరుగుదురు. ఈయన కొంతకాలంపాటు హిందీ, ఉర్దూలలో విశేషం కృషిచేసి, ఆ సారస్వత ప్రపంచంలో ఉత్తమశ్రేణి పుస్తకాలన్నీ చదివారు. తరువాత, అస్వస్థత కారణంగా, కొంతకాలం మదనపల్లి శానిటోరియంలో ఉండడం జరిగింది. అక్కడ ఒక బెంగాలీ ఆయనతో పరిచయం అయింది. ఆయన చక్రపాణికి ఒక బెంగాలీవాచకం ఇచ్చి అందులో 'ఓనమాలు' బోధించారు. ఆ భాషమీద అభిమానం కలగడంతో, దానిని సమగ్రంగా నేర్చుకుని ప్రావీణ్యం గడించారు. అప్పుడే శరత్ రచనలమీద ఆయనకి అపేక్ష కలిగి, వాటిని తెలుగుచేయడం మొదలుపెట్టారు.

బడదీదీ, దేవదాసు, పల్లీయులు, వాగ్దత్త మొదలైనవన్నీ వచ్చాయి. నాటికీ, నేటికీ, శరత్ తెలుగు అనువాదాలలో చిన్నా పెద్దా అందర్నీ ఆకట్టుకున్నవి చక్రపాణి అనువాదాలే అనడం సత్యదూరం కాదు. మూల రచయిత హృదయాన్ని, కథలో ప్రాణాన్ని ఈ తెలుగువాక్యాలమధ్య నిలబెట్టగలగడమే చక్రపాణి అనువాదాల విశిష్టత. తర్జుమా చదువుతున్నట్లు ఉండదు. అటువంటి ఆలోచనే లేకుండా, 'మనకు ఆత్మీయులు' అయినవాళ్ళ కథను చూస్తున్నామన్న భావం కలిగి ఆద్యంతం నిలుస్తుంది. అక్షరానువాదానికీ భావానువాదానికీ భేదం ఇదే.

* * *

బెంగాల్‌లో పద్నాలుగేళ్ళుండి, ఆ భాషా, దాని సొయగాలూ బాగా తెలుసుకున్న ఒక తెలుగు పెద్దమనిషి ఒకసారి చక్రపాణిగారితో మాట్లాడుతూ, ఆయన అనువాదాలను, బెంగాలీ వ్యావహారిక పదాలకు, తెలుగుతనం ఉట్టిపడే తుల్యపదాలను వేయడంలో ఈయనప్రజ్ఞను మెచ్చుకుని, 'మీరు కలకత్తాలో ఎన్నాళ్ళున్నారు?' అని అడిగారు — ఎన్నాళ్ళుండకపోతే, ఆ భాష ఒడుపులను ఇంతగా పట్టుకోడానికి వీలవుతుందీ అన్న భావంతో.

చక్రపాణిగారు, కలకత్తా కాదు, ఏ బెంగాలీ బస్తీకీ ఎన్నడూ వెళ్ళలేదు. తలపెట్టిన పనిని సమగ్రంగా సంపూర్ణంగా సాధించడంలో ఆయన ప్రజ్ఞ పట్టుదల చిత్తశుద్ధి అలాటివి. చక్రపాణి నడిపిన యువప్రచురణలలో ఆనాడు అనేక మంచి నవలలు కథలూ వచ్చాయి.

తెనాలి తాలూకా ఐతేనగరపాడు వాస్తవ్యుడు ఆలూరి వెంకట సుబ్బారావు (చక్రపాణి), చెన్నపట్నంవచ్చి, నాగిరెడ్డిగారి 'ఆంధ్రజ్యోతి' (1945-60) కి సంపాదకత్వం వహించాక, అనేక స్వతంత్ర రచనలు, వ్యంగ్యం, హాస్యం ప్రధానంగా

(58-వ పేజీ చూడండి)

# సారథులు

★

## నాగిరెడ్డి



అసాధ్యాలూ, అనితర సాధ్యాలూ సాధిం చాలన్న సరదా, ఉత్సాహం, ఆ పని మొదలుపెట్టాక వదలిపెటనివ్వని మొండి తనంలాంటి పట్టుదల, తగ్గకువచ్చే శక్తి సామర్థ్యాలూ, నేర్పూ, ఈలోగా కావల సిన ఓర్పూ మొదలైన గుణాలు 'హెడ్డాఫీసు' ఒక మనిషిలో ఏర్పాటైతే, అతనికి ఏ శక్తి ఎదురొడ్డి నిలవదు. తలపెటిన ప్రతికార్యం ఫలప్రదం కావడం ఖరారు. విజయం సాధిం చిన వారందరి జీవిత కథల సారాంశం స్థూలంగా ఇదే.

*   *   *

విజయా ప్రొడక్షన్స్ అధిపతి నాగిరెడ్డి గారు సాధించే చిన్నా పెద్దా కార్యాలను కన్న విన్నవారు, ఈయనదంతా 'మాజిక్ కార్పెట్ టెక్నిక్' (మాయా తివాచీ) అంటారు. అవి చాలా చిత్రంగానూ, ఆశ్చర్య కరంగానూ ఉంటాయి.

'ఈ మట్టిలో యూకలిప్టస్ బతకదండీ' అన్నాడొకాయన; నాగిరెడ్డిగారు ఆ ఆలో చన పెట్టుకున్నపుడు.

'ఇక్కడ సిల్వర్ ఓక్ చెట్లు పెరగవు' అని ఇంకో ఆయన చెప్పారు.

పెరుగుతాయని నాగిరెడ్డిగారి నమ్మకం. ఈ రోజున ఆయన పాలనలో ఉన్న, 60 ఎకరాల పారిశ్రామిక రాజ్యంలో తోర ణన్ని యూకలిప్టస్ చెట్లు, సిల్వర్ ఓక్ చెట్లు నిక్షేపంలా పెరుగుతున్నాయి; అదే విధమైన విధేయతతో వాహినీ విజయా స్టుడి యోల సాధన సంపత్తి, చిత్ర నిర్మాణ పరి శ్రమ, ఆ సంస్థలకీర్తి, స్టుడియోపక్క ఆవర ణలో ప్రసాద్ ప్రాసెస్, 'చందమామ' మొదలైన వ్యాపారాలూ వాహినీ ఎదురుగా విజయా గార్డెన్స్‌లో అందమైన నందన వనాలూ పెరుగుతున్నాయి.

ఈ ప్రగతికి తొలి ప్రయత్నం 1949 ఆగస్టులో జరిగింది. అప్పుడు నాగిరెడ్డి, చక్ర పాణి కలసి వాహినీ ప్రొడక్షన్స్ వారు కొంటు తీసుకొని, చిత్రనిర్మాణం ఆరంభించారు.

*   *   *

చేపట్టిన పని ప్రతీదీ చెప్పినట్టు విసేలా చేయగల నాగిరెడ్డిగారికి పరిచయమైనదారి చూపే గుర్తు ముందుకు నడిపేశక్తి ఏమిటి అంటే ఆత్మవిశ్వాసం అనే చెప్పుకోవాలి.

*   *   *

"చాలా రోజులక్రితం, నేనొక చక్కని కథ చదివాను" అన్నారాయన మాటల సందర్భంలో.

ఒక రైతు తన పొలానికి నీరుకోసం బావి త్రవ్వబోయాడు చేయనిచే. 20 అడుగులు త్రవ్వితే వస్తుంది అన్నాడు స్థలనిర్ణయం చేసిన అసామి. తీరా, అంత తవ్వితే జల పడలేదు. నాలేపోయే నాజయ్య అతన్ని పిలిచి, "ఇదుగో ఇక్కడగాదు, కొంచ ఎగువన 15 అడుగులు తవ్వితే చాలు-నీరు కొల్లలు" అని చెప్పిపోయాడు. పలేనని ఆ రైతు అక్కడ తవ్వాడు. 15 అడుగులు తవ్వినా నీరులేదు. "బ్రతి బాగు లబాబా! ఇక్కడెందుకోయ్. ఇంకో పదిగజాలు అవ తలగా, పదంటే,పదుఅడుగులు తవ్విచూడు- కొబ్బరి నీళ్లలాంటి నీరు పడుతుంది" అని సలహా యిచ్చాడు ఇంకొకడు. అక్కడా కలిసిరాలేదు రైతుకి. ఇంతకీ, అతనికి బావి కావలసింది తన పొలం దగ్గరగా. అక్కడ ఎలాగా 20అడుగులు తవ్వాడు. సలహాలువిని, ఇంకో రెండుచోట్ల 20అడుగులు తవ్వడానికి పడ్డ శ్రమలో అరసగం కనక మొదటి ప్రయ త్నం కొనసాగించడానికి వినియోగిస్తే— ఈ పొలానికి పక్కలోనే నీటిపడేది, అన్నది ఆ కథలో నీతి.

నాగిరెడ్డిగారి ప్రగతిరీతికి ఇదే కారణం.

"జీవితంలో నేను పెద్దపనులు తలపె నపుడు, సమస్యలు ఎదురొక్కని అటూఇట అని తేల్చుకోలేక సతమతమైనపుడు— కథాంశం ఎందుకో గుర్తుకు వచ్చేది. అప్పు మళ్ళీ ఓసారి ఆలోచించి మునుపు తో బెట్లు చేసేవాణ్ణి" అంటారు నాగిరెడ్డి.

*   *   *

నాగిరెడ్డిగారి తండ్రి బొమ్మిరెడ్డి సింహారెడ్డిగారు. నలుగురన్నదమ్ములలో నా రెడ్డి తృతీయులు. పెద్దాయన రామలిం రెడ్డి. ఆయన ఇపుడు తండ్రిగారు ఆరం చిన ఎగుమతి దిగుమతి వ్యాపారం నిర్వహి న్నారు. రెండవ కుమారుడు ప్రముఖ చి చిత్ర దర్శకుడు బి. ఎన్. రెడ్డిగారు. నా రెడ్డి తరువాతి వారు బి. ఎన్. కొండారె ఈయన ఛాయాగ్రహణ దర్శకుడుగా తెచ్చుకున్నారు. ఇపుడు వాహినీ చిత్ర లకు ఛాయాగ్రహణం నిర్వహిస్తున్నారు.

ఉల్లి పాయల ఎగుమతి దిగుమతి వ్యాపా సంస్థను, ఒక ఘట్టంలో, నాగిరెడ్డిగారి వి హాణకు ఒప్పగించారు తండ్రిగారు. వ్యాపా రంలో పోటీ విపరీతంగా ఉంటున్న ఆ స యంలో కొత్తగా బాధ్యత స్వీకరించి యువకుడు నాగిరెడ్డి, తండ్రి నమ్మకం నమ చేయకుండా ఎంతో సమర్థంగా నిర్వహి చారు. కంపెనీ కార్యాలు పోత్సాహ ఫాటీకి పడిపోయిన ఆ సమయంలో నాగిరె



నాగిరెడ్డి, చక్రపాణిగారలు నివసించే భవనం. దీనిని ఆనుకొనివున్న భవనంలో ప్రసాద్ ప్రాసెస్ ఉంది.

# నాగిరెడ్డి

ఖ్యాతిసిద్ధమైన తీర్పులో, కొత్తదారులందరికీ, ఇంకా తమ వ్యాపారంతో సంబంధం ఉన్న ఇతరులందరికీ పేరు పేరునా ఉత్తరాలు వ్రాసేవారు. పరిస్థితులు వివరించి ప్రత్యేకంగా ప్రతి ఒక్కరి సహకారం అవసరమని లేఖలు వ్రాసేవారు. వ్యక్తిగతమైన శ్రద్ధ, ఆపేక్ష ఉట్టిపడుతున్న ఈ ఉత్తరాలు ఇంద్రజాలంలా పనిచేశాయి. వ్యాపారం పుంజుకొంది. వ్యాపార దక్షతతో తొలి పాఠం, సుఖంగా నేర్చుకున్న నాగిరెడ్డికి దర్శ విశ్వాసం ఇనుమడించింది.

తరువాత తండ్రిగారి పనుపున, కంపెనీప్రతినిధిగా బర్మా వెళ్లారు. అది యుద్ధకాలం. జపాన్ సైన్యందాటికి అక్కడపరిస్థితులు అల్లకల్లోలం అయ్యాయి. ఆ మేరకు అక్కడ నష్టం వాటిల్లింది. చికాకుపడ్డ మనసుతో నాగిరెడ్డి మద్రాసు వచ్చిచేరారు. ఆ స్థితిలో కొన్నాళ్లు ఊరికే కాలక్షేపం చేశారు. ఆ రోజుల్లోనే ఆధ్యాత్మిక గ్రంథాలు ఆయన చాలా చదవడం జరిగింది.

* * *

బర్మాలో ఉండగా ఒకరోజున ఒక మనిషి ఈయనదగ్గరకు వచ్చి, ఆకలిగా ఉందన్నాడు. అతన్ని హోటలుకు తీసుకువెళ్లి, పుష్కలంగా తినుబండారాలు తెప్పించి తినమన్నారు. అతను తినలేదు. పొరుక్కదగ్గర తన పెళ్లాం బిడ్డలు, తిరగలేని ఇంకో కుటుంబం ఉన్నారనీ, వాళ్లూ తింటే సంతోషంగా ఉంటుందనీ అన్నాడు.

“కొంచెం డబ్బుతో రెండు కుటుంబాలను ఒకపూట సంతోష పెట్టానన్న తృప్తి, ఒకవిధమైన ఆనందమూ కలిగాయి. ఒకర్ని మనవల సంతోషిస్తున్నపుడు కలిగే సంతోషం ఎంతటిదో తెలిసింది” అన్నారు నాగిరెడ్డి.

మద్రాసువచ్చి కొన్నాళ్లు పనిలేకుండా ఉన్నపుడు ఇదే ఆలోచన వచ్చింది.

“పెద్ద వ్యాపారంచేయాలి. బాగా డబ్బు గడించి సుఖపడాలి; పెట్టాలి.” అని.



కళాదర్శకుడు కళాధర్

మద్రాసు ఆచారప్పన్ వీధిలో బి. ఎన్. కొండారెడ్డి అండ్ కంపెనీ పేరుతో ఒక ప్రెస్ ఉండేది. 1918 లో అది నెలకొంది. 1936 లో బి. ఎన్. రెడ్డిగారు దానికి యాజమాన్యం వహించి వృద్ధిచేశారు. అందులో ‘ప్రజామిత్ర’ అచ్చుఅయేది. ‘45 నాటికి బి. ఎన్. చిత్రనిర్మాణంలో నిమగ్నులైఉన్నారు. రామలింగారెడ్డిగారు ఇంపోర్ట్ ఎక్స్‌పోర్ట్ వ్యాపారం చూసుకుంటున్నారు. తమ్ముడు కొండా రెడ్డి చలనచిత్ర ఛాయాగ్రహణం నేర్చుకుంటున్నారు. అప్పుడు నాగిరెడ్డి ఆ ప్రెస్ తీసుకొన్నారు. యువప్రచురణల సందర్భంగా చక్రపాణిగారికి ఆయనకు పరిచయం అయి దృఢస్నేహంగా ‘విజయ’ ధ్వజ దిగ్విజయానికి నాందిగా రూపొందింది. అక్కడే ‘ఆంధ్రజ్యోతి’ ‘చందమామ’ పత్రికలు ఆరంభించారు.

అన్నగారు బి. ఎన్. ద్వారా నాగిరెడ్డి గారికి చిత్రనిర్మాణంతో సంబంధం ఉంటూ వచ్చింది. 1949 ఆగస్టులో పరిస్థితులు అనుకూలించాయని తోచగానే నాగిరెడ్డి, చక్రపాణి వాహినీని కౌలుకు తీసుకొని, చిత్రనిర్మాణం ఆరంభించారు. ‘వీరహనుమాన్,’ పతాకంతో ‘విజయ’ధ్వజ మెత్తారు...

వాహినీ, విజయా, ప్రసాద్ ప్రాసెస్, చందమామలలో మొత్తం 2000 మంది పని చేస్తున్నారు. ప్రసాద్ ప్రాసెస్‌ను నాగిరెడ్డి పెద్దకుమారుడు లక్ష్మీనరసింహప్రసాద్, చక్రపాణిగారి కుమారుడు తిరుపతిరాయుడు నిర్వహిస్తున్నారు.

* * *

ఇంత పెద్ద సంస్థకు సారథి నాగిరెడ్డిగారు ఎత్తుకుర్చీ వేసుకుకూర్చోరు. సాధారణంగా ఆయన స్టుడియో అంతటా తిరుగుతూ ఉంటారు. ఫలానా మొక్క ఎలా పెరుగుతుందన్న విషయం దగ్గర్నించి ఏ సెట్‌మీద ఏ నిర్మాతకి ఇబ్బంది వస్తోందన్న విషయం వరకుకూడా ఆయన తెలుసుకొని ఆ పనులు శ్రద్ధగా చూసుకుంటారు.

పూలమొక్కలంటే, పచ్చిక బయళ్ళంటే ఆయనకుఎక్కడలేనిశ్రద్ధాను. ఇవాళ ఒకచోట చోటు ఖాళీగా ఉంది అంటే, అక్కడ తెల్లారేసరికి అందమైన వనం లేవాలి. ఒకొక్కసారి, మొక్క నాటి, పెరిగే వరకూ ఊరుకోవడానికి ఓపిక ఉండదు. పదిహేను ఇరవై అడుగుల ఎత్తున ఎక్కడో పెరిగిఉన్న చెట్లు కొనేసి, అమాంతం రాత్రికి రాత్రి తెచ్చి నాటించి తెల్లవారేసరికి, ఎల్లవారూ ఆగారడీ చూచి తెల్లబోయేలా చేయడం బహుసరదా. ఇప్పటి విజయా గార్డెన్స్ఆమధ్య 26ఎకరాలచిట్టడవి. సరిగా 26 రోజులలో ఆఅడవి పడగొట్టి, నేల

(97- వ పేజీ చూడండి)

(46-వ పేజీ తరువాయి)

కలిసి వచ్చాయి. 'పాతిమంగలి' కర్తక ఆయన నిర్వహించేవారు.

* * *

నాగిరెడ్డిచక్రపాణిగారలకు చిత్ర నిర్మాణంలో ప్రవేశించాలన్న సంకల్పం కలిగింది. విజయా ప్రొడక్షన్స్ నెలకొల్పి, తొలిసారిగా 'షావుకారు' చిత్రం తీశారు. దానికి కథ, సంభాషణలూ చక్రపాణి, (పాటలు సముద్రాల) వ్రాశారు. ప్రసాద్ గారు దర్శకుడు. కథాంశాన్ని వదలకుండా, అనవసరమైన ఉపకథలూ, హాస్యపు దాంగులూ చోరబడనీకుండా, సూటిగా, అందంగా రూపొందించిన చిత్రం అది. చక్రపాణిగారు రచనచేసిన తరువాతి చిత్రం 'పెళ్ళిచేసిచూడు', ఆవెనుక 'మిస్సమ్మ' అందమైన కలలకు, హాస్యరసభరిత సన్నివేశాలలో నగిషీలుపెట్టి, ఈ ఆనందం వెనుక, మెత్తని బాధను, గంభీరమైన సమకాలిక సమస్యను నిలిపి చేసిన రూపకల్పన 'పెళ్లిచేసిచూడు.' అందరి మనసులను హరించే మధురజీవిత స్వప్నాన్ని, సాధ్యాసాధ్యాల సరిహద్దుమీద నిలిపి రంజింపచేయడంలో 'మిస్సమ్మ' మరోమెట్టుపైనే ఉంటుంది. ఈ రెండిటిలోనుకూడా, వింత వింత మనస్తత్వాలు గల పాత్రలను, విచిత్రంగా కనబడుతూ, సహజం, సాధ్యం అనిపించే సన్నివేశాలను కల్పించారు చక్రపాణిగారు.

* * *

'విజయా'వారి చిత్రాలన్నిటిలోను, కనబడే విశిష్టమైన లక్షణం కళాసృష్టికి అందాన్నిచ్చే ఐ.టి. రచయితగా, విశిష్టమైన కథలతో, విలక్షణమైనా అందరికీ అభిమానపాత్రం కాగల పాత్రలతో తెలుగు ప్రేక్షకులను రంజింపచేస్తున్న చక్రపాణిగారు, కార్యదక్షతగల నిర్మాతగా, ప్రతిచిత్రం కళాత్మకంగా ఉండడానికి, సమగ్రమూ సుందరమూ అయిన రూపురేఖలతో ఒప్పడానికి తృప్తిలోపం ఎన్నడూ రానివ్వరు. ఆత్మ విమర్శనాశక్తి, అందుకు కావలసిన చిత్తశుద్ధి, ఉన్నమనిషి కాబట్టి, తృప్తికరమైన ఫలితాలకోసం ఎంతైనా శ్రమపడతారు. అందుకు ఎంత ఖర్చయినా వెను



ప్రసాద్ ప్రాసెస్‌లో, సినిమా పోస్టర్లు ముద్రించడానికి ఫోటోగ్రాఫ్ చేసే కెమెరా. 40" × 40" గ్రౌండ్ గ్లాస్ గల ఇంత పెద్ద కెమెరా దక్షిణభారతంలో ఇదొక్కటే.

తీయరు. నిర్మాతగా చక్రపాణిముద్ర ప్రతిచిత్రంలోను కనబడుతుంది.

ప్రాణానికి హాయిగా, తీయగా ఉండే చిత్రాలూ అందుకు తగిన సంగీతం ఉండాలని, అది మన తెలుగు వాతావరణానికి చెందేది అయి ఉండాలని ఆయన నమ్మకం.

మనలో వంటబట్టి పోయిన సంగీతపు



రచయిత పింగళి నాగేంద్రరావు

ధ్రుతులకు, లయకు అనుగుణంగా, వీలైతే దగ్గరగాఉండే పాటలైతే, బహుళ జనాదరణ పొందుతాయని ఆయన అంటారు.

ఎక్కడో ఎప్పుడో, విన్నామనిపించే పాటలుంటాయి. అవి మనసులో పెదాలలో తేలిగా మెదులుతూఉంటాయి. అలాంటిలో, కొత్తగా ఒకపాటకడితే అది తక్షణం మనసుకు పడుతుందని, సంప్రదాయానికి, తర్కానికి, విరుద్ధమైనవి అంత చప్పున ఆకర్షించలేవనీ ఆయన వాదం.

పాశ్చాత్య సంగీతంలో బిథోవన్ వంటి మహావిద్వాంసుల సంగీతం గబుక్కుని మనకు ఆత్మీయం కాకపోవడానికి కారణం ఇదే కాని ఆ కృతుల లోపం కాదు. అంటారాయన.

తన చిన్నప్పుడు పెద్దవాళ్ళు పాడుతుండగా విన్న ఒక పాటవరసను చక్రపాణి, ఒకసారి సంగీత దర్శకుడు రాజేశ్వరరావుకు సూచనగా వినిపించారు. అది విని రాజేశ్వరరావు కట్టినపాట వరస: 'మిస్సమ్మ'లోని "బృందావన మది అందరిది" అనేది. పరిభాష ప్రకారం, అది 'హిట్' అనీ బహుళ జనాదరణ పొందిందనీ బహుళ జనులకూ తెలుసు.

చక్రపాణిగారు విజయ సంస్థలో భాగస్వామి, దానికి అనుబంధసంస్థలనతగ్గ ప్రసాద్ ప్రాసెస్, చందమామ పబ్లికేషన్స్ బి.ఎన్.కె. ప్రెస్‌లలో డైరెక్టర్. ★

# ★ దక్షిణభారతంలో చలనచిత్ర పరిశ్రమ ★

దక్షిణ భారతంలో చలనచిత్ర పరిశ్రమకు, వ్యాపార దృష్ట్యా 1957 చాలా గొప్ప సంవత్సరం. అన్నివిధాలా ఈ ఏడాది పరిశ్రమ కొత్త ప్రమాణాలను అందుకొన్నది. తయారైన చిత్రాలసంఖ్య గత సంవత్సరం 107 నుండి 117 కు పెరిగింది. వీటిలో 8 సింహళ చిత్రాలున్నవి. 109 సెన్సారు అయ్యాయి.

ఇంతవరకు ఇన్ని చిత్రాలు ఎన్నడు సెన్సారుకాలేదు. అలాగే, స్టుడియోలు, థియేటర్లు, టూరింగ్ సినిమాలూ పెరిగాయి.



మద్రాసులో సరికొత్తగా నెలకొంటున్న పొన్నలూరి బ్రదర్సు స్టుడియో. దీని వైశాల్యం 8 ఎకరాలు. రెండు ఫ్లోర్లు నిర్మిస్తున్నారు.

ఇంకా ఇవి బాగా పెరిగేసూచనలున్నాయి. బాక్సాఫీస్ వసూళ్లలోకూడా పెరుగుదల కనబడుతున్నటు ఈ వివరాలు ప్రకటించిన దక్షిణభారత ఫిలిం వాణిజ్యమండలి నివేదిక తెలియచేస్తున్నది.

సెన్సారైన 109 లోను తమిళచిత్రాలు 46, తెలుగు 36, మలయాళం 7, కన్నడం 14, హిందీ 6, సింహళం 8.

గత సంవత్సరంతో పోల్చిచూస్తే తెలుగు చిత్రాల సంఖ్య 27 నుండి 36 కు పెరిగింది. (డబ్బింగ్ సహా) తమిళ చిత్రాల సంఖ్య 50 నుండి 46 కు తగ్గింది. కన్నడ చిత్రాల సంఖ్య యథాప్రకారం ఉంది. మలయాళ చిత్రాలు 5 నుండి 7 కు, హిందీచిత్రాలు 5 నుండి 6 కు పెరిగాయి. సింహళ నిర్మాతలు గత సంవత్సరం ఇక్కడ 6 చిత్రాలు తీసి, ఈ ఏడు 8 తీశారు.

కొత్త సర్టిఫికెట్లు తెచ్చుకొన్న పాత చిత్రాలు మొత్తం 48. వాటిలో తమిళం 28, తెలుగు 13, మలయాళం 2, కన్నడం 1, హిందీ 3, ఇంగ్లీషు 1 ఉన్నాయి.

ఈ ఏటి నూటతొమ్మిది చిత్రాలలో డబ్ చేసినవి 19. డబ్బింగ్ ఈ ఏడాది ఉచ్ఛస్థాయిలో ఉంది.

క్రిందటేడు పొడుగులో తెలుగు చిత్రాలే ముందడుగు. ఈ ఏడు మనం వెనకబడ్డాం. తమిళ చిత్రాల సగటు నిడివి 16½ వేల అడుగులు కాగా, మనది 16 వేలే. మలయాళ, కన్నడ చిత్రాలు నాలుగైదు వందలు వెనక ఉన్నాయి. ఇది సగటు లెక్కల అభిప్రాయం మటుకే. కాని విడిగా చూస్తే మనదే పై చెయ్యి. ఒక తెలుగు చిత్రం నిడివి 19680. తమిళ చిత్రం 19439దాటలేకపోయింది! తమిళంలో అన్నిటికన్న చిన్న చిత్రం 8522 అడుగులు కాగా, తెలుగులో 13018. ఒక కన్నడ చిత్రం అన్నిటినీ మించింది. దాని నిడివి 20775. [illegible] చిన్న చిత్రం 127000.

ఈ ఏటి చిత్రాలలో సాంఘికాలకే అగ్రస్థానం. అవి 65. పౌరాణికాలు 16. మిగతా 21 జానపదాలు, ఏ జాతికీ చెందనివీను. పిల్లలచిత్రం ఒకటి ఇక్కడ తయారైంది. మరొకటి సెన్సారైంది.

దక్షిణ భారతం మొత్తంమీద 24 స్టుడియోలు ఉన్నాయి. వీటిలో మద్రాసునగరంలో ఉన్నవి 17. సేలంలో రెండు, కోయంబత్తూరులో 1, తిరువేంద్రంలో రెండు, మైసూరులో ఒకటి ఉన్నాయి. హైదరాబాద్‌లో సారధీ వారి కొత్త స్టుడియో పూర్తికావస్తోంది. మద్రాసులో సరికొత్త స్టుడియో పొన్నలూరి బ్రదర్సు నిర్మిస్తున్నది. ఇది ఉగాదికి పని ఆరంభిస్తుంది. మొత్తంమీద ఈ స్టుడియోలలో 66 ఫ్లోర్లు ఉన్నాయి. దక్షిణభారత భాషా చిత్రాలు నూరింట 90పాళ్ళు మద్రాసు నగరంలో 17స్టుడియోలలోనే తయారవుతున్నాయి. చిత్రనిర్మాణం ఏడాది పొడుగునా ఒకేస్థాయిలో సాగింది. ఎప్పుడూ 140 చిత్రాలు నిర్మాణంలో ఉంటున్నాయి.

ఈ ఏడు స్టుడియోలు గల నిర్మాతలు తీసిన చిత్రాలు 28. స్థిరపడి పేరు తెచ్చుకొన్న కంపెనీలు తీసినవి 48. కొత్త నిర్మాతలు 38 చిత్రాలు నిర్మించారు.

దక్షిణ భారతంలో అగ్రశ్రేణీనటులవద్ద వారు తొమ్మండుగురు, ముఖ్య నటీనటులుగా

(98-వ పేజీ చూడండి)

## స్టుడియోలు

ఎ. వి. ఎం. [illegible] ఎ. ఎల్. ఎస్. (ప్రొడక్షన్సు కొంటు తీసుకున్నారు), సిటాడెల్, ఫిలింసెంటర్, జెమిని, గోల్డెన్, నరసు, నెప్ట్యూన్, న్యూటోన్, పారమౌంట్, ప్రకాష్, రాయల్, శ్యామల, వాహిని, విజయ (మాజీ రేవతి స్టుడియో) విక్రమ్, వీనస్.

ఇతర స్టుడియోలు: కృష్ణా స్టుడియోస్, (తిరువేంద్రం) మెరిలాండ్ (తిరువేంద్రం) మాడర్న్ థియేటర్సు స్టుడియో, రత్నా స్టుడియో (సేలం), పక్షిరాజా (కోయంబత్తూరు) ప్రీమియర్ (మైసూరు)



ఎం.ఎల్.ఎ. చిత్రం ద్వారా 1957లో తెలుగు ప్రేక్షకులకు పరిచితుడైన కొత్త నటుడు

**రమణమూర్తి**

# 1957 లో తెలుగు చిత్రాలు:

# సింహావలోకనం

కొత్తసంవత్సరంలో కాలుపెడుతూ, ఒక్క క్షణం ఆగి వెనక్కి చూస్తే, కళకళలాడుతున్నట్టు కనిపించే సంవత్సరాలలో, తెలుగు చలనచిత్రపరిశ్రమకు సంబంధించినవరకు, 1957 వ సంవత్సరం మంచి హుషారైన కాలం. ఇన్ని చిత్రాలు ఇదివరకెన్నడూ తయారుకాలేదు. తెలుగులో తయారైన 26 చిత్రాలలో 15 సాంఘికచిత్రాలు. ఆరు పౌరాణికాలు. మిగతావి జానపదాలు.

మూడిటిలోను ఆర్థికంగా మంచి ఫలితాలు సాధించినవి ఎక్కువగా పౌరాణికాలే. ఇలా రాణించిన పౌరాణికాలలో కూడా విజయవారి 'మాయాబజార్' దక్షిణభారతంలోనుటుకే ఘనవిజయం సాధించింది. ఆంధ్రలో పలుచోట్ల రోజుకు ఐదాటల ప్రదర్శనలుకూడా వేశారు. సర్వసమగ్రమైన స్క్రిప్టే చిత్రవిజయానికి ముఖ్యమని నమ్మి పాటించే ప్రసిద్ధదర్శకుడు కె. వి. రెడ్డి, ఈ విజాన్ని మరోసారి నిరూపించారు. ఇంత ఆహ్లాదకరమైన, ప్రసన్నత ప్రధానంగాగల పౌరాణికం ఇదివరకు రాలేదు.

సాంఘికాలలో కూడా, స్క్రిప్టు రచన కట్టుదిట్టంగా ఉండడానికి చాలా ఓపికతో కృషిచేసే అన్నపూర్ణావారి 'తోడికోడళ్లు' ఆంధ్రలోను, తమిళనాడులోను కూడా అఖండవిజయం సాధించింది. ఇతర సాంఘికాలలో అనేకం రాణించకపోవడానికి, ఆర్థికంగా ఆశించిన విజయం సాధించకపోవడానికీకూడా కథలో పుష్టి, తుష్టి లోపించడం, కథాసంవిధానాలు లోపభూయిష్టంగా ఉండడం అనిపిస్తుంది మొత్తానికి పరోక్షంగా 'తోడికోడళ్లు' చెబుతున్న నీతివాక్యం: 'తెలుగుదేశంలో కథలకు కరువేర్పడింది. బెంగాలీకథలే. యోగ్యంగా ఉన్నాయి' వచ్చినా మానినా, ఉన్న పరిస్థితులనుబట్టి, వచ్చిన చిత్రాలలో కథలనుబట్టి ఈమాట అనుకోక తప్పదు.

కాగా, జానపదాలలో, అంజలీవారి 'సువర్ణసుందరి', ఆంధ్రలో అపూర్వమైన విజయాన్ని సాధించింది. 'పాతాళభైరవి' తరవాత మళ్లీ ఇంతవిజయం సాధించినచిత్రం ఇదే. బాక్సాఫీస్ సూత్రాలు అనబడేవాటన్నిటినీ దర్శకుడు రాఘవయ్యగారు ఇందు జనరంజకమైనరీతిని మెచ్చుతగ్గ కూర్పులో కూర్చారు.



కె. వి. రెడ్డి.

స్క్రిప్టే శ్రీరామరక్ష.



వేదాంతం రాఘవయ్య.

బాక్సాఫీ సూత్రాల పాలకుడు.



ఆదుర్తి సుబ్బారావు.

తెలుగు చిత్ర సీమకు బెంగాల్ టచ్.

## 1958 లో తారాబలం

| నటులు | చిత్రాలు |
|---|---|
| ఎన్. టి. రామారావు | 9 |
| జగ్గయ్య | 8 |
| అ. నాగేశ్వరరావు | 6 |
| అమరనాథ్ | 6 |
| చలం | 4 |
| గుమ్మడి | 12 |
| రంగారావు | 5 |
| రేలంగి | 17 |
| రమణారెడ్డి | 7 |
| సావిత్రి | 8 |
| అంజలి | 7 |
| జమున | 6 |
| భానుమతి | 8 |
| గిరిజ | 6 |
| శ్రీరంజని | 5 |
| జానకి | 8 |

—సేకరణ ఎం. శ్రీహరి రావు (ఒంగోలు)

ఇతర చిత్రాలో, ప్రశంసనీయమైన ప్రయత్నం అనుపమ ఫిలింస్ వారి 'ఎం. ఎల్. ఏ.' దర్శకుడు తిలక్, సాహసంతో, సమకాలిక సమస్యలను తీసుకొని ఇందులో పొందుపరచారు.



కొత్త నేపథ్యగాయని కుమారి జానకి

ఈ ఏడాది ముగ్గురు కొత్త దర్శకులు వచ్చారు. ఒకరు రచయిత సముద్రాల రాఘవాచార్య. ఈయన తీసిన 'వినాయకచవితి' గాలిగాలిలో పడవలా సాఫీగా సూటిగా సాగిపోయింది. ఆర్థికంగా విజయవంతమైన చిత్రాలో ఇదొకటి. మిగతా ఇద్దరూ యువ దర్శకులు సార్వభౌమ, అమానుల్లాలు. వీరు 'అక్కచెల్లెళ్ళు' చిత్రం తీశారు. చెప్పుకో తగ్గ కొత్తదనంతో, చైతన్యవంతంగా చిత్రాన్ని రూపొందించిన ఈ జంట వృద్ధికి రాగలగని ఆశించవచ్చును. ఈ ఏడాది చివర విడుదల అయిన రెండు చిత్రాలు 'ప్రేమే దైవం' 'వద్దంటే పెళ్ళి' ఇద్దరు కొత్త రచయితలు—జి.కె. మూర్తి, రామచంద్ లను పరిచయం చేశాయి. ఈయేటి హాస్య ప్రధాన చిత్రాలలో 'వద్దంటే పెళ్ళి' ఎన్నతగ్గది. ఇది మంచి ప్రజాదరణ పొందింది.

* * *

ఈ ఏడాది తెలుగు చిత్రాలలో పెద్ద విశేషం, సంగీతం చాలవరకు తెలుగుదనంతో వినబడడం హిందీ బాణీలు ఎలాగున్నా, పాశ్చాత్య అనుకరణలు లేవు. తెలుగుతనం ఉట్టిపడుతున్న వాటిలో చాలా మంచి పాటలు వచ్చాయి. భాగ్యరేఖలో కృష్ణశాస్త్రిగారు వ్రాసిన "నీ వుండేదా కొండపై, నే నుండేది నేలపై" అనే పాట, "హరిగోవిందా గోవిందా" అనే గేయం ఉత్తమ సాహిత్యంలో నిలుపతగ్గవి. పై పాటను సుశీల అతి మధురంగా పాడింది. రెండవపాటను మల్లిక్ బృందం పాడారు. మనోహరమైన సాహిత్యం ఉన్న ఈపాటను మల్లిక్ ఒకడే పాడి ఉంటే అది మరింత రాణించే దనిపించింది. అలాగే మరో సాంఘిక చిత్రం "ఎం. ఎల్. ఏ." లో, మరుపురాని మరోపాట "నీయాశ, అడియాసా, చేయిజారె మణిపూస" అనే గేయం. కొత్తగాయని జానకిరాణి, ఘంటసాల ఈ పాటను మనోహరంగా పాడారు. ఇందులో "గుండెల్లో గునపాలూ, గుచ్చారె నీవాళ్లు" అనే చరణాన్ని అంత వాడిగా వేడిగా రాసినవాడు ఆరుద్ర అని మా కనుమానం ఉంటుంది. పైరెండు చిత్రాలలోనూ ఈ పాటలకు ఇంత చక్కని, చిక్కని వరుసలు కట్టిన సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావుగారు అభినందనీయులు. యుగళ గీతాలలో సంగీతం సాహిత్యం అతిరమ్యంగా కుదిరిన పాట 'సారంగధర' చిత్రంలో 'అన్నానా భామిని' అనేది. ఈ పాటను సముద్రాల జూనియర్ వ్రాశారు. సంగీత దర్శకుడు ఘంటసాల గారే ఈ పాటను లీలతో కలిసి శ్రావ్యంగా పాడారు. మధురాతి మధురంగా కుదిరిన మరొక పాట 'స్వయంప్రభ' చిత్రంలో 'అనంత మధుర [illegible]' అనేది. సంగీత



1958 లో తొలి విడుదల [illegible] వారి '[illegible]'లో నాయక పాత్రను నిర్వహించిన కొత్త నటుడు [illegible]

దర్శకుడు రమేష్ చక్కని రాగమాలికలో దీనికి వరసలు కూర్చారు. పి. బి. శ్రీనివాస్, సుశీల కంఠాల జంట, ఈ పాటకు చాలా [illegible] మనసులో [illegible] స్వరతీయంగా, ఎన్ని సార్లు విన్నా తనివి తీరని [illegible].

# దృఢ శక్తి....



తుషార్‌తో వండిన మీ భోజన పదార్థముల నుండి మీ కవసరమైన శక్తినంతయు పొంద గలరని మీరు నిస్సందేహముగా నమ్మవచ్చును. అసలు నేతి యందలి పుష్టికి సమానమగు అదనపు పుష్టికరమైన ఆహార పదార్థములతో కలసి, ఆరోగ్య పద్ధతుల్లో సీలు వేసిన డబ్బాల యందు నింపబడిన తుషార్ మీ ఆరోగ్యమునకు ఆనందమునకు ఆదర్శమైనది.

# Tushar

2 పౌ॥, 5 పౌ॥, 10 పౌ॥ల, డబ్బాల్లో లభించును.




వనస్పతి విటమిన్ ఏ, డి లతో నిండియున్నది.

●

తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.



ప్రతి పసిబిడ్డకున్ను అప్పుడప్పుడు అజీర్ణ
బాధలు కలుగుచుండును. గాలి, కడుపు
నొప్పి, అతి విరేచనములు, (గ్రహణి)
అస్వస్థతను గలిగించును. ఒక టీ చెంచాడు
ఇన్‌ఫెన్‌టోన్ గ్రైప్ వాటర్ బిడ్డకు తక్షణం
శమనకారియై బాధానివృత్తిని గలిగించును.
తల్లులు 30 సంవత్సరములకన్నా ఎక్కువ
కాలము నుండియు తమబిడ్డలను సుఖం
గాను ఆరోగ్యవంతంగాను వుండుటకు ఆరోగ్య
వైద్య శాస్త్రీయంగా తయారు చేయబడినట్టి
ఇన్‌ఫెన్‌టోన్ గ్రైప్ వాటర్‌ను వాడుచున్నారు.
మీ గృహమందు ఎల్లప్పుడూ ఒక సీసాను
ఉంచుకొని మీ బిడ్డకు ఇవ్వండి

# తక్షణ నివారణ!

# ఇన్‌ఫెన్‌టోన్

రిజిష్టర్డు

## గ్రైప్ వాటర్




బిడ్డను ఆనందోత్సాహంగా వుంచును

హైదరాబాద్ కెమికల్ అండ్
ఫార్మసూటికల్ వర్క్స్ లిమిటెడ్,
హైదరాబాద్ - దక్కన్

PSHC-2%

# వజ్రం వజ్రేణ భిద్యతే

అన్న వస్త్రాల లాగే, మెదడుకు మేత కూడా అతి ముఖ్యం. వాటికోసం కృషి చేస్తున్న ప్రభుత్వం, ఈ రెండవ సమస్య గురించి కూడా శ్రద్ధతీసుకొని, దీనికి ఒక ప్రణాళిక వంటిది "అమలు జరపడం అవసరం" అని ప్రముఖ దర్శక నిర్మాత శ్రీ బి. ఎన్. రెడ్డి అభిప్రాయం.

ఉత్తమ చలన చిత్రాలు విరివిగా తయారు కావడానికి అనుకూలమైన పరిస్థితులు కల్పించడం ఎలాగ అన్న ప్రశ్నకు జవాబుగా, రెడ్డిగారు నేటి పరిస్థితులను, సమస్యలను చర్చించి, చలన చిత్ర ప్రగతికై ప్రణాళిక రూపొందించడం అవసరం అన్నారు.

ఈ రోజున చలన చిత్రాల తీరుతెన్నుల గురించి, స్థాయిగురించి, ఎందరో విమర్శలు చేస్తున్నారు. నేటి చిత్రాలు జాతిని పాడు చేస్తున్నాయని, దుర్వ్యాపారాలకు ప్రేరకాలుగా తయారవుతున్నాయని అధికార, అనధికారులలో బాధ్యతగల పెద్దలు అంటున్నారు. అనేవారే కాని, ఈ సమస్య ఏమిటి? ఈ పరిస్థితులు ఎందుకు ఇలా ఉన్నాయని పరిశీలించి, వీటిని మార్చడానికి మార్గం ఆలోచించేవారు, తోడ్పడేవారు లేరు.

ఫిలింతీసేవాడు, పోషకులనుగురించే ముఖ్యంగా ఆలోచిస్తాడు. అది సహజం. ఈరోజు పోషకులు ఎవరు? సామాన్య ప్రజలు. రాజులు పాలించిన రోజులలో కొద్దిమంది విద్యాధికులు కాబట్టి వారికిగల ఉత్తమోత్తమాభిరుచులనుబట్టే లలితకళ స్థాయి ఉండేది. అప్పుడు కళాకారుడికి రాజుగారే అన్నం పెట్టేవారు. ఈ రోజున, కోట్లాది ప్రజలను,



## శ్రీ బి. ఎన్. రెడ్డి సూచన

రకరకాల అభిరుచులుగల వారిని మెప్పించితేగాని డబ్బురాదు. ఏవో ఒకరిద్దరు కళారాధకులు, మేధావులు మెచ్చే స్థాయి ప్రజాబాహుళ్యం అంతటికీ నచ్చేదిగా ఉండదు. అందువల్ల లక్షలకు లక్షలు డబ్బుపోసి చిత్రం తీసేవాళ్ళు, మళ్ళీ దాన్ని రాబట్టుకునే ఉపాయాలను చూచుకుని ఆ ప్రకారమే వ్యవహరించడం సహజం. దానికి వాళ్ళని కోప్పడి లాభంలేదు. అందులో అర్థంలేదు. ఎవరైనా, ఏవో పెద్ద లాభాలకు ఆశపడవద్దు అంటే ఒప్పుకోవచ్చుకాని పెద్ద నష్టానికి సిద్ధపడు అంటే, ఎలా అంగీకరిస్తాడు? అలాగని మంచి చిత్రాలకోసం ఎవరూ, నిర్మాతల నష్టాన్ని శాశ్వతంగా భర్తీ చేయలేరు. ఈ పరిస్థితులు మారడానికి ఒక మార్గం ఉంది. బాధ్యతగలవారు దానిని పరిశీలించవచ్చును.

అన్న వస్త్రాలలాగే మెదడుకు మేత కూడా ప్రజాస్వామ్యంలో ముఖ్యావసరం. ఈనాటి ప్రచారసాధనాలలో సినిమాలు అతి ముఖ్యమైనవి. వినోదంతోపాటు, మానసిక వికాసానికి, మంచి ఆలోచనలు పెంపొందచేయడానికి ఇవి ఎంతైనా దోహదంచేయగలవు. కాబట్టి అన్నవస్త్రాలకోసం, పని [illegible] ప్రణాళికలు అమలుచేస్తున్న ప్రభుత్వం, చలనచిత్రకళ ప్రగతికి కూడా ఒక పంచవర్ష ప్రణాళికను తయారుచెయ్యాలి. బాక్సాఫీస్ విజయం ప్రమేయంలేకుండా, ఉత్తమ ఆశయాలతో, ఉత్తమస్థాయిలో నిర్మించిన చిత్రాలకు నష్టంవచ్చేటట్లయితే, ఆ ప్రభుత్వం అధికంగా సహాయంచెయ్యాలి. పరిస్థితుల్లో, పతకాలకన్న ఇది ముఖ్యం. విమర్శకులంతా ఎన్నికచేసి మెచ్చుకొన్న ఉత్తమ చిత్రానికి నగదుగా పదులక్షల రూపాయలు బహుమతి ఇవ్వాలి. అలాగే దానితరువాతి శ్రేణి చిత్రానికి మూడులక్షలు, అతరువాత మరోరెండుచిత్రాలకు లక్షచొప్పున ఇవ్వాలి. లక్షలుపోసి కష్టపడి చిత్రం తీసిన నిర్మాతకు అదే ఈనాటిపరిస్థితుల్లో నిజమైన సత్కారం.

ఈ విధంగా, సినిమాలకు, సంగీతానికి, సాహిత్యానికి మొత్తంమీద సాలుకు 25 లక్షల రూపాయల చొప్పున కేటాయిస్తూ, ఐదు సంవత్సరాలపాటు ఈ విధంగా ఆర్థిక సహాయంచేస్తే లలితకళలు సర్వతోముఖంగా వికసిస్తాయి. ముఖ్యంగా పెద్ద పెట్టుబడితో కూడిన సినిమా పరిశ్రమలో నష్ట భయం ఉండదు కాబట్టి బాగా డబ్బు ఉన్నవాళ్లూ అట్టే లేనివాళ్ళు కూడా, ధైర్యంతో ఉత్సాహంతో కొత్త సమస్యలను, కొత్త కథలను తీసుకొని చిత్రాలు నిర్మిస్తారు. ఈ విధంగా ఐదేళ్ళు జరిగితే, కొత్తలో కొన్ని చిత్రాలకు నష్టం వచ్చినా—ప్రజా సామాన్యానికి కూడా మంచి చిత్రాలను చూడటము అలవాటు అవుతుంది. క్రమముగా యీ వ్యవధి ముగిసేసరికి చిత్రాల స్థాయి పెరుగుతుంది. కేవలంనష్టంవస్తుందన్న భయమే కారణంగా వ్యాపార సరళిని చిత్రాలు తీస్తున్న నిర్మాతలు నూటికి 80 మంది పైన ఉన్నారు. అవకాశం వస్తే వారంతా తమ ప్రజ్ఞ చూపగలరు. అవకాశం ఇస్తేనే అది సాధ్యం. ఆశయాదర్శాలకే ప్రాధాన్యం ఇచ్చి, మంచి వినోదం, విజ్ఞానం ఇవ్వగల చిత్రాలు రావడానికి డబ్బే ప్రతిబంధకం కాబట్టి, ఆ సమస్యను, ఈ ప్రణాళిక రూపేణా డబ్బుతోనే ఎదుర్కొంటే విజయం సాధించవచ్చు.

వజ్రం వజ్రేణ భిద్యతే అన్నారు. ★

## ఆంధ్ర జనావళికి మా సంక్రాంతి అభివందనములు

సంక్రాంతి విడుదల

అరుణా వారి

# బొమ్మలపెళ్లి

హిందీ చిత్రాలు

ఎ.వి.యం వారి

## భాబి

దర్శకుడు: కృష్ణన్-పంజు

రాజకమల్ కళామందిర్ వారి

## మౌజి

దర్శకుడు: ప్రభాత్‌కుమార్

రాజకమల్ కళామందిర్ వారి

## ? (టెక్నికలర్)

దర్శకుడు: వి.శాంతారాం

రామన్ ప్రొడక్షన్సు వారి

## జ్వాలా (టెక్నికలర్)

దర్శకుడు: M.V. రామన్

విజయ వారి

## అప్పుచేసి పప్పుకూడు

దర్శకుడు ప్రసాద్

ఎ.వి.యం.వారి

## భూకైలాస

దర్శకుడు: శంకర్

పద్మశ్రీ పిక్చర్స్ వారి

## వెంకటేశ్వర మహత్యం

దర్శకుడు: పి.పుల్లయ్య B.A.

R.R. పిక్చర్స్ వారి

## కార్తవరాయన్ కథ

దర్శకుడు రామన్న

రాజకమల్ కళామందిర్

## నవరంగ్ (తెలుగు)

దర్శకుడు: వి.శాంతారాం
పాటలు: కొసరాజు

ఇప్పుడు ప్రదర్శింపబడుచున్నవి

విజయవారి
## మాయాబజార్

రాజకమల్ వారి
## దో ఆంఖే బారా హాత్



# విజయ పిక్చర్స్,

విజయవాడ-2 : గుంటకల్.

NVKR

# మంచిచిత్రాలు రావాలంటే—



ఎన్. టి. రామారావు

ఆశయాదర్శాలకు, ఆర్థిక వ్యవహారాలకు చుక్కెదురన్న ముక్క, సినిమా రంగంలో కొట్టొచ్చినట్టు కనబడుతుంది. వర్తమాన పరిస్థితులలో, నలుగురు బాగుందన్న చిత్రానికి డబ్బు రావటంలేదు. డబ్బు వచ్చిన చిత్రానికి మెప్పులులేవు, అన్నారు ఎన్. టి. రామారావు, నేటి పరిస్థితులపై వాటి ప్రభావాలపై తమ అభిప్రాయం చెబుతూ.

బాక్సాఫీసు హంగుల్ని గురించి పట్టించుకోకుండా, మంచి సాంఘిక సమస్యను తీసుకొని, కళకు న్యాయం చేకూరేవిధాన తీసేచిత్రం, వ్యాపారరంగంలోకి వచ్చేసరికి నిర్మాతకు ఏపాటి న్యాయం చేయగలుగుతోంది? అన్నిరకాల హంగులూ కూడావుండే ఉన్న చిత్రం లక్షలకొద్దీ లాభాలు ఆర్జిస్తూన్నప్పుడు, ఇది అదేశక్కన నష్టం 'ఆర్జిస్తోంది.' ఎటొచ్చి నలుగురు పెద్దలూ చూసి శెబాస్ అనవచ్చు. అపైన ప్రభుత్వం ఒక పతకమో, సర్టిఫికెటో ఇచ్చి ఘనం చెట్టవచ్చు.

అమాత్రాన సంగతి ఏమిటి? లక్ష, రెండో నష్టపడ్డ నిర్మాత మళ్ళీ ఏడాది ఈ మెప్పుకోసం అని మళ్ళీ రెండు లక్షలు దండుగపడడానికి వడిగడతాడా?

మామటుకు మేము 'నేషనల్ ఆర్ట్ థియేటర్స్' పేరిట నిర్మించిన సాంఘికచిత్రాన్ని ప్రభుత్వం మెచ్చి యోగ్యతాపత్రాన్ని ఇచ్చింది. పదిమందీ బాగుందన్నారు.

ఖర్చు వసూల్లు తేరిజా వేసుకొన్నాక, మా త్రివిక్రమరావు, (ఎన్. ఎ. టి. మేనేజింగ్ డైరెక్టర్), ఈసారి 'జయసింహ' కథను సినిమా తీసామన్నారు...జయసింహ ఆర్థికముగా అఖండవిజయం సాధించింది. ఇది మా ఒక్కరికథే కాదు; సర్వత్రా యింతే. ఈ పరిస్థితులలో, "మంచిచిత్రం" తీయడం అంటే నష్టానికి సిద్ధపడటం అన్న అర్థం కనబడుతోంది.

"ప్రభుత్వ ప్రశంసాపత్రం ఖరీదు రెండు లక్షల రూపాయలు కాబోలు" అనిఈమధ్య మామిత్రు డొకాయన అన్నారు. ఇలా అనుకోడం ఏమంత సంతోషకరమైన విషయం కాదు. కాని, ఇష్టంవున్నా లేకున్నా పరిస్థితులు అలాంటి భావాలు కలిగిస్తున్నాయి.



[illegible] జపాన్‌లో. [illegible]

ఈదృష్ట్యా, ఉత్తమ చిత్రాలు రావటం లేదని ప్రకటనలు, విమర్శలుచేసే గాయకులు, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాధికారులు ఇందు లో [illegible] ప్రభుత్వం ఇటీవల రెండు చిత్రాలపై వినోదంపన్ను మినహాయించింది. నిజానికి, ఈ మినహాయింపులకన్న, నగదుగా ఇచ్చే కానుకలకన్న మంచి పద్ధతి 'మార్కెట్'ను పెంచడం. అప్పుడు ఎవరూ ఏమీ ఇవ్వనవసరం ఉండదు.

'ఉత్తమంగా ఉన్న చిత్రాలు' అనిపించుకొన్నవాటికైనా, విదేశాల్లో వాణిజ్యస్థాయిని ప్రదర్శించడానికి ప్రభుత్వం విరివిగా సదుపాయాలు చేయాలి.

* * *

కేంద్రప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం కూడా ఈ పరిశ్రమ విషయంలో ఇకనైనా ఎక్కువశ్రద్ధ వహించడం అవసరం. ప్రభుత్వానికి సినిమాద్వారా పాలుకు పాతికకోట్ల వరకూ పన్నులరూపంలో వసూలు అవుతోంది. ఇంతపెద్ద రాబడికి ఆధారమైన ఇంతముఖ్యమైన పరిశ్రమపట్ల ఈనాడు ప్రభుత్వం ఏమి అభిమానం చూపుతోంది? విదేశీమారకం నిల్వలు పొదుపు చేయవలసిన అవసరంరాగానే, ఈపరిశ్రమకు అతి ముఖ్యమైన ముడిఫిలిం దిగుమతిని తగ్గించివేసింది. దీనిద్వారా ఆదా అయ్యేది, కావలసిన మొత్తంలో నూరింట ఒకవంతుకూడా లేదు. అయినా, దానివల్ల ఈనాడు పరిశ్రమలో ఎందరో నిర్మాతలు అవస్థపడుతున్నారు. నిర్మాణం నిర్దుష్టంగా ఉండాలన్న పట్టుదల గలవాళ్ళుకూడా, అంతంతమాత్రపు ఫలితాలతో సరుకుని పోవలసివస్తోంది. అటు ముడి ఫిలింఫ్యాక్టరీ స్థాపన సంగతిమాత్రం ఇంకా పూర్తిగా దారికిరాలేదు. ఈ పరిస్థితిలో ఫిలిం దిగుమతిని నూటికి 40 పాళ్ళు తగ్గించివేశారు. ఈనాడు నిర్మాణంమాత్రం ఎన్నడు లేనంత ఉత్సాహంగా ఉంది. ఇప్పుడు వచ్చిపడ్డ అవస్థలూ అంతగానూ ఉన్నాయి. ఇది భావ్యంకాదు.

ఫిలింపరిశ్రమ పురోభివృద్ధికి, చిత్రాల స్థాయి పెంపొందడానికి, ప్రభుత్వం స్నేహభావంతో, అభిమానంతో శ్రద్ధవహించి కృషిచేయడం అవసరం. 

## అన్నపూర్ణా పిక్చర్స్ వారి: * * *

# చిత్రనిర్మాణంలో

"ఫలానా ఫిలింస్ వారి కొత్త చిత్రం శరవేగంతో తయారవుతోంది.' ఇప్పటికి ఆరురీళ్లు పూర్తి అయింది. ఇందులో.... నటిస్తున్నారు. దర్శకుడు.... ఈ చిత్రానికి మాటలూ పాటలూ ఫలానా ఫలానావారు—"

—వ్రాస్తున్నారు అని, చలన చిత్ర వార్తలలో కనబడడం పరిపాటి.

నిర్మాణం సగంవరకూ అయినా, ఇంకా మాటలు రాస్తూనే ఉండటం ఏమిటి అని ఈ రోజున ఆట్టేమంది ఆశ్చర్యపడిపోవటం లేదు. ఎందుకంటే, బలవత్తరమైనవని చాలామంది చెప్పే పరిస్థితులవల్ల, ఇంకా అనేక కారణాలవల్లా, కారణాంతరాలవల్లా అనేక సందర్భాలలో చిత్రనిర్మాణానికి సమాంతరంగానే ఈనాడు రచనకూడా జరుగుతోంది. చిత్రానికి పునాది, ప్రాణం అనదగ్గ స్క్రిప్టును రూపొందించడం, సంభాషణలు సమకూర్చడం అతి శ్రద్ధగా చాలా ముందుగా చేయవలసినపని అని చాలామందికి తెలుసు. కాని, పైన పేర్కొనబడని అనేక కారణాలవల్ల పాటించి పట్టించుకోవడం మానేశారు. సెట్ మీదకు ఆర్టిస్టులు వచ్చాక, ఆనాటి సన్నివేశం ఎలా ఉండాలో నిర్ధారణచేసి, అప్పైన మాటలు వ్రాసి, నటులకు అందచేయడం ఈనాడు మామూలు; ఒక విధంగా ఫాషన్ కూడా కాబోలు అనుకోవలసి వస్తుంది.

మామూలైనా, ఫాషన్లూ ఎలా ఉన్నా, ఎప్పుడూ స్క్రిప్టు విషయంలో మాటికి రెండురెట్లపాళ్లు శ్రద్ధ తీసుకొని, అంతా ముందే సమకూర్చుకొని అసలు నిర్మాణం ఆరంభించే దర్శకనిర్మాతలు కొందరు ఉన్నారు. కొన్ని చిత్రాల విషయంలో మటుకు, '—గదన ఫలానావారు చేశారు' అని దర్జాగా చెప్పుకోవచ్చు.

* * *

ఈ కోవకు చెందిన సంస్థలలో అన్నపూర్ణా పిక్చర్స్ ఒకటి. ఆదర్శప్రాయమైన తగ్గ పద్ధతులలో వీరు నిర్మాణం సాగిస్తున్నారు. అన్నపూర్ణావారు తీసిన రెండు చిత్రాలూ (దొంగరాముడు, తోడికోడళ్ళు) సాంఘికాలే. అవి రెండూ విశేషజనాదరణ పొందాయి. ఈ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి. ఏ. పట్టం పుచ్చుకొన్నారు. చిన్నప్పటినుండి నాటక ప్రదర్శనల నిర్వహణ ఈయనకు ప్రియమైన కార్యం. ముదినేపల్లిలో ఎక్సెల్సియర్ క్లబ్ నెలకొల్పి చాలా ప్రదర్శనలు నిర్వహిం

# స్క్రిప్టుకే ప్రాముఖ్యం

చారు. అప్పుడూ, ఇప్పటిలాగే, సాంఘిక ఇతివృత్తాలమీదనే ఈయనకు అభిమానం. అక్కినేని నాగేశ్వరరావు అప్పట్లో ఈ కంపెనీ నాటకాలలోనే వేషాలు వేయడం తెలిసినదే. నాగేశ్వరరావు, శ్రేయోభిలాషిగా, మధుసూదనరావు మద్రాసులో ప్రయత్నాలు చేసి, అతనికి చలనచిత్రాలూ ప్రవేశించడానికి దోహదంచేశారు. దరిమిలా ఈయనకు చిత్రనిర్మాణంలో ప్రవేశించాలన్న సంకల్పం కలిగింది. తత్ఫలితంగా, ఈయనా, నాగేశ్వరరావు, సహయోగ శ్రీనివాసరావుగారలూ మరికొందరూ కలిసి 1951 అక్టోబరు 10 న అన్నపూర్ణాపిక్చర్స్ (ప్రైవేట్) లిమిటెడ్ నెలకొల్పారు. అయితే వీరి తొలి చిత్రం 'దొంగరాముడు' నాలుగేళ్ళ తరవాతనే (1955 అక్టోబరు 1 న) విడుదల అయింది. మరి నాలుగేళ్ళు ఎందుకు ఆగినట్టు?

* * *

"కె. వి. రెడ్డిగారికోసం" అంటారు మధుసూదనరావు.

తెలుగుదేశం సగర్వంగా చెప్పుకోతగ్గ దర్శకులలో కె. వి. ఒకరు. ఇటు చలనచిత్ర కళ దృష్ట్యా మంచి ప్రమాణాలు నిలబెడుతూ, అటు ఆర్థికంగా విజయం సాధించగల (ఉభయ) తారకమంత్రాన్ని అవగతమైన పద్ధతులు ఏవో ముందు తెలుసుకొని, ఆపైన నిర్ణయించుకొని ఉపక్రమించాలన్న నిశ్చయంతో, మిత్రుడు కె. వి. రెడ్డి, చేతిలో ఉన్న చిత్రం పూర్తి అయేవరకు ఆగారు.

"చలనచిత్ర నిర్మాణంలో సాధక బాధకాలు ఎన్నిటినో ఆయనవద్ద నేను తెలుసుకున్నాము" అంటారు మధుసూదనరావు.

'దొంగరాముడు' విజయం తరవాత, 'తోడికోడళ్ళు' కథ తీసుకున్నారు.

"విజయవంతంగా సాగుతున్న చిత్రాల కథలకూ, నేను తీసిన చిత్రం కథకూ పూర్తిగా భిన్నమైన ఇతివృత్తాన్ని, కొత్తదనం కలదాన్ని తీసుకోవటం నా లక్ష్యం. దానికై, మూడు నెలలపాటు మంచి చెడ్డా, పడి ఎడనూ చూచుకుని, శరత్ నవల 'నిష్కృతి' కథావస్తువుగా తీసుకొని, దానిని తెలుగులో, ఈ వాతావరణానికి అనువైన విధాన వ్రాసుకొన్నాము" అన్నారు మధుసూదనరావు. 'తోడికోడళ్ళు' చిత్ర సంభవ గాథను వివరిస్తూ.

* * *

ఎవరి స్వాతంత్ర్యానికీ భంగం కలుగకుండానే, దక్షతగల నిర్మాత బాధ్యతాయుతంగా కార్యకలాపాలు సాగించగల పద్ధతులు ఏవో, వీరి విధానాలు చూస్తే గోచరిస్తాయి.

ముందర కథనిర్ణయం అయినాక, దాన్ని [illegible] ంటే,

'స్క్రిప్టు' అని [illegible] చిత్రం నిర్ణ[illegible]ంగా సాగిపోవాలంటే, కెమెరాను మొట్టమొదట ముందర కథ, సన్నివేశాల విభాగం, అలాగే పాటల వివరం, సంభాషణలూ సమగ్రంగా పూర్తిగా వ్రాసుకోవటం అవసరమని చెప్పి, చేసి, నిరూపించారు ఆయన. కెమెరా మొట్టమొదన్నాక మళ్లీ స్క్రిప్టును ముట్టుకోకూడదు. అంటే మార్చకూడదని కాదు. అందులో మార్పులు చేయడం తగదు. తూ. చ. తప్పకుండా దాన్ని పాటిస్తే ఆడుతూ పాడుతూ, చక్కని చిత్రాన్ని తీయవచ్చు.

దీనిమీద ఎంత గురి ఉందో, ఆ విద్యలో అంత ప్రజ్ఞ ఉన్న కె. వి. రెడ్డిగారి సహాయ సహకారాలతో తొలిచిత్రం తీయాలను కున్నారు వీరు. చిత్రనిర్మాణం జూదం కాదు. శాస్త్రం. కళ. కాబట్టి, కట్టుదిట్ట





# ఈనాటి సంగీతం

భానుమతీ రామకృష్ణ

ఈనాడు సిలోన్ రేడియో పుణ్యమా అంటూ అన్నిరకాల సంగీతమూ వింటున్నాం. సబ్బుల సంగీతం, పండ్లపొడి సంగీతం, బిస్కట్ల సంగీతం, కడుపునొప్పి సంగీతం, తలనొప్పి సంగీతం, టూత్ పేస్ట్ సంగీతం, వక్కపొడి సంగీతం, ముక్కుపొడి సంగీతం, ఓ యబ్బ! ఒకటేమిటి? అన్ని రకాల ఆధునిక వ్యాపార సంగీతమూ వింటున్నాం- రేడియో ముందు కూర్చుని.

ముందంతా చిన్నపిల్లల్ని "ఏదమ్మా ఒక త్యాగరాజ కృతి పాడు" అని అడగడమో, లేక "నీవు చూసిన ఫలానా సినిమాలో పాట పాడుతల్లీ" అని అడగడమో ముద్దుగా వుండేది. మరి ఇప్పుడో! "ఏదీ పాపా, సిలోన్ రేడియోలో 'యీనో యీనో!' పాట ఎల్లా పాడారు పాడమ్మా, పోనీ ఆబిస్కట్లపాటకు డ్యాన్సు చేయి" అని అడగడం ముద్దయి పోయిం దీనాడు !!

కొంత కాలానికి ముందు ఈలాటి వేలంవెర్రి సంగీతం లేదు. ఇదంతా డా॥ కేస్కర్ గారు కట్టుకున్న పుణ్యం. మద్రాసు, ఢిల్లీ, కలకత్తా, బొంబాయి వగయిరా కేంద్రాల్లో ఫిలిం రికార్డులు పెటరాదని డా॥ కేస్కర్ సాధించిన విజయం ఏమిటంటే— ఈ కడుపునొప్పి, తలనొప్పి మందుల సంగీతం!

సిలోన్ రేడియోలో వచ్చే నాలుగుసినిమా పాటలకోసం, మధ్యమధ్యవచ్చేకడుపునొప్పి, తలనొప్పిసంగీతాన్ని భరించాల్సివస్తోంది వినేవాగు. ఎప్పుడైనా పొరపాటున తెలుగుచిత్రాల రికార్డులు వేస్తే వినడమే తప్ప, ఏ తెలుగు చిత్రాలలోని సంగీతం ఎలావుందో రేడియోలో వినడానికి లేకుండా పోయింది-నాలుగు అయిదు సంవత్సరాలుగా. మళ్లీ ఈమధ్య నే ఫిలిం రికార్డులు వేయడం మొదలుపెట్టారు అన్ని కేంద్రాలలోనూ. రేడియో దగ్గర కూర్చుంటే, అన్ని దేశాల సంగీతమూ, అన్ని జాతుల సంగీతమూ వినబడుతుంటుంది— ఆ మధ్య రాక్ అండ్ రోల్ సంగీతం విపరీతంగా ప్రజలమీద విరుచుకుపడ్డది. ఇక అందరూ ఆ రాక్ మీద 'రోల్' కావడం మొదలెట్టారు— చిన్నపిల్లలు మొదలుకొని పెద్దవాళ్ళదాకా రేడియోలో రాక్ అండ్ రోల్ సంగీతం వినిపించడానే, పూనకం వచ్చినట్లు ఎగరడం గంతులు వేయడం మొదలెట్టారు.



రచయిత్రి

## గంతుల సంగీతం

"రామనన్ను బ్రోవరా!" అన్న త్యాగరాజ కృతిని "హేయ్, హేయ్ రామ్— నాన్ బ్రోవ్ రోయ్—" అంటూ రాక్ అండ్ రోల్ సంగీతం లాగా పాడడం కూడా విన్నాను— అసలు అదే సంగీతం అని కొందరు ఈనాటి సంగీత ప్రియులు తీర్మానించారు కూడా— అది పాశ్చాత్య దేశీయులకు గొప్ప సంగీతమే కావచ్చు— మనం విని ఆనందించవచ్చు. కాని ఆరాక్ అండ్ రోల్ సంగీతాన్ని తెచ్చి, మన భాషల్లోకి అనుకరించడమే అన్యాయం.

అసలు మనకు శాస్త్రీయ సంగీతం అంటూ ఒకటున్నది. ఉత్తరాదివారికి హిందూస్థానీ సంగీతమూ, దక్షిణాదివారికి కర్నాటక సంగీతమూ, శాస్త్రీయ సంగీతాలుగా తరతరాలనుండి వస్తున్నాయి. ఈ రెండిటినీ మించిన సంగీతం ఇంతవరకూ రాలేదు— ఏదివచ్చినా తాత్కాలికంగా మనుష్యుల్ని గంతులు వేయించె పిచ్చి సంగీతమే తప

'రాక్ గరగించు'—సంగీతం కొత్తగా రాబోదు.

అంతగా గంతులు వేయించే రాక్ అండ్ రోల్ సంగీతం విన్న వెంటనే ఏదైనా చక్కని త్యాగరాజ కీర్తన పొరపాటున అదే రేడియోలో వినిపిస్తే 'ఆహా' అంటారు సంగీతప్రియులు—మరి 'ఆహా' అనిపించే సంగీతంలో వున్న మాధుర్యమూ, హాయీ, గంతులు వేయడంలో వున్నదా? తాత్కాలికమైన మైకంలాంటిది కావచ్చు 'రాక్ అండ్ రోల్' సంగీతం—ఆనిషాలో చిందులు తొక్కవచ్చు ప్రజలు, కాని హృదయాన్ని కదిలించ గలుగుతుందా! హృదయాన్ని కదలించే రసానుభూతి లేని సంగీతం సంగీతం కాదన్నారు పెద్దలు. దానికే, భావంతో కూడిన సాహిత్యం, తాళంతో కూడిన రాగం మేళవించి, "సొగసుగా మృదంగ తాళమూ, జతగూర్చి నిను సొక్కజేయు ధీరు లెవ్వరూ?" అన్నాడు నాదబ్రహ్మ త్యాగయ్య. సంగీతంతో, భక్తి, శక్తి, ముక్తి మార్గాలు చూపిన త్యాగయ్యే భావ, రాగ, తాళాలతో ఆ రాముణ్ణి సొక్కింపజేయ లేకపోతే, అంతకంటే ధీరు లెవరున్నారీ సిలోన్ రేడియో యుగంలో?

'రాక్ అండ్ రోల్' సంగీతంకూడా సొక్కింపచేస్తుంది. కాని సొక్కిపోయేది మనుష్యులు కాదు,—కుర్చీలు, బెంచీలు...! ఆమధ్య 'రాక్ అండ్ రోల్' చిత్రం విడుదల అయినప్పుడు హాల్లోని జనం అంతా వెర్రులెత్తినట్లు గంతులు వేసి కుర్చీలు, బెంచీలు విరగ్గొట్టారట! ఆ సంగీతంలో అంత 'లయ' వుందన్నారు.

## కెరటాల సంగీతం

శాస్త్రీయసంగీతం ఒక మహాసముద్రం. ఆ సముద్రంలోనుండి ఎన్నో కెరటాలు వస్తుంటాయి. ఈనాటి సంగీత దర్శకులంతా కెరటాలవంటి సంగీతాన్నే విసురుతున్నారు ప్రజలమీద. ఏదో కొత్తగానూ, తమాషాగానూ వినిపిస్తూంటే ఆ కెరటాలముందు కాసేపు గంతులు వేస్తున్నారు ప్రజలు; అదే ప్రజాభిరుచి అని తీర్మానించి మరికొన్ని అనుకరణలతో ఒక కొత్త కెరటం విసురుతున్నాడు మరొక సంగీతదర్శకుడు. కొత్త కెరటం క్రింద పాతకెరటం అణిగిపోతోంది! మళ్లీ ఆ కొత్త కెరటంముందు కాసేపు గంతులు వేస్తున్నారు ప్రజలు!

ఈ విధంగా కెరటాలవంటి సంగీతం ఎంతకాలం స్థిరంగా వుంటుంది? ఆ నాడు 'కిస్మత్' అనే హిందీచిత్రంలో చక్కని సంగీతాన్ని సమకూర్చాడు, అనిల్ బిస్వాస్. అదీ సినిమా సంగీతమే, అయినప్పటికీ, పాశ్చాత్య అనుకరణలు అప్పట్లో ఇంతగా లేవు. హిందూస్తానీ సంగీతాన్నే అందరికీ అందుబాటులో వుండేట్టుగా వినిపించాడు అనిల్ బిస్వాస్—అందువల్లనే 'కిస్మత్' చిత్రంలోని పాటలన్నీ ప్రజాదరణ పొందాయి. ఆ పాటలు తేలిగ్గా అందరూ పాడగలిగారు. 'ధీరేధీరే' అన్న పాట ఈ నాటికి అందరూ పాడుతుంటారు. ఇంత కాలం ఆ పాటలు సజీవంగా వుండడానికి కారణం పాశ్చాత్య అనుకరణలు లేక పోవడమే.

## నౌషద్, రామచంద్ర

ఆ తర్వాత నౌషాద్ యుగం ఆరంభమైంది. చాలా రోజులవరకూ నౌషాద్ సంగీతం ఏ జాతికి సంబంధించిందో తెలీక తికమకపడ్డారు చాలామంది. పాశ్చాత్య సంగీతమూ, పంజాబీ జానపదసంగీతమూ, అరబిక్, పర్షియన్, చెణుకులు వగైరా కలిపి ఉరుదూభాషతో మిళాయించి సినిమా సంగీతంలోనే విప్లవం తీసుకొచ్చాడు నౌషాద్. తాత్కాలికంగా చెవికి ఏవో కొన్ని కొత్తధ్వనులు వినిపించడంవల్ల అందరూ నౌషాద్ సంగీతంవెంట బడ్డారు. అంతలోనే మరొక కెరటం లేచింది!

సి. రామచంద్ర సంగీతం. అప్పటికి సి. రామచంద్ర ప్రజలకు పాతవాడైనప్పటికీ 'షెనాయ్' చిత్రంలోని పాటలతో నూతన చైతన్యాన్ని కలిగించాడు ప్రజల్లో.

చక్కని శాస్త్రీయ సంగీతాన్ని సమకూర్చగలడు సి. రామచంద్ర; కాని నౌషాద్ యుగంలో తను వెనుకబడి పోకూడదని అన్నిరకాల సంగీతాన్ని కలిపి "టుమ్రీ"లాంటి పాట లిచ్చాడు "షెనాయ్" చిత్రంలో. ఆ చిత్రంకూడా 'టుమ్రీ'లాంటి చిత్రమే కాబట్టి అప్పటికా పాటలు వినడానికి బాగానే వున్నాయి. కాని వాటికి ఆయుర్దాయం తక్కువ. ప్రజాదరణపొందిన పాటలూ, ఈ నాటికి సజీవంగా వున్న పాటలూ, ఎక్కువ పాళ్ళు శాస్త్రీయ సంగీతంతో కూడిన సినిమాపాటలే-ఎన్ని అనుకరణలు చేసినా, "బైజూబావరా" లో శాస్త్రీయ సంగీతాన్ని ఇవ్వకపోతే ప్రజలు ఈపాటికి నౌషాద్‌ను మర్చిపోయి వుండేవారు, "బైజూబావరా"లోని పాటలే నిజమైన ప్రజాదరణ పొందాయి. అలాగే సి. రామచంద్ర కూడా ఈమధ్య వచ్చిన అనార్కలి, ఆజాద్, దేవత వగైరా చిత్రాల్లోని పాటల్లో హిందూస్థానీ శాస్త్రీయ సంగీతాన్నే ఎక్కువపాళ్ళు ఇచ. 'అనార్కలీ' చిత్రంలోని "యె జిం ఖుషీకి హై" అన్నపాట ఆనాడు బాల గంధర్వ పాడిన "మూర్తిమంత" పాటలాగా వినిపిస్తుంది. కాని బాలగంధర్వ ఆ పాటను భీంపలాస్‌లో శాస్త్రీయంగా పాడాడు. సి. రామచంద్ర అదేరాగాన్ని 'మిశ్ర' చేసి ప్రజలకు అందుబాటులో వుండేట్టు తేలికైన బాణీలో తయారుచేశాడు. అందుకే అందరూ ఆపాటను పాడగలిగారు సులభంగా.

## కరీంఖాన్, సైగల్

అలాగే 'ఆజాద్'లో రెండుమూడు పాటలు చక్కని శాస్త్రీయ రాగాల్లో వినిపిస్తాయి. "నాబోలె, నాబోలె, నాబోలెరే' పాట ఎంతహాయిగా పాడింది లత! ఆ రాగాన్ని మనం భాగేశ్వరి అంటాం; వాళ్ళు భాగేశ్వరికి ఒక 'మిశ్ర' చేర్చుకుంటారు అంతే తేడా. హిందూస్తానీ సంగీతానికి, కర్ణాటక సంగీతానికి అట్టే తేడాలేదు. శుద్ధమధ్యమం ప్రతిమధ్యమం తేడాలతో చాలావరకూ అన్ని రాగాలూ ఒకటే. వారు పాడే బాణీ వేరేకావచ్చు. 'దేవత'లోని 'కైసె ఆవూ జమునాకె తీర్' అని లత పాడినపాట ఆనాటి అబ్దుల్ కరీం ఖాను పాడిన "జమునాకె తీర్" పాటను జ్ఞప్తికి తెస్తుంది. కాని కరీంఖాను సింధుభైరవిలో శాస్త్రీయంగా శ్రావ్యంగా పాడాడు ఆపాటను. ఈనాడు సున్నితంగా సులభంగా ప్రజలు పాడగలిగేట్లు పాడింది లత. అదే సింధుభైరవి 'మిశ్ర'రూపం దాల్చింది ఈనాటి పాటల్లో.

స్వర్గీయ ఖేమ్‌చంద్ ప్రకాష్‌కూడా తాన్‌సేన్ చిత్రంలో ఎంత చక్కని సంగీతాన్ని ప్రజల కందించాడు? "దియాజలావ్. దియాజలావ్" అని అమర గాయకుడు సైగల్ పాడుతూంటే హృదయం పూరించి పోతుంది. చివరిసారిగా సైగల్ కంఠంలోని రాగసుమాన్నంతా "తానసేన" పాటల్లో ఒలకబోశాడు. 'మహల్' పాటలు కూడా విపరీతంగా ప్రజాదరణ పొందాయి. ఖేమ్‌చంద్ ప్రకాష్ చాలావరకూ శాస్త్రీయ సంగీతాన్నే ఎక్కువపాళ్ళు ప్రజల కందించాడు. అలాగే వసంతదేశాయ్ కూడా శాస్త్రీయ సంగీతాన్నే ఎక్కువగా తన పాటల్లో అందిస్తుంటాడు. 'ఘనశ్యామ సుందరా' అంటూ మోహన రాగంలో లత ఆలపిస్తూంటే, ఆనాడు గోపాలుని మురళీ మోహనరాగాన్ని విన్న గోపికలు పరవశులైనట్లు హృదయం పరవశమవుతుంది. వసంత ఋతువులాగా వుంటుంది, వసంత దేశాయ్ సంగీతం.

పోకడలు అరవడి సంగీతంలో కనబడవు.

శాస్త్రీయసంగీతం పాటల్లో ఎన్ని పాళ్లు తగ్గుతూ వుంటే అంత త్వరగా ఆలాంటి పాటలను ప్రజలు మర్చిపోతూంటారు.

## బాలగంధర్వగానం

దాదాపు పదిహేను పదహారు సంవత్సరాలనుండీ అన్ని రకాల శాస్త్రీయ సంగీతమూ విన్నాను. హిందూస్తానీ సంగీతమూ కర్ణాటక సంగీతమూ, అప్పటి సినిమా సంగీతమూ, అన్నీ విన్నాను.

బాలగంధర్వ, నారాయణవ్యాస్, అబ్దుల్ కరీంఖాను, ఓంకారనాథ్, భీష్మదేవ్ చటర్జీ దిలీప్‌కుమార్ రాయ్, సైగల్, హీరాబాయ్ బరోడేకర్, రోషనారా బేగమ్ అక్తర్ బేగమ్, వగైరా శాస్త్రీయ హిందూస్తానీ సంగీత విద్వాంసుల అందరి సంగీతం విన్నాను ఆనాటినుండి ఈనాటికీ మహారాష్ట్రీయులే శాస్త్రీయ సంగీతంలోనూ, సినిమా సంగీతంలోనూ ముందంజ వేస్తున్నారు.

బాలగంధర్వ, హీరాబాయ్, రోషనారా బేగమ్, కరీంఖాను సంగీతం అంటే చెవి కోసుకుంటాను చిన్నప్పుడు. బాలగంధర్వ లాగా పాడగల పాటకుడేడీ ఈనాడు! వెన్న మీగడలు తిన్నట్లుండేది ఆ మహానుభావుడు పాడుతుంటే. బాలగంధర్వ గాత్రం భగవంతుడు దయచేసి ఇచ్చిన ప్రత్యేక వరం. బాలగంధర్వ లాగా పాడగల విద్వాంసుడు ఈ మధ్య బడే గులామ్ ఆలీ ఖాను వచ్చాడు. కాని గంధర్వ కంఠంలోని మాధుర్యం మరెవ్వరికీ రాలేదు.

ఒకప్పుడు ఈలపాట రఘురామయ్యగారి సంగీతంలో బాలగంధర్వపోకడలు వుండేవి. చాలావరకూ బాలగంధర్వ కంఠంలాగానే వుండేది రఘురామయ్యగారు పాడుతుంటే. అప్పట్లో కొన్ని పాటలు చాలా కమ్మగా పాడారు రఘురామయ్యగారు. కాని కర్ణాటక సంగీతంలో రఘురామయ్యగారు ఎక్కువ కృషిచేసినట్లు కనబడదు. అందుకే మొదట్నుంచీ తెలుగువారి సంగీతం త్రిశంకు స్వర్గంలాగా వుంటూ వస్తోంది! అటు హిందుస్తానీ సంగీతమన్నా, ఇటు కర్ణాటక సంగీతమన్నా మనకు అభిమానమే. ఈ రెండు సంగీతాలమీదవుండే వ్యామోహంతో రెండు బాణీలు కలిపిపాడి కర్ణాటక సంగీతాన్ని కలగూర గంపగా తయారుచేశారు కీ॥ శే॥ కపిలవాయి రామనాథ శాస్త్రిగారు.

## త్యాగయ్యపై అరవల అభిమానం

సినిమా సంగీతానికి రెండు శాస్త్రీయ సంగీతపు బాణీలు కలిపినా ఫర్వాలేదు కాని, శాస్త్రీయ సంగీతం అంటూ పాడేప్పుడు కర్ణాటకసంగీతాన్ని యథాతథంగా పాడాలి. అందుకే దక్షిణ దేశంలో వున్న విద్వాంసులు అరైకుడి, శెమ్మంగుడి, డి. కె. పట్టమ్మాళ్, యమ్. యస్. సుబ్బలక్ష్మి, కీ॥ శే॥ వసంతకోకిలం వగైరా విద్వాంసులంతా మన తెలుగు విద్వాంసుల్లాగా కర్ణాటక సంగీతాన్ని హిందూస్తానీ బాణీలో పాడలేదు. త్యాగయ్యను అరవదేశంలోనే సమాధి చేశారు. కాని ఆయన సంగీతాన్ని బ్రతికించారు పైన చెప్పిన అరవ విద్వాంసులంతా, ఒక్క తెలుగుసాహిత్యాన్ని ఉచ్చరించడంలో తప్ప...

“పక్కల నిలబడి,” అన్న త్యాగరాజ కృతిని, “పాకాలా — నీలా — బాడీ...” అంటూ చాలా అన్యాయంగా పాడతారు అరవ విద్వాంసులు — అదొక పెద్దలోపం వారి సంగీతంలో.

ఈ మధ్య రాష్ట్ర విభజన అయిన తర్వాత రానురాను, స్వభాషాభిమానాలు ఎక్కువయ్యే కొద్దీ “ఆ వెధవ కాలు నేను పట్టను పో” అని పరమానందయ్య శిష్యులిద్దరూ దెబ్బలాడుకుని గురువుగారి కాలుతీసి అవతల పారేసినట్లు—త్యాగయ్య పాటలలోని తెలుగు సాహిత్యాన్ని తీసి పారేసి, ఆ స్థానంలో అరవ సాహిత్యాన్ని అవతరింపచేసి పాడుతున్నారు కొందరు అరవ విద్వాంసులు! కొంత కాలానికి త్యాగయ్య పాటలే పనికి రావేమో కూడా చెప్పలేం. తెలుగువాడు మరి!—.

ఆనాడు గానసరస్వతి బెంగుళూరు నాగరత్నమ్మ, కోయంబత్తూరు తాయి వగైరా గాయనీమణులంతా కర్ణాటక సంగీతంకోసం, త్యాగయ్యకోసం తమ జీవితమంతా వినియోగించారు. అలాంటి “ఎందరో మహానుభావులు” త్యాగయ్య సంగీతాన్ని తరతరాలుగా ఒక గాత్రంనుండి మరొక గాత్రానికి అందిస్తూ వస్తున్నారు. “రొట్టెవాడికంటే, తుంపులవాడి పని మెరుగన్నట్లు—అసలు వాళ్లం మనకంటే అరవాళ్ళే ఎక్కువ ఫలితం పొందారు త్యాగయ్య సంగీతంవల్ల.

మనవాడు త్యాగయ్య అనుకోడమేగాని, నిజానికి త్యాగయ్యను అరవదేశానికే దత్తత చేశాం. ఆదినుండీ త్యాగయ్య సంగీతాన్ని అరవాళ్ళు సాధనచేసినంతగా మన తెలుగువారు చేయలేదు.

ఆనాడు జొన్నవిత్తుల శేషగిరిరావుగారు, మరికొందరు విద్వాంసులు చేసినంత కృషి ఈనాడు తెలుగుదేశంలో సంగీతంకోసం ఎవరూ చేయడంలేదనే చెప్పాలి కష్టపడి సాధన చేయలేక, సినిమా సంగీతం వింటూ ఎలాగోలాగు సరిపెట్టుకుంటున్నారు.

బాలమురళీకృష్ణ చాలా బాగా పాడతాడని వినికిడి. ఆ బాలవిద్వాంసుణ్ణి చూసైనా మిగతా పాడగలవారు సంగీతాన్ని వృద్ధిచేసుకొని విద్వత్తు సంపాదించాలి.

ఆనాటి విద్వాంసులు ఈనాడు లేరు అనుకోడం మనకే చిన్నతనం. అరవదేశంలో వున్నంతమంది విద్వాంసులు తెలుగుదేశంలో లేరనుకోవడం మనకే అవమానం. ఒకళ్ళను చూసి మరొకరు వెంటబడ్డట్లు, శాస్త్రీయ సంగీతాన్ని కూడా ఒకరు సాధన చేయడం ఆరంభిస్తే అందరూ ఆ దారికి బయలుదేర్తారు.

సంగీత సాధన ఒక తపస్సులాంటిది. జీవితమంతా కష్టపడి సాధనచేసినప్పటికీ, సముద్రంలాంటి సంగీతంలోని లోతులు తెలుసుకోలేమనే నా అభిప్రాయం. అయినప్పటికీ తరతరాలనుంచి వస్తున్న శాస్త్రీయ సంగీతాన్ని మనం కూడా మన తరవాత తరం వారికి అందించాల్సిన బాధ్యత మనమీద వున్నది.

అరవదేశంలో లాగే ఆంధ్రదేశంలో కూడా ఎక్కువమంది విద్వాంసులు అవతరించాలి. పాశ్చాత్య అనుకరణ చలనచిత్ర సంగీతంలో నశించిననాడే, కనీసం హిందూస్తానీ సంగీతమో, లేక కర్ణాటక సంగీతమో, రెండూ కలిపిన బాణీయో, ఏదో ఒకటి మన దేశానికి సంబంధించిన సంగీతాన్ని వినగలుగుతాం. పోతన, త్యాగయ్య, మల్లీశ్వరి, విప్రనారాయణ, చక్రపాణి వగైరా చిత్రాలోని శాస్త్రీయ సంగీతం అన్ని తెలుగు చిత్రాల్లోనూ రావాలి. చిన్నప్పట్నుంచీ, ఉగ్గుపాలతో జీర్ణించుకున్న మన శాస్త్రీయ సంగీతాన్ని ఈనాడు అనుకరణల మోడా వడిలో మర్చిపోరాదు.

అరవదేశంలో సమాధి కావించిన మన త్యాగయ్యను పునర్జీవితుణ్ణిచేసి ఆంధ్రదేశానికి ఆహ్వానించాలని నా ఆకాంక్ష. ‘నిధి చాల సుఖమా, రాముని సన్నిధి చాల సుఖమా?’ అని త్యాగయ్య ప్రశ్నించుకున్నట్లు, మనల్ని మనమే ఇలా ప్రశ్నించుకోవాలి: “అనుకరణ చాల సుఖమా! అమరమూ, అజరమూ అయిన శాస్త్రీయసంగీతం చాల సుఖమా?” ★

 బెంగాలీ చలనచిత్రాలు 

# వాస్తవజీవితానికి ప్రతిబింబాలు

దేశవిభజన మూలంగా మార్కెట్ తగ్గిపోయి, ఆర్థికంగా దెబ్బతిన్నా, బెంగాల్‌లో చిత్ర నిర్మాతలు కేవలం లాభాల కోసమే చిత్రాలు తీయరాదని ఇప్పటికీ నమ్ముతారు. కథ రాసిన వాడితో మొదలుపెట్టి, కవిత్వంలాంటి అడ్వర్‌టయిజ్‌మెంట్లు రాసే పబ్లిసిటీ మనిషి దాకా రకరకాల పనులు చేసే వాళ్ళు కలిస్తేగాని సినిమా తయారుకాదు. ఈ రకరకాల వాళ్ళ సమష్టి కృషివల్ల ఫలించే కళాఖండమే చలన చిత్రమనీ, మరొకటి మరొకటి కాదనీ వీరు ఇప్పటికీ విశ్వసిస్తూనే ఉన్నారు. అయితే సినిమా రచయితలు ఏ ఆదర్శాలు వల్లించినా చలన చిత్రం వ్యాపారకళ మాత్రమేనని ఇరవై ఏళ్ళ అనుభవంతో అర్థం చేసుకున్న యథార్థవాదులూ కొందరున్నారు. కాని ఎక్కువమంది నిర్మాతలు సాహిత్యపు విలువలకు మాత్రమే ప్రాముఖ్యం ఇస్తున్నారు. కథా వస్తువులను ఎంచుకోవడంలో జాగ్రత్తగా ఉండాలని అనుభవంవల్ల అంతా గ్రహించారు. ఫలానా ఫలానా కథలు తీస్తే ఫ్లో కాలేదు అని ఖచ్చితమైన సూత్రాలేమీ లేకపోయినా, అనుభవంలేని నిర్మాతలు అనుకున్నట్టు ప్రేక్షకులు అమాయకులూ,

**ఖగేన్‌రాయ్**
[ఫిల్మ్‌డైరెక్టరు]

ఏది చూపిస్తే అది చూసేవారూ కాదని తేల్చుకున్నారు. సాహిత్యపు విలువలు బాగా తెలిసిన దేశాల్లోని ప్రేక్షకుల మాదిరిగానే బెంగాలీ ప్రేక్షకులు కూడా అంతా ఒక రకమైన అభిరుచీ, దృక్పథమూ కలవారు కాదు. ఏ కథనావ, ఎవరికి ఏం నచ్చుతుందో ఎవరూ తెగేసి చెప్పలేరు. ఒక అద్భుతమైన కథ తీసుకుని ఎక్కడా లోపంలేని సీనేరియో రాసేసుకుని ఇక మనకేం ఫరవాలేదనుకునే పద్ధతి ఆచరణీయమైనది కాదు. ఎందుకంటే మొత్తం సినిమా పరిశ్రమ అంతా స్పెక్యులేషన్ వ్యాపారం లాంటిది. బెంగాలీ పరిశ్రమ కూడా ఇప్పుడీ స్థితిలోనే ఉంది. బెంగాలీ ప్రేక్షకులకు సినిమాల మోజున్నమాట వాస్తవమే; డబ్బు ఖర్చుపెట్టి సినిమా చూడడానికి వెనకాడే బాపతు కానిమాటా నిజమే. కాని టికెట్టు కొనుక్కుని హాల్లోకి వెళ్ళాకమాత్రం ప్రతి ప్రేక్షకుడూ విమర్శకుడి వేషం వేసుకుని మరీ సీట్లో కూర్చుంటాడు. అడుగడుగునా ప్రతి అడుగునీ నిశితంగా పరిశీలించి బాగోగులు తేల్చిపారేస్తాడు. అందుకనే సాధారణంగా నిర్మాతలు ఎటుపోయి ఎటొస్తుందోనని పేరు





బెంగాలీ ప్రేక్షకులకు అభిమానపాత్రమైన జంట.

సుచిత్రాసేన్ ఉత్తమ్‌కుమార్

# ★ బెంగాలీ చలనచిత్ర పరిశ్రమ ★

పొందిన నవలల్నే తీసుకుని చిత్రాలు తీస్తూ ఉంటారు. మంచికథదొరకందే ఏనిర్మాతా చిత్రనిర్మాణం జోలికిపోడు. అంతమాత్రాన ప్రతినిర్మాతా డబ్బు సంపాదించిపెట్టే కథనే ఎంచుకోగలడనీ, అతను ఎంచుకున్న కథకు డబ్బు వచ్చేస్తుందనీ అర్థంకాదు. అయినప్పటికీ బహుళ ప్రజాదరణ పొందిన నవలల్నే కథావస్తువులకోసం స్వీకరించడం ఇదివరకు లాగానే ఇప్పుడూ బెంగాల్‌లో బలీయమైన ఆచారం.

## వెలుగునీడల వింతచిత్రం

బెంగాలీ చిత్రాల్లో ఇంకో విశేషం ఈ మధ్య కనబడుతోంది: "అభ్యుదయ" కథావస్తువులవైపూ, "ప్రయోజనాత్మక" ఇతివృత్తాలవైపూ నిర్మాతలు ఎక్కువగా మొగ్గుతున్నారు. రెండేళ్ళ కిందటిదాకా ప్రజల్ని ఆకర్షించిన కుటుంబగౌరవం, పాతివ్రత్యం చాటుతు చిత్రాలకి ఈనాడు జనాదరణలేదు. ప్రజల మానసిక క్షేత్రం బాగా విస్తృతమైనట్లు తోస్తుంది రాజకీయమైన, ఆర్థికమైన ఒత్తిడుల వల్ల ప్రజల దృక్పథమే ఎవరూ ఊహించనంత పరిణతి చెందింది. పురాణాల్లోని ఉన్నతాదర్శాలను కాదనడం లేదు; తండ్రిప్రేమ, తల్లిప్రేమ కేవలం మూఢత్వమని కొట్టెయ్యడం లేదు. అయినా ఈ పురాతన, సనాతన భావాలను కొంచెం



అరుంధతీ ముఖర్జీ

సహేతుకమైన విధానంలో పెంపొందించి రూపొందించాలని మాత్రమే ప్రజలు అంటున్నారు. "కుండెడు కన్నీళ్లు బండెడు పాదధూళి"మిళాయించిన భావాలప్రదర్శనం మాకక్కర్లేదని అంటున్నారు. అలాగని వారివి రాతిగుండెలని అనుకోనక్కర్లేదు. వాస్తవ జీ చిత్రాలు చూపించాలని, అయితే అ. భవిష్యత్తుపై ఆశ, విశ్వాసం కలిగించే సందేశం కూడాఇవ్వాలని వీరుకోరుతారు. జీవితందుఃఖభూయిష్ఠంగా ఉందన్న మాట నిజమేకాని, జీవితంలో ఆశకుకూడా తావుఉందనీ, జీవితానికొక అర్థమూ, ఏదో ఆకర్షణ ఉన్నాయని, ఎంతటి నీచుడిలోనైనా మానవత్వపు దీపం వెలుగుతూనే ఉంటుందనీ వీరు నమ్ముతారు సినిమాలు చూడడానికి వచ్చే జనాభా అంతా ఈ మాటలు అనకపోవచ్చుగాని వారి మనస్సుల్లో ఇదంతా మెదులుతూనే ఉంటుంది. బెంగాలీ చిత్రాలకు సంబంధించి ఇంతవరకూ ప్రజల దృక్పథం చాలా మారిపోయిందనే చెప్పాలి.

## తారలపై మోజు

ఇతర చిత్ర నిర్మాణ కేంద్రాల్లో మాదిరిగానే కలకత్తాలోకూడా పెద్దతారల ప్రాబల్యం బలంగానే ఉంది. తారాబలం మీదకంటే కథాబలంమీద, చక్కని చిత్రణం మీదా ఆధారపడే నిర్మాతను చూసి "పాపం, వృథా ప్రయాస పడుతున్నాడు" అని మిగతా వాళ్ళు జాలిపడతారు. ఉత్తమ్‌కుమార్‌నీ, సుచిత్రాసేన్‌ను ఒకరికంటె ఒకరు ముందు బుక్ చెయ్యాలనే అంతా పోటీపడుతున్నారు. ఏడాది, ఏణ్ణర్థం క్రితం 'అబ్బో, ఇంతడబ్బు తారలకివ్వడమే' అనిపించిన డబ్బే ఇప్పుడు 'ఓస్, ఇంతేనా' అనిపిస్తోంది. డబ్బు ఎక్కువ గుంజాలనే జాడ్యం మొత్తం తార లందరికీ సంక్రమించింది. తెరమీద ఓ నిముషం సేపు మినుకు మినుకుమని మాయమయ్యే చిన్నతారకూడా వెలవెలకీ రేటుపెంచేస్తోంది. దీనివల్ల ఏడాదిక్రితంకంటే ఈనాడు నూటికి పదిహేను, ఇరవై వంతుల చొప్పున చిత్రనిర్మాణ వ్యయం పెరిగిపోయింది. అందరిలోకీ ఉత్తమ్‌కుమార్, సుచిత్రాసేన్—ఈయిద్దరే ధగధగా వెలిగిపోతున్న తారలు. వీరిపై ప్రజల మోజు ఇప్పుడప్పుడే తగ్గేసూచనలుకూడా ఎక్కడా లేవు. తరుణయౌవనపు ఉత్సాహోల్లాసాలు వీరిద్దరిలోనూ మూర్తీభవించినట్లు ప్రజలనమ్మకం. ఇంకా చాలాకాలందాకా ఈజంట ప్రజాహృదయాల్లో స్థిరనివాసం ఏర్పరచుకుని ఉంటుందనే మనం నిశ్శంకగా అంచనావేయవచ్చు. వీరితర్వాత ప్రజాదరణ బాగా చూరగొన్న స్త్రీతారగాని, పురుషతారగాని ఎవరూఅని ప్రశ్నిస్తే తడిమిని జవాబుచెప్పడం కష్టమే. స్ఫురద్రూపమూ, గంభీరకంఠమూ కల వసంతచౌధురి చాలా చిత్రాల్లో నటించి పేరుసంపాదించాడు. కాని అతనికీ ఉత్తమ్‌కుమార్‌కీ మధ్య అంతరం చాలాఉంది. అనుభవశాలురైన అసిత్ బరన్, రబీన్ మజుందార్ నేటికీ కథానాయక పాత్రలుధరించి ప్రజలని మెప్పిస్తు

కొత్తగావచ్చిన అశీమ్‌కుమార్, ..., అసీంకుమార్‌ల పేర్లు ఇంకా ఎక్కడా మారుమ్రోగలేదు గాని వీరు పైకి వస్తారనడానికి సందేహంలేదు. బికాష్‌రాయ్ నాయకపాత్రలు వేయడం మానేశాడు. సినీ విలన్‌గా ఇతనికిపోటీలేదు. ఇతనితరవాత చెప్పుకోదగ్గ విలన్‌పాత్రధారులు దీపక్ ముఖర్జీ, బీరేన్‌చటర్జీ. ఇక ఏ పాత్రపడితే ఆపాత్రను ఉత్తమంగా నటించి గొప్పనటులనిపించుకున్నవారు ఛబీబిశ్వాస్, పహాడీ సన్యాల్, జహర్ గంగూలీ, కమల్‌మిత్ర, ధీరజ్ భట్టాచార్య, నితీష్ ముఖర్జీఉన్నారు. వీరు సాధారణంగా తండ్రివేషాలలో, తాత వేషాలలో, బాబాయివేషాలలో లేక 'మంచి ఉద్యోగి' వేషాలలో వేస్తుంటారు. పాతతరానికి చెందిన అహీంద్రచౌధురి, నరేష్ మిత్ర ఇప్పుడాట్టే చిత్రాల్లో కనబడడంలేదు. అత్యుత్తమ శ్రేణికి చెందిన ఈ ఇరువురు నటులూ బహుశా వార్ధక్యంవల్లనే వెనకబడ్డారేమో. ఇక హాస్యనటనలో కూడా బెంగాలీ రంగం ఏ యితర చిత్రరంగానికీ తీసిపోదు. భానూ బెనర్జీ, జహర్ రాయ్, శ్యాంలాహా, నవద్వీప్ హాల్దార్, తులసీచక్రవర్తి, అనూప్ కుమార్, నృపతీచటర్జీ ఇప్పుడు మంచిపేరులో ఉన్న హాస్యనటులు. కొత్తగా కాళీ బెనర్జీ అనే ఒక నటుడు వచ్చాడు. ఇతడు శారాపథంలోని వాడు కాకపోయినా కేవలం దీక్షతోను, శక్తివంతమైన నటనతోనూ అందర్నీ త్రోసివేసి పైకివచ్చాడు. విషాదభరితమైన పాత్రల నిర్వహణంలో ఇతనితో తులతూగేవారు నేటి బెంగాలీనటుల్లో ఎవ్వరూ లేరంటే అతిశయోక్తికాదు.

## ఆడతారలు

ఆడవారిలో సుచిత్రాసేనదే అగ్రతాంబూలం. అందానికి అందమూ, అందానికి తగ్గ హుందాతనమూ ఈవిడకు పెట్టని సొమ్ములు. అందమైన సినిమా తార అంటే ఈవిడని చెప్పి మరొకర్ని చెప్పాలని బెంగాలీ ప్రేక్షకుల భావం. ముచ్చటైన నటనాకౌశలంతో ఈమె గొప్పనటిగాకూడా పేరు గాంచింది.

పోతే అరుంధతీ ముఖర్జీది రెండవస్థానం. ఈవిడ అందగత్తేగాని, అందానికంటే ఎక్కువగా ఆకర్షించేది ఈమె ఆధునిక యువతీ పాత్రలను ఒప్పించే విధానం. సావిత్రీచటర్జీ లెక్కలేనన్ని చిత్రాల్లో వేస్తూఉంటుంది. ఆమె ఓపిక మెచ్చుకోదగ్గదే గాని, అస్తమానం తెరమీద కనిపించటంతో ఆమెపై మోజు తగ్గుతోందేమో అనిపిస్తోంది. ఆమె మంచినటి కాదని మాత్రం ఎవ్వరూ అనరు. ఇక సబితాచటర్జీ మాట్టానికి ముద్దుగానే ఉంటుందిగాని సినిమానటనలో అనుభవమూ, శిక్షణా తక్కువ. అంతగానటన అవసరంలేని వేషాలకి ఈమె బాగానే ఉంటుంది. ఆతరవాత చెప్పుకోదగ్గ నటీమణులు మంజూ దే, దీప్తిరాయ్, ప్రణతీఘోష్, తపతీఘోష్, జమునాసిన్హా. బెంగాలీ స్త్రీతారలందరిలోకీ మంజూ దే సమర్థురాలని నా అభిప్రాయం. మాలాసిన్హా ఎక్కువగా బొంబాయి చిత్రాల్లో నటిస్తున్నా ఆమెకు బెంగాల్‌లో కూడా మంచి పలుకుబడి ఉంది. ఈమెనీ ఉత్తమ్‌కుమార్‌నీ జోడించి ఓ కొత్త జంటని తయారు చేద్దామని కొందరు తీవ్రంగా ప్రయత్నించారు గాని దెబ్బతిన్నారు. ఇక పాత తరంవారిలో మాలినా, సునంద, సంధ్యారాణి, సుమిత్ర, భారతి, పద్మా, అపర్ణ, చంద్రావతి—వీరందరికీ ఇంకా బోలెడు పలుకుబడి ఉంది. నాయికా వేషాలకు కూడా వీరిని ఇంకా బుక్ చేస్తూనే ఉన్నారు.

అసిత్ బరన్

పోతే బాలతారలు: వీరినిగూర్చి ఏం చెప్పడానికీ చిక్కు. చూస్తుండగా ఎదిగిపోతారు. "కాబూలీవాలా"లో నటించి వేలాది హృదయాలను పరవశింపచేసిన బాలిక టింకూ టాగూర్ కాక, విభూ, బాబువా, మణిక్—వీరు చిన్న పిల్లలలో అగ్రశ్రేణి తారలు, అయితే ఎప్పటికప్పుడు కొత్త పిల్లలు చేరుతూనే ఉన్నారు.

## సంగీతం

సంగీతం:—చలన చిత్రాలకు సంగీతాన్నే ప్రధానాకర్షణ చేసిన బొంబాయి ఉదాహరణను బెంగాల్ లాభసాటిగా అనుసరించింది. బెంగాలీ చిత్రాల సంగీతం ఇదివరకటి కంటే బాగుంటోంది. దీనికి కారణం హేమంతకుమార్, సంధ్యాముఖర్జీ, ప్రతిమా బెనర్జీ, ధనీ బందోపాధ్యాయ, ధనంజయ భట్టాచార్య, శ్యామల్ మిత్ర, కల్పనా బందోపాధ్యాయ, మనవేంద్ర ముఖర్జీ మొదలైన ప్రముఖ ప్లేబాక్ గాయక, గాయనీమణులు. సంగీత దర్శకులు కొత్త కొత్త వాద్యాలను బాగా ఉపయోగిస్తూ, పాటకు బ్యాక్‌గ్రౌండు సంగీతాన్ని సృష్టించడంలో కొత్తపద్ధతులను ప్రవేశపెడుతున్నారు.

"ధూళి" చిత్రంతోనే ఈ మార్పు యావత్తూవచ్చింది. "ధూళి" చిత్రం చూసినప్పటినుంచీ సినీమా అభిమానులకు సినిమా సంగీతమన్నా, సంగీతపు సినిమా లన్నా మోజు బలిసిపోయింది.

బెంగాలీ చిత్రాలలో సంగీత దర్శకత్వంలో రవిశంకర్ పేరుచెప్పకుండా వదిలెయ్యడానికి వీల్లేదు. ఈయన సంగీత నిర్వహణం అద్భుతం; నిరుపమానం.

దర్శకులు—ఇది "నవవాస్తవిక వాదుల" యుగమనవచ్చును. ఈ కొత్తరకం దర్శకులలో అగ్రస్థానం నిస్సందేహంగా సత్యజిత్ రాయ్‌ది. "నవవాస్తవిక" శైలిలో తీసిన చిత్రాల్లో ఈ నాటికీ "పథేర్ పాంచాలీ"ని మించిన చిత్రంరాలేదు. ఫ్లాహర్టీ, డిసికా మొదలైన పాశ్చాత్య దర్శకుల ప్రభావంవలన "నవవాస్తవిక" వాదం బెంగాల్‌లో మొలకెత్తి ఉండవచ్చునుగాని సత్యజిత్ రాయ్‌కి సంబంధించినంతవరకూ "అనుకరణదోషం" ఏమాత్రమూ అంటగట్టడానికి వీల్లేదు.

కాగా సత్యజిత్ రాయ్‌కి బెంగాల్‌లో బోలెడుమంది అనుకరణ చేసేవారు తయారయ్యారు. రాయ్ చిత్రాలలో స్వతంత్రమయిన భావనాబలం కనిపిస్తుంది. ఆయన నిజమయిన కళాకారుడు, మేధావి. ఆయన్ని అనుకరించినంత మాత్రాన మంచి చిత్రాలు తీయగలమా అని ఈ అనుయాయులు ఆలోచించుకోవాలి. తపన్‌సిన్హా, అసిత్ సేన్ మంచిమంచి భావాలు, శిల్పనైపుణ్యం గలవారే గాని, వీరి పనివాడితనం "లౌహ కపట్" "జీబన్‌తృష్ణ" చిత్రాల్లో ఏమాత్రం కనిపిస్తుందో అవి విడుదలయిన తర్వాత చూడాలి.

దేవకీబోస్ ఇంకా పలుకుబడిలో ఉన్నాడు. ఈయన కడు సున్నితమైన భావాలు కలమనిషి. ఈయన చిత్రాలలో

(100-వ పేజీ చూడండి)

# ప్రజ్ఞాశాలి

# రంగారావు



ఎస్. వి. రంగారావు, సహనటులూ

వెండి తెరకు రాకుండా ఉంటే, ఎస్. వి. రంగారావు ఏంచేసే వాడు? ఎప్పుడో అప్పుడు ఝామ్మని వచ్చేసేవాడు. అందుకేం సందేహం లేదు.

“అసలా ప్రశ్నే లేదు. ‘నటన’మీద నాకు గురి గౌరవం ఉన్నాయి. నేర్చుకున్నాను. అయినపుడు ఇంక, నటుడు కాకపోవడమేమిటి. అబ్సర్డ్...” అంటాడు. తెలుగు తమిళ చిత్రసీమల అగ్రశ్రేణి నటుడు ఎస్. వి. రంగారావు నవ్వుతూ.

ఇవాళ అతడు ఇంతవాడు అయ్యాడు కాబట్టి, అనుకున్నది సాధించాడు కాబట్టి ఈ మాటలు ధీమాగా చెబుతున్నాడు. ఈ ధీమానుటుకు మొదట్నించీ ఉండేది. ఆత్మవిశ్వాసం విలువ తెలిసిన వాళ్ళెవరూ దీన్ని గర్వంఅని అపార్థం చేసుకోరు. అలా చేసుకునేదల్లా, ఒక మనిషి తను సాధించబోయే వాటి గురించి ముందర చెప్పుకున్నప్పుడే.

తలపెట్టిన లక్ష్యం తప్పకుండా సాధించే వాళ్ళకు జీవితంలో బలం ఇచ్చేది క్రమశిక్షణ అని చెబుతారు. అదే రంగారావు జీవితానికి నూటిబాట వేసి పెట్టింది. వాళ్ళ నాన్నగారు ధవళేశ్వరంలో ఎక్సైజు ఇన్స్పెక్టరు చేసేవారు రంగారావు అక్కడే పుట్టాడు. అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళు మొత్తం 11 మంది. అలాటి ఇళ్ళలో గారానికి ఆస్కారాలుండవు సాధారణంగా. ఆ యింటి పెద్ద, తన పుత్రవాత్సల్యాన్ని క్రమశిక్షణమాటున దాచిపెట్టి పిల్లలందర్నీ భయభక్తుల్లో పెంచాడు. పిల్లలు అల్లరి చిల్లరిగా తిరుగుతూ ఒకరి నొకరు లెక్కచేసుకోక పోవడంవల్ల కొన్ని పెద్ద కుటుంబాలలో, ‘అబ్బాయీ! వీడు మీ అన్నయ్య, ఇది మీ చెల్లాయి’ అని ఎవరో వాళ్ళని పరిచయం చేయాల్సి వస్తూ ఉంటుంది. ఇక్కడ ఆ ప్రమాదం లేదు. ఖచ్చితంగా భోజనాలవేళ అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర హాజరు కావలసిందే. నాటకాల రిహార్సలువల్ల అప్పుడప్పుడు గైరు హాజరయే రంగారావు చివాట్లు, పాచన్నం కలిపి భోంచేసేవాడు.

* * *

రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో చేరాక, నాటకాల సరదా, అనుభవం, పేరూ తద్వారా ఆత్మవిశ్వాసం పెరిగాయి

షేక్స్పియర్ నాటకాలలో చాలా పాత్రలు నిర్వహించి ప్రశంసలూ, బహుమతులూ, విమర్శలూ, ప్రశంసలూ బహుమతులూ సంపాదించుకున్నాడు బి. ఎస్. సి. పూర్తిఅయింది. తొలిడిగ్రీ కొంతమందికి చదువుకి కామా, కొందరికి సెమికోలన్; రంగారావు, కళాశాల చదువుకి ఫుల్ స్టాప్ పెట్టేసి నాటక కళాశాలారాధన కొనసాగించాడు. అనాడు ఉభయగోదావరి జిల్లాలో

... 'యంగ్‌మన్స్ హాపీక్లబ్'
...గారావు ఒక ముఖ్యుడు. రేలంగి, ...జలీదేవి మొదలగువాళ్ళు అప్పుడూ సహనటులే.

ఫైర్ బ్రిగేడ్‌లో ఉద్యోగంవచ్చి, కొన్నాళ్ళు మసులాలోను, కొంతకాలం విజయనగరంలోను ఉన్నాడు రంగారావు. అప్పుడే తొలి సినిమాఛాన్సు వచ్చింది. కే. కే, బి. వి. రామానందం ఆహ్వానంపై, 'వరూథిని' చిత్రంలో నటించాడు రంగారావు. ఆ చిత్రం విజయవంతం కాలేదు. కొత్త ఛాన్సులు రాలేదు. ఆ ఘట్టంలోనే ఇబ్బందులు, సమస్యలూ రంగారావు జీవితంలోకి తొంగిచూశాయి. తండ్రి చనిపోయారు. తనే చెల్లెళ్ళకు పెళ్ళిళ్లు చెయ్యాలి. ఇల్లునడపాలి. 'ఇంటి పెద్దవి నువ్వు నాటకాలవాళ్ళతోటీ సినిమాలవాళ్ళతోటీ తిరుగుతూఉంటే ఇల్లేం చక్కబెడతావు అని చుట్టపక్కాలు అన్నారు.

"తొలిసారిగా నేనుభయపడిన సందర్భం అదే" అంటాడు రంగారావు. అంతవరకు తండ్రిపట్ల చూపినభయం గౌరవానికి రూపాంతరం.

తాత్కాలికంగా ఆ పరిస్థితులకు లొంగి టాటానగర్‌లో ఉద్యోగం సంపాదించాడు రంగారావు.

1948 ఏప్రిల్‌లో బి. ఎ. సుబ్బారావు పిలిచి, 'పల్లెటూరిపిల్ల'లో వేషం ఇవ్వడం జరిగింది.

రంగారావును సినిమారంగంమీద నిలిపి వృద్ధికి తెచ్చినచిత్రం విజయవారి షావుకారు. (1950) తెలుగుచిత్రాల కథలో 'షావుకారు' ఒకమైలురాయి; అందులో రౌడీ పాత్ర (రంగారావు) కీర్తికిరీటానికి, నాటికీ నేటికీ కూడా తురాయి.

ఆచిత్రంలో మూడురోజులు పనిచేసేసరికల్లా ఆచిత్రం దర్శకుడు ప్రసాద్, నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి, అతని నటనకు ఎక్సలెంట్ అనే విశేషణాన్ని ఉపయోగించారు. ఆరోజునే నాగిరెడ్డిగారు రంగారావును 'విజయాస్థాన'నటుడిగా మూడేళ్లకు బుక్‌చేసి కాంట్రాక్టు వ్రాసుకున్నారు; ఆరోజునచూపిన ఉత్సాహాన్నే మూడేళ్లు ప్రదర్శించి రంగారావు సామర్థ్యాన్ని అద్భుతంగా ఉపయోగించారు. ఆ మూడేళ్లలోనే రంగారావు 'బహుముఖ ప్రజ్ఞావంతుడన్న' దాగినసత్యం వెల్లడిఅయింది. షావుకారులో రంగారావుది పల్లెటూరి రౌడీపాత్ర. అంత సమగ్రమైనపాత్ర, అంతనిర్దుష్టమైన నటన అరుదుగా కనబడతాయని అంతా మెచ్చుకున్నారు. తరువాతిచిత్రం 'పాతాళభైరవి' ఇందులో 'మాంత్రికుడి'పాత్ర ఇప్పటికీ ఎవరూ మర్చిపోయిఉండరు. మూడోచిత్రం 'పెళ్ళిచేసిచూడు'లో ధూపాటి వియ్యన్నపంతులు వేషాన్ని 'పాతాళభైరవి' మాంత్రికుడే వేశాడంటే—వేశాడు కాబట్టి నమ్మాలి అన్నారు; రంగారావు ప్రదర్శించిన కదలికలూ, కదలికలూ చూచినవారు. తరువాతి చిత్రం 'చంద్రహారం'లో పాత్ర తిరిగి దీనికి పూర్తిగా భిన్నమయినది. రంగారావు



క్రూర రంగారావు

అందులో రాకుమారుడికి తండ్రి కాదు. బంటు అయినా, అతడు రూపుధరించిన పితృవాత్సల్యంగా మనకు కనిపిస్తాడు...

తరువాత రంగారావు నటించిన అనేక పాత్రలపై చాలవరకు పైనాలుగింటి క్రీనీడలూ పడుతూ వచ్చాయి.

వాహినీవారి 'బంగారుపాప' రంగారావు చలనచిత్ర యాత్రలో మరొక మైలురాయి. అందులో పంచప్రాణాలూ ఉన్న ఒక మనిషి నిండుజీవితాన్ని అతడు జీవించాడు. పొగరు, తిక్క, పోనుపోను నిగ్రహం, ఆపక అనురాగం, వార్ధక్యపు లక్షణాలు, అప్పటి చాదస్తం, ఎక్కడికక్కడ ప్రదర్శిస్తూనే ఆద్యంతంఆవ్యక్తిజీవితానికిప్రధానలక్షణంగా



గంభీర రంగారావు

భాసించిన పౌరుషాన్ని ఎక్కడా విస్మరించకుండా పోషించాడు.

అనేకమంది నటుల కళాజీవితంలో కన్న, ఈ నటుడి కథలో వైవిధ్యం చైతన్యం ఎక్కువగా కనిపిస్తాయి. కళ దృష్ట్యా, ఎంతో నిండయిన జీవితాన్ని నిత్యకల్యాణం పచ్చతోరణంగా సాగిస్తున్నాడు.

అనేక కారణాలవల్ల, ఒకవ్యక్తికి శక్తికి అతీతమైన నేటి పరిస్థితులవల్ల, కొన్నికొన్ని సందర్భాలలో, అసమగ్రము, ఆకారహీనమూ అయిన పాత్రలను కూడా ఒప్పుకొని నిర్వహించవలసి వచ్చినా, ఎక్కడికక్కడ, తన వ్యక్తిముద్రను ఆపాత్ర మీదవేస్తూ కాయకష్టులా దాన్ని పైకి లేవనెత్తుతూ ఉన్నంతలో వీలైనంతా రాణింపచేయడానికే రంగారావు కృషి చేస్తాడు.

సాధారణంగా ఏపాత్ర తీసుకున్నా దాని ప్రవర్తనగురించి, స్వరూపస్వభావాలగురించి చర్చిస్తాడు. "కొంతపోట్లాటలాడి తీవ్ర చర్చ జరిగితేగాని, విలువైన విషయాలు బయటకు రావు. ఆయాపాత్రలను అవగతంచేసుకొని, నిర్వచనం ఇచ్చేవిధానం నిర్ధారణ చేసుకోవడంలో నాకు ఎంతో తోడ్పడ్డవారిలో చక్రపాణిగారుముఖ్యులు. గంటలతరబడిచర్చలు జరపేవాళ్ళం" అంటాడు రంగారావు.

మూడేళ్ళపాటు 'విజయా' సంస్థలో ఉన్నతరువాత, బయటచిత్రాలలో పాత్రలు తీసుకోవడం మొదలుపెట్టాడు. ఆహ్వానాలు పుష్కలంగా వచ్చాయి. తరువాతి ఆరేడేళ్ళలోను రంగారావు 60 చిత్రాలలో నటించాడు. తమిళనాడులోకూడా మేటినటుడయాడు. ఇంత తక్కువ కాలంలో ఇన్ని చిత్రాలలో నటించేవాడు ప్రతిచిత్రానికీ, ప్రశంసలందుకోవడంమాటలు కాదు. అయినా రోజూ ఒక అడుగు ముందుకు పెట్టగలగడానికి కారణం, కళారాధకుడుగా అతనిలో గల అసంతృప్తే. అన్నిటికన్న ఆత్మ విమర్శనకు ఎక్కువప్రాధాన్యం ఇస్తాడు రంగారావు. అందుకనే అప్పుడప్పుడు తన పాత్ర చిత్రాలు తెప్పించి వేసుకుచూస్తూఉంటాడు.

"పొగరు తక్కుండా, కొమ్ములు మొలవకుండా ఉండదలచుకుంటే, మనం నిన్న చేసినకృషిని ఇవాళ ఓసారి చూడడం ఉత్తమం. మన శక్తిసామర్థ్యాలమీద అదే అతినిశితమైన విమర్శ చేస్తుంది. దానికింక మొహమాటంలేదు" అంటాడు రంగారావు.

పై రెండూకాక, ఇతరదేశాల చిత్రాలు, ఇతర నటుల సాధన ఎలా ఉన్నాయో తెలుసుకుంటాడు. అవన్నీ చూస్తే తెలుసుకుంటే, ఎవరికీ అతిశయం అతిశయించదు అని అతని సిద్ధాంతం. పరిపూర్ణత ప్రతి

(98- వ పేజీ చూడండి)

★ తమిళ చిత్రసీమలో

# జానపదాలదే

చిత్రాల సంఖ్యతోపాటు స్థాయి కూడా పెరగడం గతసంవత్సరపు తమిళ చలన చిత్ర పరిశ్రమ విశేషాలలో విశేషం. ఈ ఏడు ఎక్కువచిత్రాలు ఆర్థిక విజయం సాధించడం మరో విశేషం. 1956 సంవత్సరాంతాన పరిశ్రమ దెబ్బతిని, కోలుకోలేనా, 57 ఆరంభంలోనే బాగా పుంజుకొంది. ఎందరో కొత్త నిర్మాతలు ఉత్సాహంతో రంగంలోకి దిగారు. తత్ఫలితంగా స్టుడియోలలో చోటుకు రద్దీ, నటీ నటులరేటు గిరాకీ

రెండు జోడుల మువరీ తరిదం్రులు ఉండడం పరిపాటి. ఇప్పుడది తప్పనిసరి అయిపోయింది. సినిమాకి కథ రాయదలచుకున్న వాడు ఈ శాల్తీ లన్నింటికీ అందులో చోటు చేసి మరీ రాసుగోవాలి.

---

తమిళ చిత్రసీమ తెర వేలుపులలో తమిళులు సగంమందే. హీరోలుగా చెలామణి అవుతున్నవారు ముగ్గురు. విలన్ వేషాలకు

స్తున్న చిత్రాలన్నిపార్ అంటే, 30 కి తక్కువ ఎవరు చెప్పరు. అందులో ఇద్దరు స్వయంగా చిత్రాలు నిర్మిస్తున్నారుకూడా. అసలే రద్దీ, అందులో ఇదీ!

## 'సాగే' నిర్మాణం!

వీళ్లకున్న ఎక్కువ చిత్రాలలో నటిస్తున్న ఒకానొక నటుడు, ఈ మధ్య నాతో మాట్లాడుతూ, "బ్రదర్, నన్ను పేరెట్టి పిలిచేకన్న నడుస్తున్న శవం అనడం మెరుగు" అన్నాడు నిస్పృహతో. అతడు ఈ మధ్య కొన్నాళ్ళపాటు వరసగా రోజుకు 24 గంటలు పని చేశాడు. అయినా, అతన్ని బుక్ చేసుకున్న నిర్మాతలు కొందరు, 'అందులోనే మాకు ఎలాగో రెండు కాల్షీట్ సర్దుఅన్నా" అని ప్రాధేయపడతారు. అయితే, రోజుకి 48 గంటలు ఏర్పాటుచేయడం బాక్సాఫీస్ స్టార్లకుకూడా సాధ్యపడేది కాదుగదా! ఏమో ఒక వేళ, 30 గంటలు కుదురుతుందేమోనని నిర్మాతలు ఆశపడుతూ ఉంటారు. నిర్మాణం అలా 'సాగు'తూనే ఉంటుంది. జూన్ విడుదల చిత్రాలు డిశంబరు నెలకు, 1957 వి 59 కి సాగుతూ ఉంటాయి.

## 'కడయాదు'

తమిళ చిత్రాలలో నాయకపాత్ర నిర్వహించడానికి—"ఒర్రు ఆర్టిస్ గూడా కడయాదు" అంటున్నాడు మొన్న ఒక నిర్మాత కాసేపు ఆలోచించి.

ఆమాట నిజమే, ఉన్నది పద్మిని ఒకర్తె. ఆమెకూడా మలయాళీ. కొన్నాళ్ళక్రితం టి. ఆర్. (చంద్రలేఖ) రాజకుమారి, రాణిగా ఈ సీమను ఏలింది. అంతకు కొన్నేళ్ళక్రితం ఎస్. డి. సుబ్బులక్ష్మి ప్రముఖ నటి. ఇపుడుదరూ వెనకబడ్డారు. ఈనాడు, తమిళసీమ విశేష ప్రజాదరణ గడించుకున్న నటీమణులు భానుమతి, సావిత్రి, అంజలీదేవి, కన్నాంబ. ఇటీవల జమున చాలా చిత్రాలలో బుక్ అయింది అయితే, వీళ్ళందరికీ తెలుగు చిత్రాలలోకూడా చాలా పని ఉంటుంది. మొత్తానికి, దానాదివా, ఒక ప్రముఖ నటిని ఒక చిత్రానికి బుక్ చేయడం



మద్రాసు ఫిలింఫాన్ససంఘంవారు, 1957 వ సంవత్సరానికి శ్రీ శాటి చాణక్యను ఉత్తమ తమిళద ర్శకుడుగా (కాలం మారిపోచ్చు చిత్రానికి) ఎన్నికచేశారు. శ్రీమతి జి. పార్థసారథి ద్వారా బహుమతినందుకుంటున్న చాణుక్య.

కూడా ఒక్కుమ్మడి పెరిగిపోయాయి. పరిభాష ప్రకారం 'ఆర్టిస్ట్ ట్రబుల్' (నటులు దొరక్కపోవడం దొరికితే రాలేకపోవడం) ఎక్కువైపోయింది. దరిమిలా స్టుడియోలలో చోటు దొరకడం సులభమైనా, నటులు మాత్రం దుర్లభులు అయిపోయారు.

తమిళ చిత్రాలు అన్నిటిలోను (ఆ మాటకొస్తే తెలుగు, హిందీ చిత్రాలుకూడా అంతే), ఒక హీరో, ఒక హీరోయిను, (కుదిరితే ఇద్దరు), ఒక విలను, ఒక 'వాంపు', ఒకాయనే ఉన్నాడు. హాస్య పాత్రలకు మటుకు ఇద్దరు ఘనులు ఉన్నారు. కాగా నాయిక పాత్రలు ధరించే నటి ఒకర్తె ఉన్నది. ఆమెకూడా తమిళ యువతి కాదు.

ఈ రోజున ఫిలిం తీయాలనుకున్న ఏ నిర్మాతగాని, డబ్బిస్తాన్న ఏ డిస్ట్రిబ్యూటరుగాని, పైన పేర్కొన్న ముగ్గురు 'హీరో'లలో ఎవరో ఒకరు లేకపోతే ముందడుగు వెయ్యడు. కానీ విదల్చడు. ఇవాళికి ఆ ముగ్గురు హీరోలను పలకరించి, మిగ. నటికన్న, బుక్ చేసిన నటిదగ్గర ఒక కాల్

'డేట్' సంపాదించడం గగనం అయి పోయింది. పై నటీమణులలో కన్నాంబ పేరుకూడా ఉంది. ఆమె నాయికగా నటించకపోయినా, తల్లిపాత్ర ఉన్న చిత్రాలలో కన్నాంబ తప్పనిసరిగా ఉండాలన్న పట్టుదల స్థిరపడిపోయింది. ఆమెపట్ల అందరికీ ఉన్న గురి గౌరవం అలాటివి. మంగతాయారిలో భానుమతి విశ్రాంతికోసం మెల్లిగా కొన్ని చిత్రాలను తిరస్కరించి వేస్తోంది. ఇటీవలగా, వైజయంతిమాల, హిందీ చిత్రాలతోపాటు, తమిళ చిత్రాలకు కొంత వ్యవధి కేటాయించ నిశ్చయించుకుని, కొన్ని కాంట్రాక్టులు అంగీకరించింది. తమిళ చిత్రాలలో 'వాంప్' (దుర్మార్గురాలు) వేషాలకు ఇద్దరే ఉన్నారు. రాజసులోచన, ఎం. ఎన్. రాజం. వాళ్ళిద్దరికీ కూడ, ఈ వేషాలమీద పట్టింపులేదు. ముఖ్యంగా ఒకటి రెండు చిత్రాలలో రాజసులోచన నాయిక పాత్రలు ధరించింది కూడా. ఆమె చాలా తెలుగు చిత్రాలలోకూడా నటిస్తోంది.

తమిళ పరిశ్రమకు పేరుప్రఖ్యాతులు తెచ్చిపెట్టిన ఇద్దరు నటులు, హాస్యపాత్రలు ధరించే తంగవేలు, చంద్రబాబు. కేవలం వీళ్ళిద్దరిహాస్యంవల్లనే బాక్సాఫీస్ హిట్లు అయిన చిత్రాలు ఎన్నో ఉన్నాయి. సారంగపాణి మరొక గొప్పనటుడు. అలాగే దురైరాజ్ అని మరొకాయన ఉన్నాడు. అయినా తంగవేలు, చంద్రబాబు అసమాన ప్రజ్ఞావంతులు. అందుకేం సందేహంలేదు. అందుకనే, అందరూ వాళ్ళనే బుక్ చేస్తున్నారు. అందువల్ల, వాళ్ళకథకూడా, యథాప్రకారం, 'కాల్ షీట్'లకు కరవైపోయింది అనిపించుకునే ఫక్కీలో నేఉంది.

తమిళ హీరోల గిరాకీ ఎక్కువైనందువల్ల, నిర్మాతలదృష్టి, ప్రముఖ తెలుగునటులపైకి మళ్ళింది. మరోవిధంగా చెప్పుకోవాలంటే 'దేవదాసు', 'ఎంగళ్ వీట్టు మహాలక్ష్మి', (తోడికోడళ్లు) చిత్రాలద్వారా నాగేశ్వరరావు తమిళనాడు ప్రజల గౌరవాభిమానాలు గడించుకోవడంతో, చాలమంది, అతన్ని బుక్ చేయడానికి పోటీలు పడుతున్నారు. అలాగే, 'మాయాబజార్', చిత్రం విడుదలతో, రాముడు, కృష్ణుడువంటి పాత్రలకు ఎన్. టి. రామారావును మించిన మంచి నటుడు లేడని అంతా అంగీకరించారు. సేలంలో ఎం. ఎ. వి. వారు నిర్మిస్తున్న తమిళచిత్రం 'రామాయణం'లో రామారావు, రాముడి పాత్రను నిర్వహిస్తున్నాడు. తమిళనాడులో ఖ్యాతిగడించుకున్న మరొక తెలుగు నటుడు ఎస్. వి. రంగారావు. ఈ నాడు ఈయన చాలా తమిళచిత్రాలలో నటిస్తున్నారు.

## మంచి కథ-చిన్న నటులు

కథ, కథనం, నటన, సంగీతం మొదలైన అన్నీ బాగుంటే, 'పెద్ద'నటులు లేకపోయినా చిత్రం ఆర్థికంగా ఘనవిజయం సాధించగలదన్న సత్యం ఈ ఏడాది రెండుసార్లు రుజువైంది. ఒకటి ఏ. వి. ఎం. వారి 'కులదైవం'. దీనికి బెంగాలీ కథఒకటి మాతృక. ఇందులో 'పరిభాష' ప్రకారం చిన్న నటులు అనబడే వారు నటించారు. ఈ చిత్రం అఖండ విజయం సాధించింది. దాంతో, మెయ్యప్పన్ చెట్టిగారు ఎంతో సంతోషించి, అదే కథను, చిన్న నటులతోనే హిందీలో చిత్రంగా నిర్మించ నిశ్చయించారు. అలాగే ఎం. ఎ. వి. వారి 'ముదలాళి' కూడా యిదే విధంగా ఆర్థికవిజయం సాధించింది. ఇపుడిది తెలుగులో తయారవుతోంది.

## నిన్నటి చిన్న నటుడు

ఈ రెండు చిత్రాలలోను నటించిన 'నిన్నటి చిన్నహీరో' రాజేంద్రన్ అమాంతం తారాపథాన్ని అందుకున్నాడు. ఇప్పుడతను 80 చిత్రాలలో ఉన్నాడు. అతను దొరకడం కూడా ఈనాడు దుస్సాధ్యమే.

## కథలు

తమిళ చిత్రసీమలో, జానపదాలు అనబడే జాతి కథలే ఈనాడు ముమ్మరంగా అమ్ముడుపోతున్నాయి. ఇందులో ముఖ్యపాత్రధారులు (పాడును) డైలాగులరచయిత సంగీత దర్శకుడు, డాన్సు డైరెక్టరు, కథ కట్టే అయవాను. కథ ప్రధానంగా అన్నిటిలోనూ ఒకటే సంఘటనలూ ఒకేఫక్కీవి. కొద్దిపాటి మార్పులతో కొత్తచిత్రం రూపు ధరిస్తుంది. సృజనాత్మకమైన కృషికి ఈనాడు ప్రాధాన్యం ఉండటంలేదు. ఈ తరహా చిత్రాలన్నీ ఆర్థికంగా ఘనవిజయం సాధిస్తూనే ఉన్నాయి. సాంఘిక చిత్రాలు బహుకొద్దిగా తయారవుతున్నాయి. ఈమధ్య కొన్ని సంటు చిత్రాలు వచ్చాయి. వాటిలో జంతువుల గారడీలు ప్రధానాకర్షణ.

ఆడంబరం, ఆర్భాటం లేకుండా అందముగా, హాయిగా ఉందనిపించిన చిత్రం ఆర్. నాగేంద్రరావు నిర్మించిన 'ఆశ్చదైవం'. అది అందరి ప్రశంసలూ అందుకొంది. మద్రాసులో 'ఆర్థిక ప్రశంసలు' కూడా అందుకొంది. ★

## సమర్థుడైన నటుడు

# గుమ్మడి వెంకటేశ్వరరావు

ప్రదహారేళ్లవాడు, గుమ్మడి వెంకటేశ్వరరావు చాలామంచినటుడని, తెలుగుదేశంలో ఓహో అనిపించుకుంటాడనీ ఎవరికీ తెలీదు; అతనికీ తెలీదు. అవుతాడనీ ఎవరన్నా చెబితే అతన్ని ఎరిగినవాళ్లంతా నవ్వి ఊరుకునేవారు; అతనూనవ్వి ఊరుకునేవాడే.

కాని, 1942 లో ఒకరోజున మిత్రులు అతనిచేత ఒక నాటకంలో వేషం వేయించారు. తీరా స్టేజిమీదకి వచ్చాక అతనికి వణుకుపుట్టింది. ముచ్చెమటలూ పోశాయి. అయితే, తెరలోకి పారిపోకుండా, నిలబడి, దీని అంతు 'కనుక్కోవాలి' అనుకుని, తన వంతు మాటలు చెప్పేశాడు. ప్రేక్షకులంతా శెబాష్ అన్నారు; వాళ్ళ ప్రతినిధులు గుమ్మడి వెంకటేశ్వరరావుకు ప్రథమ బహుమతి ఇచ్చి భుజంతట్టారు. అప్పటికి అతనికి వణుకు తగ్గింది. అలాటివాడికి బహుమతి ఎలా వచ్చినట్టు? అంటే ఆజవాబు ఒకటే: ఆరోజు అతను వేసింది. 90 ఏళ్లముసలి వాడి వేషం...

* * *

సోవియట్ ప్రజానటుడు చెర్కాసోవ్ 'ఆత్మకథ'లో దాదాపు ఇలాటి దొక సంఘటన కన్పిస్తుంది. నాటకాలు వేస్తూ ఒకసారి పద్యపఠన చేస్తూ ఉండగా ఒకరోజున చెర్కాసోవ్‌కు గొంతు బొంగురుపోయింది. తప్పనిసరి కాబట్టి, అలాగే రంగం మీదకు వెళ్ళాడు. ఆరోజు అతడు అందుకొన్న ప్రశంసలు ఇన్ని అన్ని కావు. 'సంభాషణలు ఏమి అద్భుతంగా చెప్పాడు! అని మెచ్చుకున్నారట. అక్కడినించి, చెర్కాసోవ్, ఆ నాటకం ప్రదర్శనలు జరిగినపుడల్లా, గొంతుబాగున్నా, తెచ్చిపెట్టుకుని బొంగురుపోయిన వాడి స్వరంతో అస్థాయిలో మాట్లాడేవాడట.

* * *

"—కాబట్టి ఫలానా నటుడి విజయం వరిఅదృష్టం పాపతు...అని సిద్ధాంతాన్ని స్థాపించలేరు. ఒక్కొక్కరిలో ఉన్న అజ్ఞాతప్రజ్ఞకు ఒక్కొక్కసారి ఒక్కొక్క విధంగా దోహదం లభిస్తుంది. అప్పుడది ప్రకాశిస్తుంది. అంతే.

ఈనాడు వెండితెరమీద గుమ్మడి నటనలో, మాటలలో చేతలలో కనబడే ధీమాకు, స్థైర్యానికీ ఆనాటిబహుమతి పునాదిరాయి. అయితే, గుమ్మడి, అలావరసగా నాటకాలు వేసి పునాదిరాళ్లు పేర్చుకుంటూ రాలేదు. చూసి పేర్చుకుంటూ వచ్చాడేమో. అంతే. అందువల్ల, "రంగస్థలంమీద అపారమైన అనుభవం గడించడం చలనచిత్ర నటనకు



'ధాన్సు'తో రామాన్న

అవసరం" అన్న సూత్రం గుమ్మడికి వర్తించదు.

* * *

సినిమాలో చేరడానికి ముందు, గుమ్మడి, తెనాలిలో రేడియో, ఎలక్ట్రికల్ సామానుల వ్యాపారం చేస్తూవుండేవాడు. సినిమాల్లో చేరకపోతే, అందులోనే ఉండేవాడని అనుకోడానికి వీలులేదు. ఆ వ్యాపారంలో నష్టం వచ్చింది. అందుకని, అతడు చెన్నపట్నంచేరాడు. కాని 'ధాన్సు' రాలేదు. గుమ్మడి మళ్ళీ ఇంటికొచ్చేశాడు. 'నేను కనుక్కుంటానులే' అన్నాడు గుమ్మడి అభిమాని డి. ఎల్. ఓ ఏడాది తరవాత టి. ఎన్. టి. వారి 'అదృష్టదీపు' లో ఒక వేషానికి కొత్తనటుడు కావాలని దర్శకనిర్మాత సౌందరరాజన్ డి. ఎల్. ను అడిగారు. తనదగ్గరఉన్న బొమ్మలుచూపించి "ఇతను సమర్థుడు" అని చెప్పారు. డి. ఎల్.

మూడోనాటికల్లా మళ్ళీ మద్రాసు వచ్చాడు గుమ్మడి. 'అదృష్టదీపుడు' లో నటనకు వెయ్యిన్నూటపదహార్లిచ్చి సత్కరించారు నిర్మాత.

కాని, ఆతరవాత మళ్ళీ ఇంకోధాన్సు ఎంతకీ రాలేదు. వెళ్ళిపోవడం మంచి దనుకున్నాడు ఒకరోజున.

ఆరోజున గుమ్మడిని ఆపినవాడు ఎన్. టి. రామారావు. ఎన్. ఎ. టి పేరిట ఎన్. టి. నిర్మించిన 'పిచ్చిపుల్లయ్య'లో ఎస్టేటు మేనేజరు వేషంవేశాడు గుమ్మడి. ఆ చిత్రం ఆర్థికంగా, సముచిత విజయం సాధించకపోయినా, గుమ్మడికి మంచిపేరు వచ్చింది. ఎన్. ఎ. టి. వారి తరువాతిచిత్రం, 'తోడు దొంగలు'లోను, రాగిణీవారి 'అర్ధాంగి' లోను మంచి భూమికలు లభించాయి.

గుమ్మడి వెంకటేశ్వరరావుకు విలన్ వేషాలు వెయ్యడం జీవిత లక్ష్యంకాదు. అయితే జీవితంలోకోరుకున్నది గబుక్కున రాదు. గుమ్మడీ, అప్పటికి 'ధాన్సు'ను కాదని, వచ్చిన వేషాలు ఎంచుకునేస్థితిలో లేనూ లేడు. అప్పుడు 'ధాన్సు' విలన్ వేషాలే ఇచ్చింది. గాలి అటే వీచింది. తొలిరోజు నాటకంలో వేషం కట్టినట్లే, ఇందుకూ ఒప్పుకున్నాడు గుమ్మడి. ఈసారి మటుకు అప్పటిలా అప్పనంగా, 'ధాన్సుగా' అతనికి మంచిపేరు వచ్చిందని ఎవరు అనలేకపోయారు. ఇతను సమర్థుడు, మితి తెలిసిన నటుడు అనుకున్నారు. 'విలన్' కు బెస్టుఅని కొందరు అనేశారు. ఆ తరవాత తమిళ చిత్రసీమలో 'విలన్' వీరప్పకు తెలుగు ప్రతిగా గుమ్మడి నిలబడ్డాడు. గాలివాటాన్నిబట్టి వచ్చిన అవకాశాలని తెలిసినప్పటికీ

(98-వ పేజీ చూడండి)

# తర్జుమా చిత్రాల తీరుతెన్నులు

నేడు చిత్రపరిశ్రమలో చిత్రాలను ఒక భాషనుండి మరొకభాషలోకి 'డబ్' చేయడం భారీఎత్తున సాగుతోంది. తమిళ చిత్రాలను తెలుగులోకి, తెలుగుచిత్రాలను తమిళంలోకి డబ్ చేస్తున్నారు. మరికొన్ని తమిళంనుంచి కన్నడం, కన్నడంనుంచి తమిళంలోకి, తమిళంనుంచి హిందీలోకి డబ్ చేస్తున్నారు.

తెలుగుచిత్రాలు: సంతానం, జయంమనదే దొంగరాముడు, జయసింహ, పెంకిపెళ్లాం, బ్రతుకుతెరువు మొదలైనచిత్రాలు తమిళంలోకి డబ్ చేశారు. ఈచిత్రాలన్నీ తెలుగులో కూడ విజయవంతంగా నడిచాయి. తమిళంలో కూడ విశేషంగా ప్రజాదరణను పొందాయి.

అలాగే తమిళంనుంచి: మనోహర-అమరజీవి—రత్నగిరి రహస్యం—వేగుచుక్క—సాహసవీరుడు—రాజపుత్రి రహస్యం—తలవంచని వీరుడు మొదలైన చిత్రాలు తెలుగులోకి డబ్ చేయబడ్డాయి. ఇవి విశేషంగా డబ్బు చేసుకున్నాయి.

ఈ ఆర్థిక విజయ పరంపరవల్ల అనేకమంది నిర్మాతల దృష్టి ఈ డబ్బింగు చిత్రాలమీదికి మళ్ళింది. తక్కువ డబ్బుతో, తక్కువ కాలంలో వ్యాపారం చేయాలనుకునేవారికి ఇది చక్కని వ్యాపారం. చిత్రం ఏ మాత్రం విజయవంతమైనా నిర్మాతకు నష్టమూ వుండదు. మొత్తంమీదచూస్తే చిత్రం దేశమంతా ప్రదర్శించిన తరువాత నిర్మాత ఏ విధంగానూ నష్టపడడు. అలా డబ్బింగు చిత్రాలవల్ల నష్టపడినవారుకూడా లేరనే చెప్పవచ్చు.

ఈనాడు డబ్బింగు చిత్రాలు ఎవరో కొద్దిమంది తక్కువ డబ్బుతో వ్యాపారం చేయాలనుకునేవారేకాక పెద్ద పెద్ద డిస్ట్రిబ్యూటర్సు కూడ డబ్బింగు చిత్రాలను ప్రోత్సహిస్తున్నారు. పెద్ద తారలు నటించే చిత్రాలు కొన్ని తయారవటానికి చాలా ఆలస్యం అవుతూఉంటుంది. అలా కొన్ని చిత్రాలు అనుకున్న సమయానికి రానప్పుడు ఇలా ఒక చిత్రానికి మరోచిత్రానికి మధ్య వచ్చే వ్యవధిలో థియేటర్సుకు ఈ చిత్రాలను సరఫరా చేసి వ్యాపారం సాగించడానికి ఇది మంచి సదుపాయం. అందువల్లకూడా ఈచిత్రాలను ప్రోత్సహిస్తున్నారు.

ఈ డబ్బింగు చిత్రాలంటే మరికొంతమంది నిర్మాతలకు కష్టంకూడావుంది.



రచయిత

మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

అందుకు కారణం ఒక నిర్మాత మూడు నాలుగులక్షలు ఖర్చుపెట్టి చిత్రాన్ని నిర్మించి విడుదల చేసిననాడు దానికి పోటీగా ఈలక్ష రూపాయలతో తయారైన డబ్బింగుచిత్రాలు కూడ విడుదలవడంవల్ల, చిత్రాలకు ఆర్థికంగా దెబ్బతగలడమో, కొన్ని సందర్భాలలో డబ్బింగు చిత్రమే విజయవంతమవడం తద్వారా ఈ నిర్మాతలు నష్టపడడం జరుగుతూంది. అయితే ఇందుకు డబ్బింగు చిత్రమే కారణమని ఎలా చెప్పగలం? తెలుగులో తీసిన చిత్రం యొక్క కథావిధానం కంటే డబ్బింగు చిత్ర కథే గొప్పదని తేలుతూంది. అది వారి తప్పేమీ కాదు.

డబ్బింగుచిత్రాలు కొన్ని విజయవంతమవడంతో అటు తమిళంలోనూ, ఇటు తెలుగులోనూ, కూడ దొరికిన ప్రతి చిత్రాన్ని డబ్ చేయడానికి పూనుకుని కొంతమంది దెబ్బతింటున్నారు. ఇందువల్ల ప్రేక్షకులకు డబ్బింగు చిత్రాలమీద నున్న మంచి అభిప్రాయం దూరమౌతూ వుందనిపిస్తూంది.

ముఖ్యంగా డబ్ చేయదలచుకున్న వారు ఒక భాషలో విజయవంతంగా నడిచిన చిత్రాన్ని డబ్ చేయడమే మంచిది. ఇందువల్ల, నిర్మాత నష్టపడడంగాని, ప్రేక్షకుడు విసుగుచెందడంగాని వుండదు.

ఈ నాటి డబ్బింగు చిత్రాలు వెనుకటి డబ్బింగు చిత్రాలకంటే, సాంకేతికంగా ఎంతో గొప్పగా తయారవుతున్నాయి. ఇది డబ్బింగు చిత్రమేనా అన్నంత బాగా తయారవుతున్నాయి.

ప్రేక్షకుల్లో కొందరు "ఇది డబ్బింగు చిత్రం రా" అని తేలిక చేసి మాట్లాడుతున్నారు. కాని, వారే హిందీ చిత్రాలనూ ఇటాలియన్, ఇంగ్లీషు, ఫ్రెంచి, చిత్రాలను చూచి, చాలా గొప్ప చిత్రాలని ఒక్కమాట తెలియకపోయినా, పొరుగింటి పుల్లకూర రుచి అన్నట్లు. ఆ చిత్రాల యొక్క సాంకేతిక విధానాలననుసరించి తెగ పొగుడుతూ వుంటారు. కాని అన్యభాషా చిత్రాన్ని మాతృభాషలో చూపిస్తే చూడలేరు. ఇలా ఈ ప్రేక్షకులకు ఈ అభిప్రాయం కలగడానికి కారణం అర్థమైన చిత్రం డబ్ చేయడంవలనే. కడుపు నిండిన గారెలు చేదన్నట్లు ఏదైనా మితంగానే వుండాలి.

ఈ నాడు డబ్బింగుకుగాను దాదాపు లక్ష రూపాయలైనా ఇచ్చి చిత్రపు హక్కులు కొని డబ్ చేయడానికి నిర్మాతలు ముందుకు వస్తున్నారంటే డబ్బింగ్ చిత్రాల యొక్క విజయ పరంపరే కారణం.

డబ్బింగ్ చాల కష్టమైనపని. తెరమీది పాత్రల పెదవుల కదలికలననుసరించి, భావానికనుగుణంగా అర్థం చెడకుండా మరో భాషలో మాటలు వ్రాసి, క్షణంలో సగం తేడారాకుండా, వాటిని రికార్డు చేసి అమర్చాలి.

ఇందులోనే మరోపద్ధతి వుంది. అది ట్రాక్ చేంజ్ అంటే ముందే నటీనటులచేత మనకు కావలసినభాషలో (ఈభాష వారికిరానక్కరలేదు. ఎలాగా ఆమాటలుఅంటే చాలు,) ముందుగా సంభాషణలు చెప్పించడం, తరువాత సౌండ్ ట్రాక్ మార్చి మళ్ళీ విడిగా మరొకరిచే సంభాషణలుచెప్పించడం ఆపైన ఆచిత్రానికి ఈ సంభాషణలు అమర్చడం. ఇందువల్ల సంభాషణలు పెదిమెల కదలికకు చక్కగా కుదురుతై కాని నిర్మాతకు కొంచెం ఖర్చు ఎక్కువ. ఈవిధంగా అన్ని చిత్రాలలోనూ జరుగదు కాని తెలుగునటులు, తమిళంలో నటించినప్పుడు తమిళనటులు తెలుగులోకూడ నటించవలసి వచ్చినప్పుడు

# తర్జుమా చిత్రాల తీరుతెన్నులు

పైవిధంగా సంభాషణలు మాట్లాడించి తరువాత ఆయాభాషలు మాట్లాడగలవారితో డబ్ చేస్తారు.

డబ్బింగు నిజంగా చాలా కష్టమైన ప్రత్యేకమైనకళ అని చెప్పాలి. డబ్బింగు చిత్రానికి ప్రాణం రచనే. అరవపదానికి సరియైన అర్థం భావం కలిసి వచ్చేటట్లుగా వుండి పెదవుల కదలికననుసరించి మక్కీకి మక్కీగా సంభాషణ పొడుగు సరిపెట్టాలి. ఒక్క అక్షరం ఎక్కువైనా పెదవి కదలిక మారుతుంది. అంతేగాక పాత్ర మాట్లాడి ముగించినతరువాతకూడ మనకు సంభాషణ వినబడుతూనే వుంటుంది. ఇందుకు చేయి తిరిగిన రచయిత ఉండాలి. శక్తివంతుడైన రచయిత లుండాలి. కొంతమంది డబ్బింగు రచననుగురించి తేలికగా మాట్లాడుతారు. కాని రచయితలకు డబ్బింగు రచన కష్టమైనదే. కొంచెం అలవాటుపడితేనేగాని డబ్బింగు రచన సాగదు. భాషమీద ఎంతో అధికారం ఉండాలి.

ఈనాడు డబ్బింగు చిత్రాలు వ్రాస్తున్న వారిలో ముఖ్యులు శ్రీ శ్రీ, ఆరుద్ర, పద్మరాజు, అనిసెట్టి మొదలైనవారు. గోపాలరాయశర్మ, ఆత్రేయ కొన్ని చిత్రాలకు సంభాషణలను వ్రాశారు.

డబ్బింగు చిత్రాలలో ఆయా పాత్రల ననుసరించి నటీనటుల్ని నిర్ణయిస్తారు. ఫలానా పాత్రకు ఫలానా గొంతుఅయితే బాగుంటుందని నిర్ణయించుకుంటారు. డబ్బింగు చెప్పే నటకులు కేవలం సంభాషణలు పలకడమే కాదు. రచయితవ్రాసిన సంభాషణలయొక్క భావం పోగొట్టకుండా ఏపాత్రకు సంభాషణలు చెపుతున్నారో ఆపాత్రకు అక్షరాలా న్యాయంకలుగజేయాలి. డబ్బింగంటే, చచ్చినమనిషికి ప్రాణం పోయడంలాంటిది. నిజానికి చాల కష్టమైంది డబ్బింగువిధానం. ఈనాడు డబ్బింగు చెప్పేవారిలో అనేకమంది నటీనటు లున్నారు. టి. జి. కమలాదేవి, కృష్ణకుమారి, తిలకం, పార్వతి (రేడియో) భానుమతి, కొటూరు అన్నపూర్ణమ్మ, ఉదయం, కుమారి రామం, జగ్గయ్య, వల్లం నరసింహారావు, వసంతకుమార్, వెంపటి సత్యం, ఈవ్యాసరచయిత, ఏ. వి. సుబ్బారావు చంద్రుడు వి. రాజు-బల రామయ్య, నాగభూషణం, శర్మ, రామకోటి పెరుమాళ్ళు.

ఈనాడు డబ్బింగులో మన ప్రసిద్ధ తెలుగు నటీనటులుకూడ పాల్గొంటారు. తమిళ చిత్రాల్లోకూడా నటించే మన నటులు, కన్నాంబ, నాగయ్య, సావిత్రి, జి వరలక్ష్మి భానుమతి మొదలైనవారు. తమిళంలో వారు ధరించిన వారిపాత్రలకు వారే తెలుగు సంభాషణలు మాట్లాడుతున్నారు. ఇందువల్ల ప్రేక్షకుల్లో ఆయా నటీనటులు తెలుగుచిత్రంలో నటించినట్లే భావిస్తున్నారు.

చిత్రాల్లో డబ్బింగు చెప్పే నటీనటులకు చాలా తక్కువ డబ్బును ముట్టచెపుతున్నారు. నిజంగా డబ్బింగుచెప్పే నటీనటులకు వారి కష్టానికి తగినంత ముట్టచెప్పాలి.

డబ్బింగు చిత్రవిజయానికి ఎక్కువ బాధ్యత వహించేవ్యక్తి ఎడిటరు. ఇతడు డబ్బింగు చిత్రానికి దర్శకుడువంటివాడు. డబ్బింగు చిత్రానికి ప్రాణంపోసేది ఈయనే. పాటల్ని మాటల్ని సరిగా సింక్రొనైజ్ చేసి జీవం పోయగలిగింది ఈయనే; చిత్రంయొక్క జయాపజయాలకు ప్రధానబాధ్యుడు ఈ ఎడిటరే.

ఈనాడు డబ్బింగుకు చిత్రాల్ని అమ్మటం ద్వారా నిర్మాతకు అదనంగా 60 లేక 70 వేల రాబడి వస్తూంది. ప్రస్తుతం లక్షరూపాయలవరకూ కొనే అవకాశాలు కనబడుతున్నాయి.

ఒక్కొక్క చిత్రాన్ని డబ్ చేయాలంటే రెండుభాషాల్లోగాని, మూడుభాషల్లోగాని పూర్తిచేయవచ్చు. ఇందువల్ల ఖర్చులు తగ్గుతాయి. చిత్రం విడుదలైన మూడు మాసాల్లో నిర్మాత పెట్టుబడిపోను లాభాలు కూడా రావడానికి అవకాశముంది.

ప్రతి డబ్బింగుచిత్రం 4 లేక 5 వారాలు నడిస్తేచాలు. కొద్దికాలంలో కొద్దిపెట్టుబడితో కొద్దిలాభాలు సంపాదించిపెట్టే వ్యాపారం డబ్బింగు.

ఈవిధంగా ఒకభాషనుండి మరో భాషలోకి డబ్ చేయడంద్వారా నటీనటులు రెండు ప్రాంతాలకూ పరిచయమవడం—రెండు ప్రాంతాలకీ ఒకరి నాగరకత మరొకరు తెలుసుకోవడానికి, సాంకేతిక నైపుణిని ఒకరినుండి ఒకరు గ్రహించడానికి, మంచికథలు ప్రచారమవడానికీ, నిర్మాతలకు అదనపు లాభాలు రావడానికీ అవకాశముంది—ప్రస్తుతం తమిళంలోనుంచి-నీలమలైతిరుడన్-పుదుమైపిత్తన్-కర్పుకరసి-హిందీలోనుంచి పవనపుత్ర హనుమాన్. తెలుగులోకి డబ్ చేస్తున్నారు.



# పిల్లల చిత్రాలు 

కాలం మారుతున్న కొద్దీ, విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ ప్రపంచంలో అనేకమైన మార్పులు జరుగుతున్నై. ఈ మార్పులలో పిల్లల విజ్ఞానానికి అనేక సౌకర్యాలు కలిగించటం ఒకటి. ఈ దృష్ట్యా బాలసంఘాలూ, గ్రంథాలయాలూ, పత్రికలూ, క్రీడారంగాలూ మొదలైన ఎన్నో బాలలకోసం ప్రత్యేకంగా ఏర్పాటు అయి నడుస్తున్నై. ఈ ఉద్యమంలోనే మరొక ఏర్పాటు పిల్లలకు చిత్రాలు! అన్నిటితోపాటు పిల్లల విద్యాభివృద్ధికీ విజ్ఞాన సంపాదనకూ ప్రత్యేకమైన బాలల చిత్రాలు నిర్మించాల్సిన అవసరం వచ్చింది. మనదేశంలో కూడా ఈ చిత్రాల నిర్మాణమే గాక వీటిని ప్రదర్శించేందుకు థియేటర్లు కూడా నిర్మించే కృషి ఆరంభమైంది. తొలి ఫలితం మద్రాసులో థియేటర్ ఏర్పాటు. బాలల చిత్రాలకు మన దేశంలో కూడా అపూర్వమైన భావి కనిపిస్తున్నదని ఇక మనం భావించవచ్చును.

బాలల చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించటానికిగాను, భారత ప్రభుత్వం 1955 లో "చిల్డ్రన్స్ ఫిల్మ్ సొసైటీ"ని స్థాపించింది. బాలలచిత్రాలను నిర్మించే ప్రైవేటు నిర్మాతలకు ఈ సంస్థ ధన సహాయంకూడా చేస్తుంది. 'జలదీప్' అనే చిత్రాన్ని ఈ సంస్థ తయారు యటమూ,
ఆ చిత్రానికి 'వెనీస్ ఫిల్మ్ ఫెస్టివల్'లో
మొదటి బహుమతీ, 56 లో ? త ప్రభుత్వ
బహుమతి రావటమూ, ఈ ; లాన్ని విడ
కాల బాలల చిత్రాలను హి ి 'డబ్'
చెయ్యటమూ పాఠకుల దితమే) పై
సంస్థకు అనుబంధసంస్థలు విధరాష్ట్రా
లలో సంఘాలు ఏర్పడి, చిత్రాలను
ప్రోత్సహిస్తున్నై. మ ప్రభుత్వం
శ్రీ వి. సుబ్రహ్మణ్య : బా ఖా
మంత్రి)గారి అధ్యక్ష కమిటీని
స్థాపించి, విశేషంగా ది.కిదార్
శర్మదర్శకత్వాన తయా చిత్రాన్ని
ఈ సంఘంవారు తి వలే డబ్
చేశారు. (ఇందులో కొడుకు
అశోక్ శర్మ, డా క బాల
నటుడు పాల్గొన్నా చెప్పకో
దగ్గ విషయంగా-వ చిత్రాల
ప్రదర్శనకోసం ప్ర యేటర్
మన ప్రధానిచే ప్ర కూడా!
భారతదేశంలో, పిల్ల కంగా
ఏర్పాటయిన మొట్ట ఇదే.

మనకు - తెలుగులో ఇదివరలో ప్రకాశ్ వారు 'బాలానందం' అనే పిల్లల చిత్రాన్ని తయారుచేశారు. ఈ చిత్రానికి కనక వర్షం కురగకపోయినా-ఆదరణ లభించింది. ఇది పిల్లల చిత్రం! పాత్ర లన్నీ పిల్లలవి కాకపోయినా, పాత్రధారు లంతా పిల్లలే! ఈ 'బాలానందం'-చిత్రంలో వున్న మూడు కథలూ కూడా పిల్లలకు వినోదం, విజ్ఞానం కలిగించేవే! ఐతే ఈ బాలానందం తర్వాత మళ్ళీ ఏ నిర్మాతా బాలల చిత్రనిర్మాణానికి తలపెట్టలేదు. ఇందుకు అనేక కారణాలుంటై. పిల్లలచిత్రాలు మామూలు చిత్రాలమాదిరిగా ఢంకా బజాయించి, విజయ విహారం చెయ్యలేకపోవటం, కేవలం వినోదమే కాకుండా పిల్లలకు కావాల్సిన విజ్ఞానాన్ని జోడించవలసి రావటం, స్టార్ వాల్యూ అవకాశం లేకపోవటం వంటి అనేక

కారణాలవల్ల - పిల్లల చిత్రాల నిర్మాణం జరగటం లేదని అనుకోవచ్చును. ఐతే వ్యాపారరీత్యాకాక, ఇతరత్రా ఈ చిత్రాలు విజయం సాధించగలవనటంలో సందేహం లేదు. ('పెళ్ళిచేసి చూడు' 'పెద్ద మనుషులు' చిత్రాలలో పిల్లల కథలతో చిన్న నృత్యనాటికలను చూపించారు. ఈ నాటికలు పిల్లలనూ పెద్దవాళ్ళనూ అమితంగా ఆకర్షించినవని చెప్పటం సందర్భోచితం!)

"భారతదేశానికి దివ్యమైన భావికావాలంటే-ఈనాడు మనం మన పిల్లలపట్ల అమితమైన శ్రద్ధ చూపాలి. బాలల హృదయాలలోనూ, వారి లేత మనసులలోనూ చక్కని భావాలను పెంపొందించే సాధనాలలో 'చలనచిత్రం' ముఖ్యమైన సాధనం. భారత ప్రజలూ, దేశ శ్రేయస్కాములూ పిల్లల చిత్రాలను ఎంతయినా ప్రోత్సహించాలి." అన్నారు ప్రధాని 'జలదీప్' చిత్రాన్ని చూచే సందర్భంలో. "చలనచిత్రం పిల్లల విద్యాభివృద్ధికి బ్రహ్మాండమైన సాధనం అని అన్ని దేశాలూ ఎలుగెత్తి చాటుతున్నవి. కేవలం చదువూ, రాతలవల్లకాక, చిత్రాలవల్లనే పిల్లల మనస్సునూ, మెదడునూ వికసింపజేయవచ్చునని - ప్రపంచంలో వున్న అనేకమంది విద్యావేత్తల నమ్మకం. బాలల చిత్రానికి చక్కని భావి వున్నదని ఆశిస్తున్నాను" అన్నారు ప్రెసిడెంట్ ప్రసాద్ అదే సందర్భంలో. ఈ విధంగా బాలల చిత్రాలకు ఎంత ప్రాముఖ్యం వున్నదో చెప్పకుంటూ పోతే, ఎంతైనా వున్నది! ఆ ఆ చిత్రానికి 1956 లో ప్రభుత్వ ప్రశంసాపత్రం లభించింది.

దక్షిణ భారతంలో ఇటీవల వీ. వి. యం. వారు 'హమ్ పంచీ ఏక్ డాల్ కే' అనే బాలల చిత్రాన్ని హిందీలో నిర్మించి, విడుదల చేశారు. మళ్ళీ ఎవరూ అటువంటి నిర్మాణానికి పూనుకున్నటు తోచదు. ఎన్ని చిత్రాలు మనవి విజయవంత మవుతున్నా-ప్రజాదరణ పొందుతున్నా-బాలలకై ప్రత్యేకం చిత్రాలను నిర్మించటం ఎంతయినా అవసరం! మనకూ రచయితలున్నారు-చక్కని బాలనటులున్నారు-అన్నింటికంటె ముఖ్యంగా "నిర్మాతలు" వున్నారు. బాలల చిత్రాలకు విశేషంగా ధనం లభించకపోయినా విజ్ఞానదాయకమైన ఈ చిత్రాలు నిర్మించటం దేశ పురోగమన దృష్ట్యా శ్రేయస్కరం!

పిల్లల చిత్రాలను కేవలం పిల్లలే చూడరు. పిల్లల పత్రికలు పెద్దవాళ్లు చదువుతున్నట్టు సినిమాలు మాత్రం చూడరని మనం అనుకోరాదు. ఐనా, ఈ పిల్లల చిత్రాలను ప్రదర్శించేందుకు విధిగా ప్రత్యేకమైన థియేటర్లు కావాలి. ఇందుకు ప్రభుత్వం పూనుకుంటే, క్రమక్రమేణా పట్టణాల్లో ఈ థియేటర్ల నిర్మాణం జరగవచ్చును. అంతవరకూ ప్రస్తుతం బడులలో నిర్వహిస్తున్న "విజువల్ ఎడ్యుకేషన్" ద్వారా వినోదకరమూ, విజ్ఞానదాయకమూ ఐన ఈ పిల్లల చిత్రాలను చూపవచ్చును. పక్షులజీవితాలూ, మానవశరీరనిర్మాణం మొదలయిన చిత్రాలను మాత్రమే బడుల్లో పిల్లలకు చూపించేకంటె, ఫీచర్ చిత్రాలను చూపించటంవల్ల వాళ్ళకు ఆసక్తీ, ఆనందమూ కలుగుతాయి. లేకపోతే-విజ్ఞానంగల చిత్రాలే ఐనా-వినోదం లేకుండాపోతే పసి హృదయాలను ఆకర్షించవు. వాల్ట్ డిస్నీ నిర్మించిన కార్టూన్ చిత్రాలు చూస్తూవుంటే పిల్లలు ఎంత సంబరపడతారో మనం గమనిస్తూనే వున్నాము. ఐతే బడిలో ప్రదర్శించే చిత్రం చూడమంటే ఏడుపు మొహం వేసుకుని, పారిపోవటానికి ప్రయత్నిస్తారు. ఎందువల్లనంటే ఈ

# పిల్లల చిత్రాలు

చిత్రాలుకూడా బడిలో మాస్టారులాగా నైతికపాఠం చెబుతూ వున్నట్టే వుంటుంది. విజ్ఞానంతో సమానంగా వినోదం వుంటేనే గాని వాళ్ళకు నచ్చదు. అందుకనే మన వాళ్లు పూర్వం "కాకి వక్కా" అంటూ పక్షులూ, జంతువులతోనూ తమాషాగా కథలు అల్లి-చివరికి వచ్చేసరికి నీతి వచ్చేట్టుగా చేసి ఎన్నో కథలు రాశారు. ఈ కథ లేకుండా. "దురాశ దుఃఖానికిచేటు" అంటే పిల్లలకు ఏంపడుతుంది? ఐతే పిల్లలకు ఏ రకమైన చిత్రా లుండాలి? ఏవిధమైన చిత్రాలయితే వాళ్ళకు ఉపయోగిస్తాయి? అనేది బాగా ఆలోచించాల్సిన విషయం. పిల్లల చిత్రం అనగానే, చిత్రం నిండా పిల్లల పాత్రలను ప్రవేశపెట్టినంత మాత్రాన సరిపోదు. కావలసింది-"కథ." ఈ కథ కూడా పిల్లలకు సన్నిహితమైనది-వాళ్ళ సమస్యే ఐనట్టిదీ ఐవుండాలి. కథలో-వాళ్ళు నిత్యం సంచరిస్తూన్న వాతావరణాన్ని కల్పించాలి. వాళ్లబడీ, ఆటలూ, పాటలూ, అమ్మా, నాన్నా వంటి పాత్రలూ మొదలయిన వన్నో ప్రవేశపెట్టాలి. కాకపోతే పిల్లలచేత కమ్యూనిటీ ప్రాజెక్టులమీద ఉపన్యాసా లిప్పిస్తే-"హామ్ పంఛీ ఏక్ డాల్ కే" చిత్రంలాగా ప్రజాదరణను అంతగా పొందలేవు. ఇక చిత్రంలో పాత్రల మనస్తత్వాలూ భావాలూ కూడా పిల్లల వాస్తవిక జీవితానికి దగ్గరగా వుంటూ-సంభాషణలూ, పాటలూ కూడా సాధ్యమైనంత వాస్తవికంగానూ వుండాలి. (మన చిత్రాలలో ఎక్కడన్నా పిల్లల పాత్రలువస్తే-సాధారణంగా-వాళ్ళచేత పెద్ద సమాసాలతో పాటలు పాడించటమూ, పెద్దవాళ్ళకంటె, ఎక్కువ ధోరణిలో మాట్లాడించటమూ మనం చూస్తూనే వున్నాము) "యూకీ వారీనూ" అనే జపాన్ చిత్రంలో నాలుగు సంవత్సరాల అబ్బాయి పాత్రే ముఖ్యపాత్ర. ఈ చిత్రమూ, ముఖ్యంగా ఆ పాత్రా అనేకమంది పిల్లవాళ్ళను ఆకర్షించింది. పెద్దవాళ్ళందరో ముగ్ధులైనారు. కారణం-ఆపాత్ర యొక్క ప్రవర్తనా, వెలిబుచ్చిన భావాలూ అంత వాస్తవికంగావున్నై. బాలల మనస్తత్వానికి దగ్గరగా వుంటూ వారి సమస్యనో చిన్నకథనో తీసుకుని వినోదాత్మకంగా చిత్రించే ఒక చిత్రమూ, దాంతో జోడిస్తూ వైజ్ఞానిక విషయాన్ని బోధించే చిత్రం ఒకటె, రెండు కార్టూన్లూ వుంటే-రెండు రెండున్నర గంటలకాలం పడుతుంది. లేకపోయినా చిన్న చిన్న కథలతో "షార్ట్సు" మాదిరిగా నిర్మించి, మూడునాలుగు చిత్రాలను కలపవచ్చును. ఏ దానికయినా, ముఖ్యంగా, ముందుగా ఎన్నుకోవలసింది-సరియైన కథా-పాత్రలూనూ. (విజ్ఞాన విషయాన్ని చూపాలంటే కార్టూన్ మంచి పద్ధతి. ఇది ఆకర్షించినట్టుగా పిల్లలను ఇంకో చిత్రం ఆకర్షించలేదు. అమెరికాలో వాల్టు డిజ్నీ ఈ కార్టూన్ చిత్రాలను ఎన్ని నిర్మించాడో అన్నీ విజయవంతమయినై. అవన్నీ పిల్లవాళ్లను ఆకర్షించినై. 'పంచతంత్రం' లాంటి కథలను డిస్నీ కార్టూన్లలో నిర్మించటానికి పూనుకోటం ఎంతయినా హర్షించదగ్గ విషయం. ఈ చిత్రాలను ప్రపంచమంతా ఆదరిస్తుందనేందుకు ఏమీ సందేహంలేదు. సోవియెట్ రష్యా కూడా పిల్లల చిత్రాలను పెక్కింటిని నిర్మించింది. ఈ చిత్రాల నిర్మాణంలో మొట్టమొదట నిలిచేదీ రష్యాదేశమే! ఆ దేశంనుండి వచ్చిన చిత్రాలలో ఇక్కడ అందర్నీ ఆకర్షించినది 'చూక్ అండ్ గెక్' అనేది. క్రిందటి సంవత్సరం బాలలచిత్రోత్సవంలో దీన్ని ప్రదర్శించారు.

బాల చలనచిత్రోత్సవం, బాగా వృద్ధిలోకి వచ్చిన మరోదేశం బ్రిటన్. ప్రముఖ నిర్మాత జె. ఆర్థర్ రాంక్ పదిహేనేళ్ళనాడు ఈ ఉద్యమాన్ని నడపపూనుకొన్నారు. అంగబలం, అర్థబలం పుష్కలంగా ఉన్న ఆ నిర్మాత సారథ్యాన, పిల్లల చిత్రాల ప్రదర్శనానికి నాలుగువందల థియేటర్లలో వసతులు ఏర్పాటు అయినాయి. (వి ద్యా
ఆ కృషి ఫలితంగా, ఊరూరా బాధ్యతగల తను, ఈ
పెద్దలు ఉత్సాహంతో ముందుకువచ్చి కృషి/కృషి చేస్తున్న
చేశారు. 700 బాల సంఘాలు ఏర్పడ్డాయి. రైన జలదీప్
రాంక్ నెలకొల్పిన బాలచిత్ర సంస్థకు, ఒకంలో ఇటీ
రంగంలో చాలా కృషి చేసి, పిల్లల ఈయన
స్తత్వాలను చక్కగా గ్రహించి, వారిలా అనే మరో
రుచులను గట్టిగా తెలుసుకున్న మిస్ డు) ఈమధ్య నే-
ఫీల్డ్ ఆధిపత్యం వహించింది. 1945 (దానులో పిల్లల
50 లోగా ఆ సంస్థ విజ్ఞాన వినోద త్యేకమైన ఒక థి
యకులైన చిత్రాలు దాదాపు రెండొరంభించబడినది
వరకు తయారుచేసింది. దరిమిలా (కోసం ప్రత్యే
ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని నడిపే మొదటి థియేటర
స్వీకరించి పిల్లలచిత్రాలకు కొరవలేక
చూస్తోంది. మిస్ మేరీ ఫీల్డ్ నెలన్(తి

పద్ధతులలో ఈ చిత్రాలు మనోహ
తయారవుతున్నాయి. విదేశాల వారుకూడ ఈ విషయంలో బ్రిటిషు ప్రవీణుల సహాయ సహకారాలు కోరుతున్నారు. మిస్ ఫీల్డ్ రెండేళ్ళక్రితం ఇండొనీషియాలో పిల్లలకై రెండుచిత్రాలు నిర్మించిపెట్టింది.

నిర్మాణం తరవాత ముఖ్యంగా కావలసినవి థియేటర్లు. ఎంత చక్కగా బ్రహ్మాండంగా నిర్మించినా పిల్లల చిత్రాలు—మామూలు చిత్రాలతాకిడికి నిలబడలేవు. అందువల్ల పిల్లల చిత్రాలను ప్రదర్శించేందుకు థియేటర్లుదొరక్క పోవచ్చును. థియేటర్ యజమానులు బాలల చిత్రాల ప్రదర్శనకై కనీసం వారానికి ఒకసారి ఐనా తమ థియేటరును ఉచితంగా ఇచ్చే ఏర్పాటుచేస్తే చాలా ఉత్తమం. అన్నిటికంటె మహోత్తమమైనది—ఆయా ఊళ్ళలో ప్రభుత్వ సహాయంతోనూ ప్రజల సహాయంతోనూ మ్యునిసిపాలిటీవారు చిన్న థియేటర్లను కేవలం బాలచిత్రాల ప్రదర్శనకై నిర్మించటం! ఈ పద్ధతివల్ల థియేటర్ల కోసం వెతుక్కో నవసరంలేదు. పిల్లలేకాక, పెద్దలుకూడా అనేకమైన విదేశ చిత్రాలు ఈ థియేటర్లలో చూసేందుకు ఎక్కువ అవకాశం కలుగుతుంది. మద్రాసు ప్రభుత్వం లాగే, బొంబాయి ప్రభుత్వంకూడా పిల్లల కోసం ఒక ప్రత్యేకమైన థియేటర్ను బొంబాయిలో నిర్మించబోతున్నది. పిల్లల చిత్రాలపై నోదపు పన్నును బొంబాయి ప్రభుత్వం హాయించింది కూడా!

పిల్లల 'వికాసానికి అత్యంత
కారణమా లల చిత్ర నిర్మాణావశ్యకతను
గుర్తిం సంస్థ వేట్ నిర్మాతలూ, రాష్ట్ర
ప్రభుత్వ దీలా హకరించి ఈ చిత్రాల
నిర్మా , రాష్ట్రవ్యాప్తంగా థియే
టపాలల చేందుకు శ్రద్ధతీసుకుంటూ
ప్రదాను గ్యకలాపాలు సాగిస్తారనీ



# నక్షత్రఫలితాలు

## (15-1-58 మొదలు 21-1-58 వరకు)

### * అశ్విని [చూ, చే, చో, లా] *

ఈ వారము మీ చిక్కులు తీరిపోతవి. అనుకున్న సొమ్ము చేతికి వస్తుంది. పెద్దలసాంగత్యంవల్ల నూతనాంశాలు తెలుసుకుంటారు. కోర్టువ్యవహారాలు పరిష్కారానికి వస్తాయి. పండితులకూ, న్యాయవాదులకూ మంచి కాలము. 15, 16, 17 శ్రమతో కూడిన కార్యక్రమము, ఆపైని అనుకూలత, శుభయోగము. నటీనటులకు యోగం.

### * భరణి [లీ, లూ, లే, లో] *

ఈ వారము ఆర్థికాభివృద్ధితోపాటు మీ హోదా కూడా ఎక్కువవుతుంది. బంధువులను కలుసుకుంటారు. కవులతోనూ, గాయకులతోనూ వినోదిస్తారు. గృహమందు కలిగిన అనారోగ్యం తొలగుతుంది. దూరమందున్న ఆత్మీయుల కుశలము తెలిసి ఆరాటం తొలగుతుంది. వర్తకులకు ప్రయాణమువల్ల లాభము. కవులకు, గాయకులకు, నటీనటులకు యోగకాలము. 15, 16, 17 శ్రమగల కార్యక్రమం 19, 20, 21 ప్రయాణం, లాభం, క్షేమవార్త.

### * కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] *

ఈ వారం మీకు యోగదాయకము. గతవారంలో అసంపూర్తిగా నిలిచినపనులు ఈ వారం లాభకరముగా ముగిస్తారు. వర్తకులకు, ముఖ్యంగా నూలు, బట్టలవ్యాపారస్తులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 15,16,17 తిప్పట, శ్రమ, అశాంతి. 19, 20,21 తేదిలలో కార్యలాభం, స్త్రీలతోనూ ఆప్తులతోనూ విందు, వినోదము; శుభవార్త.

### * రోహిణి [ఓ, వా, వీ, వూ] *

ఈ వారము ఎక్కువ శ్రమకలిగే పనులు చేయవలసివస్తుంది. ఆర్థికస్థితి ఏమంత తృప్తికరంగా వుండదు. గృహకలతలవల్ల మనస్సునకు అశాంతి కలుగుతుంది. ఆరోగ్యము చెడవచ్చు. కోర్టువ్యవహారములు వాయిదా పడుతవి. వర్తకులకు అధిక శ్రమ 15,16,17 తేదీలలో ఉద్యోగస్తులకు ఒత్తిడి. 19 న అనారోగ్యము; ఆపైని మెరుగుగా వుంటుంది.

### * మృగశిర [వే, వో, కా, కీ] *

ఈ వారము మీకు అంతయోగముకాదు. మొదట్లోనిరాశగావున్నప్పటికీ క్రమేణామిత్రసహాయంవల్ల కార్యలాభం పొంది సంతృప్తి పడుతారు. ఉద్యోగస్తులకు అధికంగా ఒత్తిడి; వ్యాపారస్తులకు మాంద్యము. 15,16,17 తేది లలో గృహకలతలు, మనోవ్యథ 18,19,20, 21 ప్రయాణము, మిత్రసహాయం, కార్యసిద్ధి.

### * ఆరుద్ర [కూ, ఖ, ఙ, ఛ] *

ఈ వారము ఖర్చులు ఎక్కువ, తలపెట్టిన పనులకు ఆటంకములు, గృహకలతలు వీటివల్ల మనోవ్యథ ఉంటుంది. అయినప్పటికీ సజ్జనసావాసమువల్ల, దివ్యజ్ఞానదీపికవల్ల మనశ్శాంతి కలుగుతుంది. ఉద్యోగస్తులు కొంత కష్టపడినమీదట మేలు పొందుతారు. 15, 16, 17 కార్యసాధనలో జాప్యము, అశాంతి. ఆపైని చిత్తశాంతి, స్వల్పలాభము.

### * పునర్వసు [కే, కో, హ, హి] *

ఈ వారం కార్యభారం ఎక్కువ. బంధువులరాకవల్ల ఖర్చులు అధికమౌతవి. ధనలోపమువల్ల అస్థిమితము కలుగుతుంది. కోర్టువ్యవహారాలు కొంతవరకూ అనుకూలంగా వుంటాయి. ఉద్యోగస్తులకు శ్రమ; వ్యాపారస్తులకు ఆందోళన. వ్యవహారముపట్ల స్త్రీలతో వివాదము. విద్యార్థులకు చదువుపై అశ్రద్ధ. 15, 16, 17 కార్యభారమువల్ల శ్రమ. 19 న ఆరోగ్యభంగము. 20,21 స్వల్పకార్యానుకూలత, కొయ్యబొమ్మలవ్యాపారస్తులకులాభం.

**డి. నరసింగరావు**

### * పుష్యమి [హూ, హే, హో, డా] *

ఈ వారం చాలా ఉత్సాహంగా మొదలుపెట్టిన పనులు నెరవేరడానికి ఎక్కువ ఆటంకాలు కలుగుతాయి. మీ రాబడి సరిపడనందున కుటుంబములో కలతలు ఏర్పడి కష్టపడతారు. యంత్రములవల్లగాని, అగ్నివల్లగాని ప్రమాదము ఉంది; జాగ్రత్తవల్ల తప్పవచ్చును. ఉద్యోగస్తులు అధికారులచే మాటపడవలసి ఉంటుంది. ఇనుము, రంగులు వ్యాపారస్తులకు లాభం. 15, 16, 17 కార్యభంగము. 19 న కలతలు,20, 21 ఊరట.

### * ఆశ్లేష [డి, డూ, డే, డో] *

ఈ వారము మీబుద్ధిని ఉపయోగించి చేసే ప్రయత్నములు నెరవేరతాయి. అధికారులు ఆదరిస్తారు. ఆదాయం బాగుంటుంది. ప్రయాణమువల్ల నూతనమిత్రలాభము శుభకార్యనిశ్చయము. ఉద్యోగస్తులకు హోదా ఎక్కువవుతుంది. కవులను సన్మానిస్తారు. శిల్పులకు, చిత్రకారులకు, వైద్యులకు మేలుకాలం. 15, 16, 17 అధికఖర్చులు, ప్రయాసము. 18, 19 20,21 ప్రయాణం, మిత్రలాభం, కార్యసిద్ధి. నటీనటులకు యోగం.

### * మఖ [మా, మీ, మూ, మే] *

ఈ వారము మీకు మంచియోగము. శాస్త్రజ్ఞులవల్ల నూతనవిషయాలు తెలుసుకుంటారు. కోర్టువ్యవహారాల్లో అనుకూలం. ఆర్థిక స్థితి బాగుంటుంది. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. న్యాయవాదులకూ, పండితులకూ, కళాకారులకూ యోగం. 15,16, 17 కార్యాచరణలో శ్రమ, ఆపైని కార్యానుకూలత, పండితసాంగత్యము, ధనయోగము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) * [మో, టా, టీ, టూ]

ఈ వారము మీ ప్రయత్నములు నెరవేరతాయి. ఆప్తులక్షేమం తెలుస్తుంది. వినోదములలో పాల్గొంటారు. నూలు,బట్టలవ్యాపారస్తులకు లాభం. 15, 16, 17 కార్యాచరణలో తిప్పట, అలసట. ఆపైని కార్యసిద్ధి, లకుయోగము, శుభకార్యచింత. కళాకారు ధన, కవులకు, నటీనటులకు యోగము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) * [టే, టో, పా, పీ]

ఈ వారము యత్నకార్యములు సిద్ధిస్తాయి. ధనాదాయము బాగుంటుంది. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత ఉంటుంది. వాహనయోగం ప్రబలంగా వుంది. పిల్లలశుభకార్యాలోచనలు ఫలిస్తాయి. ఇంట్లో పాడి, సంపద బాగుంటవి. వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 15,16,17 తిప్పట, శ్రమ. 18, 19, 20, 21 ప్రయాణము, కార్యసిద్ధి, విందుభోజనము, ధనలాభము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారం పితృవర్గమునుండి సకాలంలో సాయం రానందున కార్యాచరణలో ఆటంకాలు, ఇంట్లో అసంతృప్తికలుగుతాయి. ఆరోగ్యంసరిగావుండదు; వెంటనే శ్రద్ధతీసుకోండి. వర్తకులకు ఆందోళన; ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. 16, 17, 18 కార్యభంగం. శ్రమ, అశాంతి. 19,20, 21పితృసహాయం, లాభం.

### * చిత్త [పే, పో, రా, రీ] *

ఈ వారం మీరు తలపెట్టేపనులకు ఆటంకాలు కల్గినప్పటికీ వారాంతమునకు మిత్రసహాయమువల్ల కార్యసిద్ధి పొందుతారు. అనుకున్న సొమ్ము చేతికిరాదు. వర్తకులకు మొదట్లో అననుకూలత, వారాంతమునలాభం.

15, 16, 17 ఆర్థికలోపము, కార్యభంగం. 18, 19, 20, 21 మిత్రసహాయం, కార్యసిద్ధి. విచిత్ర వస్తుసంగ్రహణము, అన్యదేశస్థులతో పరిచయము.

## * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము మీకు మిశ్రమ యోగము. అనుకున్నట్టుగా పనులు జరగవు. సహాయము లభించదు. అవసరములు తీరక వేదన పొందినప్పటికీ ఓర్పుతో కార్యసాధనకు ప్రయత్నిస్తారు. దైవము పైనమ్మకవల్ల ఆత్మశాంతి పొందుతారు. వర్తకులకు మొదట్లో త్రిప్పట, ఆశాభంగము, వారాంతంలో లాభం. 15, 16, 17 త్రిప్పట, కార్యభంగము, శ్రమ, 18, 19, 20, 21 పుణ్యపురుషుల సాంగత్యం, శాంతి, లాభము.

## *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత కార్యభారమువల్ల శ్రమ. కోర్టువ్యవహారాలు అనుకూలముగావున్ననూ, కొత్తవి మరికొన్ని తలెత్తుతాయి. వివాదాలవల్ల మనోవ్యథ. భార్యకు అనారోగ్యము. 15, 16, 17 కార్యభంగము, వివాదము, అనారోగ్యము. 18 వ గెలుపు. 19, 20, 21 త్రిప్పట, కార్యానుకూలత. శత్రతో చిత్తరువులు చేయువారికి లాభము. వర్తకులకు శ్రమతో కూడిన లాభం.

## *అనూరాధ [నా, నీ, నూ, నే]*

ఈవారము ఎంతప్రయత్నించినా కార్యసాధనలో ఫలముండదు. అయినప్పటికీ పట్టుదలతో యత్నించడంమానరు. అదే మంచిది. క్రమేణా చిక్కులనువిప్పుకొని మేలుపొందుతారు. జ్ఞాతిసహాయంవల్ల ఒడిదుడుకులు సర్దుబాటు అవుతవి. జాగ్రత్తగా వుంటే ప్రమాదములు తప్పవచ్చును. ఖనిజ, లోహ వ్యాపారస్థులకులాభము. 15, 16, 17 త్రిప్పట, కార్యభంగము, మనోవ్యథ, 19, 20, 21 సహాయం, కార్యానుకూలత, శుభయోగము.

## *జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]*

ఈ వారము మీకు యోగదాయకము వుంటుంది. మీ పలుకుబడిచే కార్యసాధన పొందుతారు. అధికారుల సహాయము, కొత్తవారితో పరిచయము కలుగుతవి. బంధువుల క్షేమవార్తగాని, శుభవార్తగాని వింటారు. మందుల వ్యాపారస్థులకు, గణితశాస్త్రజ్ఞులకు, చిత్రకారులకు, కవులకు లాభము. 15, 16, 17 కార్యభారము, త్రిప్పట, అలసట. 18, 19, 20, 21 తేదీలలో కార్యసిద్ధి, శుభవార్త.

## *మూల [యే, యో, బా, బీ]*

ఈ వారము [illegible] కాలం. శాంతితో బాటు వరోదా కూడా పెరుగుతుంది. ఉద్యోగస్థులకు మేలు. వర్తకులకు లాభం. ఉపాధ్యాయులకూ, న్యాయవాదులకూ, పండితులకూ యోగకాలము. కోర్టువ్యవహారాలలో మీకు అనుకూలం ఉంటుంది. 15, 16, 17 ఇతరుల కొరకు కార్యాచరణలో త్రిప్పట, సౌఖ్యలోపము. 18, 19, 20, 21 కార్యానుకూలత. ధనలాభముపిల్లల క్షేమాభివృద్ధి, యత్నలాభం.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, ఢ]*

ఈవారము మీ ప్రయత్నాలు చాలవరకూ ఫలిస్తాయి. ఆర్థికస్థితి తృప్తికరముగా వుంటుంది. వినోదములలో పాల్గొంటారు. నూలు, బట్టలు, వెండి వర్తకులకు లాభము. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. 15, 16, 17 తిప్పట, అసౌఖ్యము. 18, 19, 20, 21 ధనలాభము, కార్యసిద్ధి. ప్రయాణసూచన. ఉద్యోగస్థులకు తృప్తికరముగా వుంటుంది.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారం మీకు యోగదాయకం, మీ అవసరాలకు మించిన ధనాదాయము కలుగుటచే తృప్తిగాఉంటుంది. పరోపకార యత్నాలు నెరవేరుతవి. వాహనయోగం ఉంది. కవులు నూతనరచనలు మొదలుపెడతారు. ఖరీదైనవస్తువులక్రయ విక్రయములలో వర్తకులకులాభం. ఉద్యోగస్థుల ఆదాయముతోపాటు హోదా కూడా పెరుగుతుంది. 15, 16, 17, పనుల ఒత్తిడివల్ల త్రిప్పట. 18, 19, 20, 21 ప్రయాణము, కార్యలాభము, బంధు సమాగమము, విందుభోజనము.

## *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము మీ ప్రయత్నములకు చాలా ఆటంకాలు కలుగతవి. ధనమున్నప్పటికీ సమయానికి తగ్గట్టు ఖర్చులకు వీలుపడక ఇబ్బంది పడతారు. ఉద్యోగస్థులకు కొత్త తొందరలు వస్తాయి. వర్తకులకు అసంతృప్తి. అధికారయుక్తమైనవృత్తులలో నున్నవారి హోదా పెరుగుతుంది. 15, 16, 17 ఆటంకములు, ఇబ్బంది. 18, 19, 20, 21 ప్రయాణం, పితృవర్గసహాయము, కార్యలాభము.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీరు అనుకున్నట్టుగా సౌమ్య కలిసిరాదు. మీ ఆప్తులే మీ కార్యాలకు విఘ్నాలు తలపెట్టి మీకు చికాకు కలుగచేస్తారు. అయినప్పటికీ మీ ప్రజ్ఞవల్లను, మిత్రసహాయంవల్లను వారము రెండవ భాగములో కార్యసిద్ధిని పొందుతారు. వ్యాపారస్థులకు మొదట్లో ఆశాభంగం, వారాంతమున లాభము. ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడితో బాటు ఆదరణకూడా వుంటుంది. 16, 17 శరీరాయాసం ఆశాభంగం. అధిక ఖర్చులు, ప్రయాణము. 18, 19, 20, 21 మిత్ర సహాయము, కార్యసిద్ధి.

## *శతభిషం [గో, సా, సీ, సూ] *

ఈ వారము మీకు మిశ్రమ యోగం. మొదలుపెట్టిన పనులు నెరవేరవు. అనుకున్న సహాయం కలిసిరాదు. గృహావసరములుతీరక కలతలు వస్తాయి. అయినప్పటికీ దైవకృపచే యెన్ని కష్టములైనా గడుస్తాయన్న నమ్మకతో ప్రయత్నములు మానరు. 15, 16, 17 వర్తకులకు త్రిప్పట, ఆశాభంగం, వారాంతమందు లాభము. 18, 19, 20, 21 ఉద్యోగస్థులకు అనుకూలము. తీర్థయాత్రల గురించి చేసే ఆలోచనలు ఫలిస్తాయి.

## * పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. నిలకడలేని ఆలోచనలు కలుగుతాయి. ప్రతిపని వాయిదా పడడమే గాని త్వరగా కార్యసిద్ధి పొందడం జరుగదు. స్త్రీలతో వివాదాలు కలిగి ఖేదపడతారు. కోర్టువ్యవహారములు అనుకూలిస్తవి. ఇంట్లో నున్నవారి ఆరోగ్యము చెడవచ్చు. శ్రమపడి చేసేపనులు ఫలిస్తాయి. 15, 16 17 ఆర్థిక ఒత్తిడి, కార్యభారముచే త్రిప్పట, శ్రమ, ఆరోగ్యచింత. 19 వ వివాదములు. 20 వ స్వల్పలాభము.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా] *

మీకు సాహసము ఎక్కువ. అలవికాని పనులు చొరవగా మీద వేసుకుంటారు. కార్యసాధనలో ఎన్నికష్టములు ఎదురైననూ తుదకు సాధించి తీరుతారు. ఉద్యోగస్థులకు అధికారుల చురుకుమాటలచే మనోవ్యధ సమయానికి సౌమ్యచిక్కక చికాకులు ఎక్కువగావుంటాయి. యంత్రములవల్లగాని, ఆయుధములవల్లగాని ప్రమాదముండి జాగ్రత్త పడండి. ఇంజనీయర్లకూ, పోలీసుశాఖలో ఉద్యోగులకు మేలుగా వుంటుంది. 15, 16, 17 త్రిప్పట, శ్రమ, అశాంతి. 19 ప్రమాదభయం. 20, 21 ఇనుప వర్తకులకు లాభము.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈవారం మీకు యోగదాయకంగా వుంటుంది. వ్యవహారదక్షతగలవారి సాయంతో కార్యసిద్ధి పొందుతారు. డబ్బుచిక్కులు, కుటుంబచిక్కులు చాలావరకు తీరిపోతవి. మిత్రులను కలుసుకొనుట, శుభవార్త వినుట వంటి మంచిఫలితాలు కలుగుతాయి. ఇంట్లో నున్నవారికి గతవారము కలిగిన అనారోగ్యం నయమవుతుంది. 15, 16, 17 ప్రయాణమువల్ల శ్రమ, అధికఖర్చులు. ఆప్తైన మిత్రలాభము, కార్యానుకూలత, విజ్ఞానాభివృద్ధి. కవులకు, చిత్రకారులకు, కళాకారులకు, నటీనటులకు మంచికాలము. 

# చిన్ననాటి సరదాలు

సంక్రాంతి మన పండగలలో ముఖ్యమైనది. ఇది ఆడపిల్లల పండుగ అని చెప్పినా చెప్పవచ్చు. గొబ్బిళ్ళుచేయడం, బొమ్మలు పెట్టుకోవడం, మొదలైన పనులు చాలా సరదాగా వుంటాయి. నా చిన్నప్పటి సంక్రాంతి ముచ్చట్లు తలుచుకుంటే నాకు నవ్వువస్తుంది.

సంక్రాంతి పండగ చలికాలంలోనే వస్తుంది. ధనుర్మాసం ప్రారంభం కాగానే ఆడపిల్లలు గొబ్బిళ్ళుపెటడం మొదలు పెడతారు. నేను ఎంత చలిగావున్నా తెల్లవారు గట్ల నాలుగంటలకే లేచి అవుపేడకు బయలు దేరేదాన్ని. అంతకు ముందురోజు సాయంత్రం బడిలో ఎవరెవరు తెల్లవారగట్ల పేడకు వసారో తెలుసుకోడానికి అందరం కూడబలుక్కునేవాళ్ళం. నాలుగంటలయేసరికి స్నేహితురాలు వచ్చి నన్ను లేపేది, అమ్మ, నాన్న ఇంతచలిలో ఎక్కడికి వెడతావే నోరుమూసుకు పడుకో అని కోప్పడేవాళ్ళు. కాని నిమ్మళంగాలేచి బయటకు జారుకునే దాన్ని. చలి గజగజలాడిస్తుంటే రెండు చేతులు పెడచుట్టూ వేసుకొని అవుపేడకు వెళ్ళేవాళ్ళం. అవుపేడ ఇచ్చేవాళ్ళు ఎంత విసుక్కుంటున్నా లెక్కపెట్టక ఒకరికంటె ఒకరు ఎక్కువపేడ సంపాదించాలని తాపత్రయ పడేవాళ్ళం. ఇలాగ అవుపేడ తెచ్చి తెల్లతెల్లవారుతుండగా నా కెక్కువ పేడ వచ్చిందంటే నాకెక్కువ వచ్చిందని పంతాలాడుకుంటూ ఎవరి ఇళ్ళకు వాళ్ళం చేరేవాళ్ళం. వెంటనే పండుతోముకొని గొబ్బిళ్ళుచేయడం మొదలుపెట్టేదాన్ని. గుమ్మడి పువ్వులూ అవీ తెచ్చి, ఇంట్లోకి వెళ్ళి అమ్మ చూడకుండా పసుపు కుంకుమ తెచ్చి గొబ్బెమ్మలకు పెట్టేదాన్ని. పంచదార నైవేద్యం పెట్టేదాన్ని. ప్రతి రోజూ రాత్రి అక్కను వీధి గుమ్మంలో మంచిమంచి ముగులు పెట్టమని వేధించే దాన్ని. ఎందుకంటే ఆమరునాడు ఆముగు మీద గొబ్బెమ్మలు పెటడానికి. రోజూ రాత్రి అక్క ముగుపెట్టేవరకు పడుకునే దాన్ని కాదు. లాంతరు వెలిగించి అది పట్టుకొని చూపిస్తుంటే అక్క ముగుపెట్టేది. గొబ్బిళ్ళుచేసి వాటిని వీధిలో పెట్టేవరకు కాఫీకూడా త్రాగేదాన్ని కాదు. అమ్మ లోపలనుంచి కాఫీ త్రాగుదువుగాని రావే అని ఎన్ని కేకలువేస్తున్నా వినిపించుకునేదాన్ని కాదు.

నేనెపుడైనా అల్లరిచేస్తే మా అన్నయ్య



గొబ్బిళ్ళు

ఫోటో: పి. కృష్ణకుమార్

గొబ్బెమ్మలు తొక్కేస్తాను!' అని ఏడిపించే వాడు. ఇక బడికి వెళ్ళినప్పటినుంచీ ఇంట్లో గొబ్బెమ్మలు ఎవరైనా పాడుచేసేస్తున్నారేమోనని బెంగగా వుండేది. ఇంటికి రాగానే ఆగొబ్బెమ్మలు తీసి గోడకు తట్టేదాన్ని. రోజూ ఎన్నెన్ని పిడకలు అవుతున్నాయో లెక్కపెట్టుకునేదాన్ని. బడికి వెళ్ళిన తరువాత నాకు ఇన్నిపిడకలు అయాయని అందరం ఒకరితో ఒకరు చెప్పుకునేవాళ్ళం.

ఇంక పండగొబ్బెమ్మలు పెట్టుకునేందుకు చేసే హడావిడి ఇంతాఅంతాకాదు. ప్రతి రోజూ అమ్మను పండగొబ్బి పెట్టుకుంటానని అడిగేదాన్ని. పండగొబ్బి పెట్టుకునేరోజున రెండుపూటలూ. బడి మానేసి పువ్వులు, పేడా సంపాదించి ఒక చోట పెట్టుకునే దాన్ని. మధ్యాహ్నం ఒంటిగంట అవగానే అమ్మచేత తల దువ్వించుకుని క్రొత్తబట్టలు కట్టుకొని, కుంకుమభరిణ పట్టుకొని స్నేహితురాండ్రందరిని పేరంటం పిలిచేదాన్ని. ఇంటికివచ్చి గొబ్బిచేసి దానినిండా పూలు గుచ్చి, పీటకు పసుపురాసి దానిమీద గొబ్బెమ్మనుపెట్టి ఉంచేదాన్ని. నాన్నని బేడా, లేక పావలా అడిగి అరటిపండ్లు కొని ముక్కలుచేసి, అమ్మను శెనగపప్పు తాలించిపెట్టమని అది చేయించి ఉంచేదాన్ని. సాయంత్రం నాలుగు గంటలయేటప్పటికి పేరంటానికి పిలలు ఇంకా రాలేదేమో అని వీధిలోంచి ఇంట్లోకి, ఇంట్లోంచి వీధిలోకి పదిసార్లు తిరిగేదాన్ని. ఇక పిల్లలందరూ వచ్చిన తరువాత అందరిని చాపమీద కూర్చోబెట్టి వాళ్ళకు బొట్టు పెట్టి పసుపురాసే దాన్ని. ఈపనులు చేస్తుంటే నేనేదో ఘన కార్యం చేస్తున్నంత గర్వం కలిగేది. తరువాత గొబ్బెమ్మకు పూజచేసి నైవేద్యం పెట్టి, గొబ్బిచుట్టూ పాటలు పాడే వాళ్ళం. అంతా అయిన తరువాత, ఆ గొబ్బెమ్మను తీసుకొనివెళ్ళి రెండు చేతులతోనూ తట్టలేక తట్టలేక గోడకు తట్టేదాన్ని. ఎవ్వరినీ నాపిడకలు ముట్టుకోనిచ్చేదాన్ని కాదు. పిడకలు ఎండినతరువాత వాటన్నిటినీ దండగా గుచ్చేదాన్ని. ఈవిధంగా ఆ నెల రోజులూ నేనుచేసే హడావిడి ఇంతాఅంతా కాదు. రాత్రిళ్ళు నిద్రే ఉండేది కాదు. అవన్నీ తలచుకుంటుంటే ఇప్పుడు నవ్వు వస్తుంది. ఆ సరదాలు ఇప్పుడు లేవుగదా అని విచారం కలుగుతుంది!

ఇ. మంగతాయారు, ఏలూరు.




# నా కలం స్నేహితులు

కుమారి కే. లీలావతి

ఆమధ్య ఏదో పత్రికలో కలం స్నేహితులు కావాలనేవారి శీర్షిక క్రింద ప్రమాద వశాత్తూ నాపేరు అచ్చయి కూర్చుంది. మొదట ఈ 'కలం స్నేహం' అన్నది అంత ప్రమాదకరమైనది కాదను కున్నాను. పైగా అన్నయ్యారావు పేరు ఆశీర్షిక క్రింద అచ్చయి రెన్నెల్లయినా ఓ కలంస్నేహితుడూ అన్నని పలకరించిన పాపాన పోలేదు. అన్నయ్య ఆడపా తడపా ఎవరెవరికో ఉత్తరాలురాసి జవాబులు రాలేదని ఏడుస్తుండటం నేను కళ్లారా చూచానారు. మరి అన్నయ్యకంటే ఎందులో గొప్పదాన్ని నాపైనే ప్రత్యేకంగా ఉత్తరాల దుమారం విరుచుకు పడుతుందని ఊహించను? అయినా ఏనాడూ ఊహలు నిజమై ఏడుస్తున్నాయి గనక! పోస్టు-మాన్ యింటి దగ్గరకు వస్తేసరి అన్నయ్య గబుక్కున లేచి ఉత్తరాలందు కొని వాటికేసి తేరిపారజూచి తెగబారెడు నిట్టూర్పు విడిచి వాటిని నాచేతులో వడేసి వాడు "అన్నీ నీకే! వధవ్వి" అని వణుక్కుంటూ—అప్పుడు అన్నయ్య అవస్థ చూచి నేను నవ్వేదాన్ని అనుకోండి. తర్వాత ఈ కలం స్నేహితుల్ని వదిలించుకో లేక అవస్థపడుతూ వుంటే నవ్వేవంతు అన్నయ్యకు బదిలీ అయింది.

అలా ఉత్తరాలు రాసినవారిలో 99.999% మగవాళ్ళు. వారి ప్రథమ ఉత్తరాలని చదువుతూవుంటే అతి సామాన్యులుగా జాలి వేసి కలంస్నేహం లభించటం ఏ పూర్వ పుణ్య ఫలితమోగదా అనుకునేదాన్ని (అంచేతే అన్నయ్యని పాపాలభాయుడని పిలిచేదాన్ని కూడా) వారు ఎందరెందరో ఆడవాళ్ళకు ఉత్తరాలు రాశారుట. (చాలా మటుకు 'కుమారీ' మణులకే ననుకుంటాను), కాని ఒకారూ జవాబివ్వలేదుట, ప్పాపం! అనుకున్నాను నేను. తోటి సోదరీమణుల మీద కించిత్ కోపంగూడా అప్పుడు అజ్ఞానవశాత్తూ కలిగిందనుకొంటాను. కొందరు బుద్ధిమంతులు జవాబుకోసం తమ అడ్రెసు రాసినకవరు గూడా పంపించారు. జవాబివ్వకుంటే వాకిపుట్టి ఏదో మునిగిపోయేటట్లూ—నేనేదో వాళ్ళని ఉద్ధరించేది చాలా ఉన్నట్లూ రాశారు. నిజం చెప్పొద్దూ నాలోబోల్డు దయ పుట్టుకొచ్చిందంటే నమ్మండి! ఆ దయవల్ల కల్గవలిన ఓపిక తెచ్చుకొని ఒక్కటే వదిలెయ్యకుండా సీరియల్ నంబర్లు వేసుకొని మరీ జవాబిచ్చాను ఆ ఉత్తరాలకు. మరి మూడ్రోజులకే ఉత్తరాలుతిరిగే పోసులుపడ్డాయి. ఆ ఉత్తరాల నిండా నేనో ఆదర్శ స్త్రీమూర్తినయి కూర్చున్నాను. "ఆహా! సోదరీ! నేను ఆడవాళ్ళకి చాలామందికి ఉత్తరాలురాసి విసిగిపోయాను. ఛీ! ఈ ఆడాళ్ళ 'సమాన హక్కులు' అంటూ గోలెట్టడమే కాని, మొగాడికి ఉత్తరం రాయటానికి గూడా భయపడే వారను కున్నాను కానీ మీ ఉత్తరం నా అయిడియాను తలక్రిందులు చేసింది. ఏమయినా నీలాటి ఆ చరణీల లుండటం స్త్రీ జాతికే గాక—మొత్తం మానవజాతికే గర్వకారణం"



"మా కాలంలో ఇన్ని రకాలు లేవమ్మా!!!"

చిత్రకారుడు: వి. వెంకటేశ్వర్లు.

ఎట్టి పుచ్చుసొరకాయలు కోసిపారేశాడు మాచ్‌ఖండ్‌నుండి ఒక మహానుభావుడు. ఈలా రకరకాలుగా పేజీలకు పేజీలు రాసి పారేశారు నిర్లక్ష్యంగా ఈ కలం స్నేహితులు.

అన్నింటినిండా పొగడ్తలు విధిగా వున్నాయి. వాటిలోకొన్ని చదువుతూ పక్కలు విరిగేలా నవ్వేశాను. పనికి పాట్లు పడుతున్న అమ్మమ్మ గబుక్కున లేచి "ఇదేవి పోయేకాలం నా తల్లీ! ఆడబిడ్డకి యింత విరగబాటా? నవ్వే ఆడదాన్ని ఏడ్చేమగవాణ్ణీ అవ్వ... మా కాలంలో ఎప్పుడైనా చూచామా?" అని గదిమింది.

"అదేమిటమ్మా! మీ కాలంలో మగవాళ్లంతా నవ్వుతూ ఆడాళ్ళంతా ఏడుస్తూ వుండేవారా?" అనడిగాను. అమ్మమ్మమరోమారు నోరు నొక్కుకొని "అవ్వ...అవ్వ... మా కాలంలో ఎవరైనా యిలా ఎదురు జవాబు చెప్పేవారా? చెప్పినది చెప్పినట్లు చేసేవారు గానీ..." అని మళ్లీ పనికి పాట్లు పడింది. తిరిగి నేను ఉత్తరాలలో తల దూర్చాను. ఓ మైనూరబ్బాయి రాశాడు. చూడండి: "అహ్హా! చెల్లీ! పాల వెల్లీ! బంగారుతల్లీ! నీ ఉత్తరం చదువుతోంటే ఆనందంతో గుండె ఆగిపోయి అరడజను గ్లాసుల నీరు (ఏ సైజువో చెప్పలేదనుకోండి) అమాంతం తాగేశాననుకో!..." అనియింకా ఏవేవిటో కలలు ఉత్తరం నిండా కనిపారేసి ఉత్తరాన్ని సెంటులో ముంచి మరీ పోస్టుచేశాడు. ఆ సెంటువాసన మూణ్ణాళ్ల తర్వాతగానీ మాయింటినుండి నిష్క్రమించలేదు. మరొకరు కట్నాల సమస్యని గురించీ-స్త్రీ పురుష సమానత్వాన్ని గురించి బోల్డు బోల్డు ఘాటుగా రాసి సదరు వ్యాసాల్ని ఏ పత్రికా అచ్చెయ్య లేదని-ఆ పత్రికల పక్షపాతం గురించి మరో వ్యాసం రాసి-మొత్తం యిరవై పేజీల కాగితాల బొత్తిని నాకేసి గురిచూసి విసిరాడు మరొక భావకవో లేక అలుడుకవో రాశాడు! "అహ్హా... ఫ్రెండో...అందింది అందాల ఆనందాల అమ్మాయి ఉత్తరం..." ఈ భావకవిని మెచ్చుకుంటూ అన్నయ్య ఉత్తరం ఆ అబ్బాయికి రాశాను కానీ అన్నయ్యకు జవాబే రాలేదు. 'ఆదర్శాలు ఆదర్శాలు' అంటూ ఈ ఉత్తరాల్లో కొందరు రాశారు కానీ మొత్తం మీద ఈ ఉత్తరాలు రాసిన వారందరికి వెకిలిచేష్టలు తప్ప మర్యాద తెలీదనిపించింది. అయినా-మొదట్లో ఈ కలం నేస్తాల వ్యవహారం కాలక్షేపానికేం కొదవ లేకుండా జరిగిపోయిందనుకోండి.

అట్టే కాలం జరక్కుముందే ఉత్తరాలలో మోహం మొత్తటం ఆరంభమయింది. ఆ అబ్బాయిల రిప్లైలలో చాలామటుకూ నన్ను గురించిన పొగడ్తలే మొదలయ్యాయి. కొందరాసరికే ఫోటోలు పంపి "యిహ మీ ఫోటో పంపండి" అని అప్పులవాళ్ళలాగా అడిగటం మొదలెట్టారు. అందరికీ 'నేను ఫోటో పంపను' అని ఖచ్చితంగా రాశాను. అయినా వాళ్లు అడగటం మానెయ్యలేదు. ఉత్తరాల నిండా నా ఫోటో గురించే రాసేవారు. మరికొందరు 'మీరు రాసిన ఉత్తరంలో ఫలాని వాక్యాన్ని నాజన్మలో మరచిపోలేను. దాన్ని యించక్కా డైరీలో రాసుకొన్నాను. చూచారూ! ఈపని మంచిదేనటండీ?' అని తిరిగి నా సలహా అడిగేవారు. వీరి అతివినయాన్ని చూస్తుంటే చిన్నయసూరిగారు రాసిన నీతి చంద్రికలోని పాత్రలు జ్ఞాపకం వస్తాయి. అదేపనిగా ఫోటోలు అడగటం-జవాబివ్వటం కాస్త ఆలస్యమైతే రాంభాణాల్లా నాలుగైదు ఉత్తరాల్ని వెంట తరమటం-దచ్చు పొగడ్తలూ-ఈ అతివినయాలూ చూస్తూంటే-తెరవెనక ఏవో ధూర్త లక్షణాలు పోరాడటం మొదలెట్టాయి.

ఓ నాడు ఓ సినిమాపత్రిక బుక్‌పోస్టులో వచ్చింది మా యింటికెన్నడు సినిమా పత్రికలని తెప్పించం! అయినా విప్పిచూచాను. అందులో 'ప్రశ్నలూ—జవాబులూ'లో కొండొకచో నా పేరు సాక్షాత్కరించింది. ఆశ్చర్యంతో ఆ ప్రశ్న చదివాను: "ఫలాని సినిమాలో ఫలానినటి ఫలానిపాట పాడే సమయంలో నల్లచారల తెల్లజాకెట్ వేసుకుందని నేనూ, పచ్చచారల ఎఱ్ఱజాకెట్ వేసుకుందని నా స్నేహితురాలూ వాదించుకుంటున్నాం. మీ రెవరితో ఏకీభవిస్తారు ఎడిటర్ జీ!" నాకు ముచ్చెమటలు పోశాయి. హారోం! హర! ఆ సినిమాను నేను చూచిన పాపాన పోనూలేదు! అలాంటిప్రశ్నలు ఆ పత్రికకే గాదు, దేనికీ పంపనూ లేదు! ఇదేవిటే? నా పేరుతో పడటంఏవిటి? అని ఆశ్చర్యపడుతూండగా కొండొకచో ఓ చిన్ననోట్ అవుపించింది! ఆ పని చేసింది ఓ కలంస్నేహితుడు! తన పేరుతో ఎన్ని ప్రశ్నలు సదరు పత్రికకు పంపినా ఒకటీ పడలేదుట. అందుకని నా పేరుతో లాటరీ వేయగానే అది అమాంతంపడి కూర్చుందనీ-నా పేరులో ఏవిటో ఆకర్షణవుందనీ-తనే పత్రికకాని పంపుతున్నాననీ రాశాడు. ఆ అబ్బాయికి ఇహమీదట ఆలాటిపని చేయకుమని మర్యాదగా ఉత్తరం రాశాను. అదేం వినిపించుకోక క్షమాపణకోరి తిరిగీ ఆ పనే చేయటం మొదలెట్టాడు. నేను ఉత్తరాలు రాయటం మానేశాను. కానీ ఆ అబ్బాయి వదలకుండా వరసని ఓ పది ఉత్తరాలు రాసి తర్వాత లాభంలేదని మానుకొన్నాడు. కానీ నా పేర ప్రశ్నలు పంపటం మాన లేదు. పత్రికల్ని నాకు పంపటం మానలేదు. ఓనాడు నాన్న వాటినిచూచి అగ్గిబరాటా అయి అసలుసంగతి తెలుసుకొని నన్నూ, అబ్బాయినీ, ఆ పత్రికా సంపాదకుడినీ కలిపి చెడామడా తిట్టి, ఆ అబ్బాయికీ, ఆ పత్రికా సంపాదకుడికీ మహోగ్రంగా ఉత్తరాలురాసిపారేశాడు. అంతటితో అబ్బాయి ప్రశ్నలు బంద్!

# ★ నా కలంస్నేహితులు ★

ఇహ కలంస్నేహితుల వ్యవహారం పాకం ముదిరి భరించలేక కొందరికి జవాబులివ్వటం మానేశాను. అయితే లాభమేమిటి? వాళ్లు మాత్రం వదల్లేదు. "హా! యిదెక్కడి పీడరా భగవాన్! దీనరక్షకా!...పరంధామా!" అని ఏడ్చి చచ్చేంతపనయింది నాకు ఊరుకోలేక ఉరేసుకున్నట్టు! చివరకు నాన్నగారి సలహా పుచ్చుకొని నేను మగాడిని తమాషాకు ఆడపిల్ల పేరుతో ఉత్తరాలు రాస్తున్నానని అందరకూ తెలియజేశాను. నాన్నగారి చిట్కా బాగా పనిచేసింది. ఆ ఉత్తరాలక్కూడా రిప్లైరాలేదు. ఎక్కడి దొంగలక్కడే గప్‌చిప్! ఇద్దరుమాత్రం వదల్లా! "అబ్బే! మీ ఉత్తరం చూస్తుంటే ఆడపిలవే అనిపిస్తోందే! నీ హాండ్ రైటింగ్ చూస్తే ఆడపిల్లవనే తేల్తోంది. అబద్ధం చెప్పి తప్పించుకుందామనుకున్నావా? అదేం కుదరదు" అని రాశారు, ఒకరు బొంబాయి నుండి మరొకరు మాచ్‌ఖండ్ నుండి. పోనీలే పాపం! అనుకొని వారికి జవాబిచ్చాను. అందులో ఓ తడవ బొంబాయి నేస్తం కొన్ని సెక్సునవలలు పంపించాడు. వాటిని చూడగానే నాన్నగారు హుంకరించారు. ఆ దెబ్బతో బొంబాయి అబ్బాయి కలంస్నేహం యావత్తూ ఆవిరైపోయింది. మాచ్‌ఖండ్ అబ్బాయి ఒక్కడూ మిగిలాడు: ఆ అబ్బాయి స్నేహం కాస్తా దారి తప్పి యువతలకివచ్చి "నాకు వివాహం కాలేదు. నాకు కట్నాలమీద అభిలాష లేదు. కులమతభేదాలతో పట్టింపులేదు. అయినా కులానికి నేను బ్రాహ్మడిని. నాకు వెనకాముందూ ఎవరూలేరు. ఫలాని బాంకులో నా బాలన్సు యింతవుంది" అని రాయటం మొదలెట్టాడు. అయిడియా మీ కర్థమయే వుంటుందనుకుంటా! నాకు పెద్ద చిరాకేసి 'వధువు కావాలి' అని మీ పైవివరాలిచ్చి ఏపత్రికలోనైనా ప్రకటన వేయించుకోమని రాశాను. "మీ పెళ్ళికి నా శుభాకాంక్షలు. మీ పెళ్లానికి నా అభినందనలు" అని చివరికలంనేస్తానికి చివరిగుడ్ బై చెప్పేశాను. దానితో ఆ అబ్బాయి మనసు మార్చుకొని క్షమించమని రెండుమూడుత్తరాలురాసి వూరుకున్నాడు. కానీ తిరిగి ఆ ప్రమాదంలో నేను యిరుక్కోదలచలేదు.

కానీ నేను చెప్పొచ్చేదేమిటంటే 'కలం స్నేహం' చెడ్డదనికాదు. చెడ్డదయితే నేను స్నేహంచెయ్యకనే పోదును. కానీ మామూలుగా స్నేహితులకుండవలసిన లక్షణాలు ఈ కలం స్నేహితులలో లోపించాయి. ఈకలం స్నేహితుల వ్యవహారం మొదట బాగానే వుంటుంది. ఆదర్శాలూ...ఆశయాలూ... మొదట బాగానేవుంటాయి. కానీ రాను రానూ ఆ ఆదర్శాలు ఆశయాలూ ఎంచేతో పల్చబడి పోతాయనుకొంటాను. (నాకు ఉత్తరాలు రాసినవారు చాలామంది మొగాళ్ళవటంచేత ఈ ముక్కలు మొగాళ్ళను గురించేసుమండీ!) అసభ్యంగా, అనవసరంగా—ఏం రాస్తున్నారో, ఎలారాస్తున్నారో వారికే తెలీకుండా ఏవో కలలు కంటూ రాస్తారు ఉత్తరాలు. వాటిని చదువుతూవుంటే అర్ధరాత్రివేళ మోహనరాగంలో మొరిగె గ్రామసింహగానంలోని మాధుర్యం గోచరిస్తుంది. నిజం చెబుతున్నానుసుమండీ! కాస్త కటువుగానే వుంటుంది. మరి చేదు మందు అయితేనే ఈవ్యాధికుదరొచ్చనే ఆశవుంది! చుట్టూ సంఘంలో పురుషుడు స్త్రీకంటె ఎంతో ఉచ్చస్థితిలోవున్నా-కాలేజీలలో అబ్బాయిలు—అమ్మాయిల్ని—అధ్వాన్నంగా ఏడిపిస్తున్నా — ఈ కలం స్నేహితులురాసే ఉత్తరాల్ని చూస్తే అవన్నీ పచ్చిఅబద్ధాలేమో ననిపిస్తుంది.

ఈకలంనేస్తాలు జిడ్డులాపట్టుకొని ఎంతకీ వదలరు. వీళ్ళని వదిలించుకునేసరికి తల ప్రాణం తోకకొస్తుంది. పాశ్చాత్యదేశాల్లో ఈలాకాదు. మొన్న నో అమెరికా ఫ్రెండుకూ నాకూ అభిప్రాయాలు బొత్తిగా కలవలేదు. అలాంటపుడు మా స్నేహం లాభప్రదంగా వుంటుందని తోచలా. అంచేత ఆ ఫ్రెండు నా అభిప్రాయాలకు సరిపోయే ఫ్రెండునొకరిని పరిచయంచేసి మిత్రుడుగానే ఉత్తరాలురాయటం మానేశాడు. పాశ్చాత్యనాగరికతా, సంస్కారమూ ఒంటికి పులుముకున్న ఈ కలం నేస్తాలకు ఈ మర్యాదలుమాత్రం అబ్బలా! ఇప్పుడు నాకు అమెరికాలో ఇద్దరు కలంనేస్తాల్ని సంపాదించిపెట్టాడు నాన్న. వారు ఖచ్చితంగా యిరవైరోజులకో ఉత్తరం రాస్తారు. ఉత్తరాలలో చెత్తా చెదారం ఏమీవుండదు. వాళ్ల దేశాన్నిగురించీ — ఆచార వ్యవహారాల్నిగురించి హాస్యంగారాస్తారు. వాళ్ల ఉత్తరాలలో ఒక్కవాక్యంలోని స్నేహభావం మన కలంస్నేహితుల ఉత్తరాలన్నీ వెదికినా అవుపించదు. ఒకటితర్వాత ఒకటి ఉత్తరాలవర్షం కురిపించటం, ఉత్తరాల నిండా చెత్త భావకవిత్వం పులమటం— ఫోటోలు ఫోటోలు అని గోలెత్తటం యివి తప్ప మన కలంస్నేహితులలో మంచిలక్షణాలేవి కానరావు. ఏమైనా ఈ కలం స్నేహితులు వారిపద్ధతులను మార్చుకోకుండా మొండిగా ప్రవర్తిస్తే వారు కలంనేస్తాలకు బదులు 'కలం యముళ్ళు'గా తయారౌతారు. ★

## కొత్తపోకడలు

[సి. ఉత్తర]

[సందర్భవరసకు పక్కపేజీలో బొమ్మ చూడండి]

(1) పొడవుగా, నాజూగ్గా ఉన్న వాళ్ళకు ఇది చాలా బాగుంటుంది.

(2) ఇది కాస్త బొద్దుగా ఉన్న వాళ్ళకైతే బాగుంటుంది. సన్నటివాళ్ళకైతే ఎముకలు కనిపిస్తూ వికారంగా ఉంటుంది. 'అప్‌డేట్' ఫాషన్‌లో మొదటిస్థానం దీనిదే అనవచ్చు.

(3) బొమ్మలోలా వంకీలు కత్తిరించి కుట్టుకోవాలి. వంకీలు చుట్టూ బట్టకి మ్యాచయ్యే రంగు దారంతో కాజా (బటన్‌హోల్) కుట్టుకోవాలి. కాజా కుట్టు కుట్టినదారం రంగులోనే చీర కూడా ఉంటే చాలా బాగుంటుంది.

(4) అంచులున్న గుడ్డతో ఇలా కుట్టుకొంటే బాగుంటుంది. ముప్ఫై ఏళ్ళలోపువాళ్ళకే ఇది అందంగా వుంటుంది

(5,6) ఈ రెండూ అద్దాలేసి కుట్టుకోవాలి. ఇదికూడా చాలాబాగా ఉంటుంది.

(7, 8) ఈ రెండూ కట్‌వర్కు చేసినవి. వళ్ళు కనిపించటం ఇష్టం లేకపోతే, బట్టకి మ్యాచయ్యే మరో రంగు బట వేసి కుట్టుకోవచ్చు.

(9) బొద్దుగా ఉన్న తెల్లటి తెలుపు వాళ్ళకిది చాలా అందంగా ఉంటుంది. దీనికి ముదురురంగుబట్టయితేబాగుంటుంది

(10) గ్లాస్కో, జార్జెట్ లాంటి పల్చటి గుడ్డయితే బాగుంటుంది దీనికి లైట్ కలర్సే అందం.

(11) దీనికి పాప్లిన్‌లాంటి దళసరి గుడ్డ వాడాలి.

(12) దీనికి వెనకభాగం, భుజాలదగ్గర కొంత ఒకరంగూ, మిగతాదంతా ఒక రంగూ వాడాలి (బొమ్మనిచూస్తే అర్థం అవుతుంది.) వెనకభాగానికి ఏరంగు వాడితే చీరకూడా అరంగులోనే ఉండాలి.

# ఫాషన్లు




సి. ఉత్తర

# ★ చంద్రలోకయాత్ర ★

(12-వ పేజీ తరువాయి)

ఉండడంవల్ల ఎంత జాగ్రత్త తీసుకున్నా పడడం మరీ కష్టతరంగా ఉంది. ఎలాగైతేనేం కొండ ఎక్కేసరికి మా ఎదురుగా అంతంలేని చదును నేల కనిపించింది. గాలిపల్చనవడంవల్ల సూర్యుడు శక్తి చూపిస్తున్నాడు. ఈ సూర్యకాంతిలో అక్కడక్కడ నేల మిలమిలా మెరుస్తున్నట్లు కనిపించేసరికి నా మనసులో అంతకుముందే నేలని నల్లరంగు లీలగా ఉన్నట్లు కనిపెట్టినప్పుడు కలిగిన కొన్ని ఊహలు బలవత్తరమైనాయి. ఇనుమడించిన ఉత్సాహంతో కొండదిగి మైదానంపైకి పరుగెత్తాను. నా వెనకనే లాల్, సింగుకూడా వచ్చారు. నేలపైభాగాన్ని జాగ్రత్తగా పరిశీలించాను. అక్కడక్కడతప్ప, మెరుస్తున్న నేలఎక్కువగా అగుపడలేదు. కాని నేలంతా జీలుగు బెండు మాదిరి, రంధ్రాలతో కప్పబడి ఉన్నట్లు గమనించాను. సింగూ లాలూ నా చర్యలేమీ చూడకుండా కనిపించినంతా ఫొటోలు తీసేస్తున్నారు వరసగా.

దాదాపు ఆ మైదానంమీద మూడుమైళ్ళు నడిచేసరికి మళ్ళీ కొండలు కనిపించాయి. ఇక్కడి కొండలు నేలలోంచి పొడుచుకొచ్చినట్లు కనపడ్డాయి. మాకు కనిపించినంతమట్టుకు నేలంతా ఒక మాదిరిగా ఉంది. మిట్ట ప్రదేశాలన్నీ సూదులు తేలి, నేలలోంచి పొడుచుకొచ్చిన రాళ్ళతోనూ, పల్లపు నేలంతా చదునుగా అక్కడక్కడ మెరుస్తూ చిన్న చిన్న రంధ్రాలతో కప్పబడి ఉన్నాయి. మేము మూడు గంటలు తిరిగేసరికల్లా సూర్యుడు పడమట దిక్కుకి వచ్చేశాడు. ఇంక రాత్రి, అపరిమితమైన చలీ ప్రారంభమౌతాయని తెలుసుకొని అతి త్వరగా రాకెట్ చేరుకున్నాము. భూమికన్నా వేగంగా చుట్టూ తిరగడంవల్ల భూమి చుట్టూకూడా తిరగడంవల్ల ఇక్కడి పగలు ఆరుగంటలకన్నా ఎక్కువుండదనీ, రాత్రి పదిగంటలదాకా ఉండవచ్చునీ అంచనా వేశాను.

రాకెట్ చేరగానే లాల్ రేడారు తిప్పి అప్పుడే మాకు చంద్రుడంటే విసుగు పుట్టినట్లు, తర్వాతి రోజు వీలైనన్ని ఫోటోలు తీసి సాయంత్రానికల్లా బయలుదేరి వచ్చేస్తున్నట్లూ చెప్పాడు. తలుపులూ అవీ బంధించేసుకుని భోజనానికి కూర్చున్నాము. కాఫీ కలుపుకొని తీసుకుందామని పంచదార సీసా ఈవలకి తీశాను. మేము రెండు మూడు సార్లు తలుపులు తెరవడం వల్ల వచ్చిన వేడికి పంచదార కరిగి, ఆ సమయంలో పీడనంకూడా లేకపోవడంవల్ల బిరడాగుండా ఇవతలికి రావడానికి ప్రయత్నించి, బిరడా రంధ్రాలగుండా పంచదార రాలేక నీరు మాత్రం ఆవిరి రూపాన్న వచ్చినట్లు చిన్నంగా సీసాలోని పంచదార తెల్లని పొడిగా మారిపోయి, బిరడాపైన తేమగా ఉంది. ఇది చూడగానే నా గుండె ఆగిపోయినంత పనైంది. ఎంత ఆపుదామనుకున్నా నోట్లోంచి ఒక కేక వెలువడింది. తమాయించుకుని ఆశ్చర్యంతో చూస్తున్న సింగుకీ, లాల్ కీ ఏదో సమాధానం చెప్పి, సోఫామీద మేను వాల్చి ఎప్పుడు తెల్లారుతుందా అని ఆత్రుతతో గడిపాను.

## 6

తెల్లతెలవారుతూండగానే లేచి త్వర త్వరగా తయారైపోయి సింగునీ లాల్ నీ లేపాను. వారు లేస్తూనే నా ముఖంలోని ఆవేదనని, ఉద్రేకాన్ని కనిపెట్టి ఏంజరిగిందని ఆత్రుతతో ప్రశ్నించారు. 'ఏంలేదు నేను ఇంకో అరగంటలో వస్తాను. ఈలోగా మీరు కూడా తయారవండి' అని చెప్పి, సుత్తీ, గొడ్డలి చేతితో పట్టుకొని ఇవతలికి వచ్చాను. ఇంకా సూర్యోదయం కాకపోయినా అప్పుడే వేడి మొదలుపెట్టినట్టుంది, రాత్రి చల్లదనానికి దాదాపు గట్టిపడిన బొగ్గుపులుసు గాలి కరిగిపోయి పొగలుపొగలుగా ఆకాశానికి లేస్తోంది. నేను అతివేగంగా చుట్టూవున్న కొండల్ని దాటి నిన్నటి చదునుప్రదేశాన్ని చేరి కొంచెం అనువుగానున్న చోట తవ్వడం మొదలుపెట్టాను. దాదాపు పదినిమిషాలు కష్టపడి ఒక పెద్ద పెళ్ళని పెళ్ళగించి పెద్ద పెద్ద అంగలతో రాకెట్ ని చేరాను. సింగూ, లాల్ తయారైపోయి నాతో మళ్ళీ క్రిందికి దిగారు. నేను తీసుకొచ్చిన పెళ్ళలో గొడ్డలి, సుత్తి ఉపయోగించి ఒక పెద్ద రంధ్రం తయారుచేశాను. అగ్గిపుల్ల ఒకటి బయట గీయగానే ఆరిపోయింది. అప్పుడు అగ్గిపెట్టెనీ, పుల్లనీ రంధ్రంలో దూర్చి అగ్గిపుల్లని వెలిగించాను. ఆరిపోదామా, వద్దా అన్నట్లు ఆలోచిస్తూ మండింది అగ్గిపుల్ల. విజయగర్వంతో సింగుకేసి, లాల్ కేసి చూశాను. 'మాకేం అర్థంగావడంలేదు ఏమిటిది?' అని అడిగారు వాళ్ళు.

"నిన్న మనం రాకెట్ దిగి వస్తూంటే నేలమీద నల్లనల్లటి చారలు చాలా ఉండడం మీరు చూసేఉంటారు. మొదట్లో చంద్రమండలం కూడా భూమిలాగానే ఇసుక మొదలైనవాటితో కప్పబడి ఉండాలి. కాని కాలక్రమేణా చంద్రమండలం చల్లారిపోయింది. ఈ సమయంలో లోపలి తేలికపదార్థాలన్నీ బయటకువచ్చేసి చల్లారిపోయి కుంచించుకుపోవడంలో హఠాత్తుగా గట్టిపడిపోయి ఉండాలి. ఈ తేలికపదార్థాలలో బొగ్గు ఒకటి. కాని ఇది హఠాత్తుగా గట్టిపడితే వజ్రం అయ్యే అవకాశం ఉంది. అందుకనే నిన్న చారికలు చూడగానే చంద్రమండలపు నేలంతా వజ్రమయం అయి ఉండాలనుకున్నాను. నిన్న మనం కొండమీదినుండి చూసినప్పుడు చదును ప్రదేశమంతా మెరుస్తున్నట్లు కనిపించగానే నా ఊహ నిజమైందని అనుకున్నాను. కాని తీరా దగ్గరకి వెళ్ళిచూస్తే అక్కడక్కడ ప్రమాదవశాత్తు తప్ప వజ్రపునేల ఏమాత్రంలేదు సరికదా, రంధ్రాలతో గప్పబడిన నేల కనిపించింది. ఇలా ఎందుకు జరిగిందో నాకర్థం కాలేదు. కాని బయటికివచ్చిన తేలిక పదార్థాల్లో బొగ్గుని హరింపచేసే శక్తిగల ఏకాల్షియమైనా ఉండి ఉండవచ్చుననుకొని సమాధానపడ్డాను. కాని నిన్నరాత్రి మన పంచదార సీసా బిరడా పంచదారలో నీటిని ఆవిరిరూపంలో బయటికి పంపి పంచదారని అలాగే అట్టిపెటడం చూసేసరికి తటుక్కున ఒక ఊహ మెరిసింది. నేననుకొన్నట్లు నేలలో కాల్షియంలాంటి బొగ్గుని హరించే పదార్థమే గనుక ఉన్నట్లయితే పై బొగ్గుపులుసుగాలి రంధ్రాలలోంచి క్రిందికి వెళ్తున్నప్పుడు దాంట్లోని బొగ్గునంతా హరించి స్వచ్ఛమైన ప్రాణవాయువుని లోపలికి పంపిస్తూ ఉండవచ్చు. ఇదేగనుక నిజమైతే చంద్రమండలపు నేల లోపల జీవకోటి నివసించడానికి అవకాశం ఉంది. ఏవిషయమూ పరిశోధించకుండా మీతో చెప్పడం దేనికని ఊరుకున్నాను. ఇవాళ బయట వెంటనే ఆరిపోయిన అగ్గిపుల్ల ఈ పెళ్ళలోని సొరంగంలో మండినట్లు చూశాం. ప్రాణవాయువు లేందే ఏదీకూడా మండలేదుకదా. అంటే పెళ్ళలో నేను చేసిన సొరంగంలోకి పైనున్న బొగ్గుపులుసు గాలిలోంచి ప్రాణవాయువుని కొంచెం తీసి ఇచ్చిందన్నమాట, పెళ్ళలోని కాల్షియం. దీన్నిబట్టి మనం ఎలాగైనా చంద్రమండలపు నేలలోకి వెళ్ళగలిగితే మనం కనివిని ఎరుగని కొన్ని వింతలు చూడగలమేమోనని ఆశగా ఉంది అని చెప్పాను. లాల్ కొంచెం భయపడినా మాతో రావటానికి సిద్ధపడ్డాడు. కాని లోపలికి వెళ్ళడం ఎలాగ? మాదగ్గర ఉన్న చిన్న పనిముట్లతో లోపలికి వెళ్ళడం ఈ జన్మలో సాధ్యంకాదు. ఏదో దారి వెతకాలి. దారి వెతకాలంటే నడకతో లాభంలేదు. వెంటనే హెలికాప్టరు స్పేరుపార్టులే

# ★ చంద్రలోకయాత్ర ★

జ్ఞాపకం వచ్చాయి. ఎందుకైనా మంచిదని తీసుకువచ్చిన ఈ చిన్న హెలికాప్టరు మాకు ఎంత ఉపయోగం అవుతుందీ అనే ప్రశ్న మమ్మల్ని బాధించింది. కాని ఇక్కడకూడా కొంచెం గాలనేది ఉండడంవల్ల భూమిలో దాదాపు మైలు ఎత్తు దాకా ఎగురగలిగేది ఇక్కడ ఒక ఫర్లాంగన్నా ఎగురదా అనిపించి హెలికాప్టరు భాగాల్ని క్రిందికి తీసుకువచ్చి బిగించాము. అది తయారయాక అతివేగంతో ప్రొపెల్ చేస్తే దాదాపు 200గజాల ఎత్తుదాకా ఎగరగలదని ప్రయత్నించి చూసి, రేడర్‌లో మేము మళ్ళీ అవతలికి వెళ్తున్నట్టుమాత్రమే తెలియబర్చి, చెరో తుపాకీ, కెమెరా ప్రకాశవంతమైన టార్చిలైటూ తీసుకుని బయలుదేరాం. ఆ రోజంతా ఎంత తిరిగినా మాకు భూగర్భంలోకి చొచ్చుకుపోయే సొరంగాలుగాని, అగ్నిపర్వతపు రంధ్రాలు గాని అగుపించలేదు. అలసి, సొలసి నిస్పృహతో సాయంత్రానికి రాకెట్ చేరుకున్నాము. రాకెట్ చేరగానే మాదగ్గిరఉన్న చంద్రలోకపు ఊహామాత్రపు జియలాజికల్ పటాన్ని పరిశీలించి మేము ఇవాళ చూసినదంతా భూమికి కనిపించేభాగం మాత్రమేనని, భూమికి కనిపించని వైపున ఇంకా చూడవలసిఉందని గ్రహించి కనీసం ఇంకొక రోజైనా ఉండడానికి నిశ్చయించాము.

## 7

మేము చంద్రమండలం చేరిన మూడవరోజు, అంటే భూమిని విడిచిన 60 గంటల తర్వాత, ప్రొద్దున్నే బయలుదేరి వీలైనంత వేగంతో అతిజాగ్రతగా కొండల్ని గుట్టల్ని దాటుకుంటూ హెలికాప్టరు మీద మా రాకెట్‌కి ఎడమవైపుగా బయలుదేరాము. మేము బయలుదేరిన రెండు గంటలలోగా భూమికి కనిపించని ప్రదేశాలుచేరినట్లు ఒక వైపుగా కనిపిస్తున్న పొడుగుపాటి పర్వత పంక్తిని చూసి కనిపెట్టాము. ఈ ప్రదేశం చేరిన కొంచెంసేపటిలోనే నాలుగైదు అగ్ని పర్వత రంధ్రాలు కానవచ్చాయి. బహుశః భూమికి కనిపించేవైపు చంద్రమండలం భూమియొక్క వేడివల్ల కొంచెం నెమ్మదిగా చల్లారడంవల్ల రంధ్రాలన్నీ పూడుకుపోయి ఉంటాయి. ఇదే నిజమైన ఊహ అని నిరూపించేందుకు ఈ వైపున వజ్రపునేల అవతలి వైపుకన్నా కొంచెం ఎక్కువగా ఉన్నది. కాని మేము నిన్ననే అతికష్టంతో ఒక వజ్రపుపెళ్ళ పెల్లగించడంవల్ల ఇవాళ వజ్రాలమీద అనురక్తి పుటలేదు.

అగ్నిపర్వతపు కన్నాలకన్నా ఇంకో మార్గంలేదని గమనించి, తద్వారానే లోపలికి వెళ్ళడానికి నిశ్చయించుకుని కొంచెం పెద్దదిగా కనిపించిన ఒక పర్వతపు అంచున దిగాము. లోపలికి వెళ్ళడం ఎలాగా అనే ప్రశ్న వచ్చింది. ఇలాంటి అవసరం వస్తుందని గ్రహించకపోవడంవల్ల భూమినుండి మేము పొడవైన తాళ్ళు తెచ్చుకోలేదు. కాని మా చుట్టూ గాలిసంచులు దట్టంగా ఉండడంవల్ల కాలుజారినా కొంచెం నెమ్మదిగానే పడతాం కాబట్టి (చంద్రుడి ఆకర్షణశక్తి తక్కువ. దానికితోడు బొగ్గుపులుసుగాలికన్నా మామూలుగాలి కొంచెం తేలిక కాబట్టి) మరీ పెద్ద దెబ్బలు తగలవు. అందువల్ల ధైర్యంగా వీలైనంతవరకు చేతులతో పట్టుకుంటూ బిలంలోకి వెళ్ళడమే మంచిదని నేనన్నాను. 'మరి మళ్లీ పైకి రావడమో' అన్నాడు లాల్. 'మనదగ్గిర అనువైన చిన్న గొడ్డళ్లున్నాయి కాబట్టి ఎలాగో తంటాలుపడచ్చులే' అన్నాను నేను, ముందు ఎలాగో అలా క్రిందికి వెళ్ళగలిగితే చాలులే అనుకుంటూ. ఇంతలో సింగు 'మనం విద్యుదుత్పత్తికి తీసుకువచ్చిన ఎనిమిది పెద్ద డైనమోలలోను మూడు మాడిపోయాయికదా, అవి విప్పితే వాట్లోంచి పొడుగైన రాగితీగ తీయవచ్చు. రాగితీగ కాబట్టి ఐదారు చుట్లుగా పురిపెడితే ఒక మనిషి బరువైనా తేలిగ్గా ఆపుతాయి. ఏ గొడవా ఉండదు' అన్నాడు. ఇంతవరకు ఆ ఆలోచన తటనందుకు తిట్టుకుంటూ మళ్ళీ వెనక్కు బయలుదేరాము. పేనిన పొడుగాటి రాగితీగతో మళ్ళీ మేము వెనక్కి వచ్చేసరికి ఇంకో రెండుగంటలు పట్టింది. ఇంక సూర్యరశ్మి రెండుమూడు గంటలకన్నా ఎక్కువవుండదు. కాని మేము ఏమి కనిపెట్టబోతున్నామో అనే ఆతృతతో ఇంకేమీ గమనించకుండా అగ్ని పర్వతపు బిలంవద్దకు వచ్చేశాం. ఈ బిలం చాలా వెడల్పుగా ఉండి, పైభాగం చాలా మృదువుగాను, సన్నగాను ఉన్నది. బలం కోసం మూడు గొడ్డళ్లనీ లోతుగా ఈ భాగంలో పాతిపెట్టి మేము తెచ్చిన తీగని మూడింటిచుట్టూ గటిగా ముడివేశాం. తీగ సన్నగానూ, కొంచెం బలహీనంగాను ఉంది కాబట్టి ఒకరు ముందు దిగి పైవాళ్లకి చెప్పాక రెండవవారు, ఆ తర్వాత మూడవవారు దిగాలని నిశ్చయించాం. ముందే మా వినికిడి వైర్లని పొడుగ్గా ఏర్పాటుచేసుకున్నాం. అందరికన్నా ముందు సింగు, తర్వాత లాల్, ఆఖరున నేను దిగడానికి ఏర్పాటయింది. తీగని ఊతగా తీసుకొని జర్రుమనుకుంటూ సింగు జారిపోయాడు. అతని చెవినుండి నా చెవికి కట్టుకున్న వైరు దాదాపు 2 ఫర్లాంగులు వెళ్ళి ఆగిపోయింది. వెంటనే 'లాల్‌ని దిగమనచ్చు' అంటున్న సింగు స్వరం వినిపించింది. లాల్ తీగని పట్టుకుని నా దృష్టిపథంనించి దాటాడు, నా మాస్కులోని చెవులు చిల్లులుపడేటట్లు సింగు స్వరంలో పిచ్చికేక వినిపించి మాడలిపోయాను. ఇంకో రెండు సెకన్లలో అతని చెవికీ నాకూ కట్టబడిన వైరు పటుక్కున తెగిపోయింది. నాకు వినిపించిన కేక లాల్‌కి కూడా వినిపించిఉంటుంది. తీగె పట్టుకుని నెమ్మదిగా జారుతున్న అతను ఈ కేకకి మాడలిపోయి చేతులు వదిలివేసినట్లున్నాడు, అతన్ని కలిపే వైరు అతివేగంగా రెండు మూడు క్షణాలు వెళ్లిఆగిపోయింది. ఇంతలో అతని నోటినుండి కూడా కేక వినబడ్డం, ఆ వైరుకూడా తెగిపోవడం జరిగింది. రెండు మూడు నిమిషాలు ఏంచెయ్యాలో తోచక స్తబ్ధుడినైపోయాను. ఏమైనాసరే కలిసి చావడానికి నిర్ణయింపబడ్డ మేము కలిసి చావాలని తీగని పట్టుకుని జారనారంభించాను. వెలుగులోంచి చీకట్లోకి వచ్చేసరికి నా మనసులో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. వాళ్ళిద్దరికీ దిగగానే చంద్రమండల ప్రాణులవల్ల ఏదైనా ప్రమాదం జరిగిఉండాలనిపించింది. అలాంటివి ఏవైనా ఉంటే అంధకార సంచారం మాత్రమే చేయగలవు కాబట్టి నావద్ద ప్రకాశవంతమైన వెలుగుంటే అవి దడుసుకుంటాయని కూడా అనిపించింది. ఈ విషయం సింగుకి గుర్తుకిరాక, లాల్‌కి అవకాశం లేక వారు ప్రమాదానికి గురైఉంటారు. ఈ ఆలోచన తటగానే ఒక చేత్తోమాత్రమే తీగెని పట్టుకొని జారుతూ రెండో దానితో నా భుజానవున్న సంచిలోని బేటరీలైటుని తీసుకున్నాను. అది, దానిస్విచ్చి నా చేతిలో ఇమడటం, నా కాళ్లు నేలకి తగలడం ఒక్కసారి జరగాయి. వెంటనే అంధకారాన్ని చీల్చుకుంటూ టార్చిని వెలిగించి అన్నివైపులా చూశాను. నేను టార్చిని వెలిగించిన మరుక్షణం వందలాది గబ్బిలాలు ఎగిరిపోతున్నట్లు శబ్దమై, ఆ గుడ్డి వెలుగులోనా నుంచి దూరమవుతున్న అనేక నల్లటి ఆకారాలు కనిపించాయి. నీరవోతున్న ధైర్యాన్ని కూడగటుకుని, రోట్లో తలదూర్చి రోకటి పోటుకి దడవడం ఎందుకు అనుకుంటూ తీగని వదిలేసి తుపాకిని ఒక చేత్తోనూ, వెలుగుతున్న టార్చిని రెండో చేత్తోను పట్టుకుని బయలుదేరాను. నాటార్చి వెలుగుపడుతున్న ప్రదేశమంతా అంధకారం, దానితోపాటు మసకగా కనిపిస్తున్న ఆకారాలు మాయమౌతున్నాయి. కాని సింగు, లాలులజాడ ఏమీ తెలియడం లేదు.

దాదాపు ఒక గంటసేపు పిచ్చెత్తిన వాడిలాగా ఇటూఅటూ తిరిగాను. నావద్ద వెలు

-ంవల్ల నాకే ప్రమాదమూ రాలేదు. నా ప్రక్క తిద్దరికీ డా తెలియక ఉద్రేకంవచ్చి కోపాన్ని ఆపుకోలేక రెండుమూడుసార్లు చీకట్లోకి తుపాకీ పేల్చాను. దానికితార్కాణముగా ఒక చంద్రమండలపు జీవి కళేబరం దొరికింది. దాదాపు మనిషి ఆకారములో వున్న ఈ జీవి చీకటికి అలవాటు పడడంవల్ల గుడ్లగూబకన్న పెద్దవయిన కళ్ళతోను, కొంచెం కొంచెముగా క్రిందికి ప్రవహిస్తున్న ప్రాణవాయువుని పీల్చుకోడానికి అనువుగా పెద్ద ముక్కు రంధ్రాలతోను, ఆహారం చాల తక్కువేమో చిన్న నోటితోను, సన్నగా వెదురుబొంగులా వున్న దేహంతోను విలసిల్లుతోంది. నేను తిరిగిన ప్రదేశమంతా చదునైన నేలతోను, దాదాపు ఎనిమిది తొమ్మిది అడుగుల ఎత్తువున్న చదునయిన పైకప్పుతోను ఉంది. నేలంతా ప్రాణవాయువు, బొగ్గుపులుసు గాలిసో మాత్రం జీవించగల ఒక రకమైన నాచులో కప్పబడి ఉంది. ఈ నాచే వారికి ఆహారమనీ, ఆ నాచు నేలపై మున్న కర్బన ఉదజనితాలనుండి నీటిని తయారు చేయగలగడంవల్ల వారికి నీరుకూడ ఇదే సరఫరా చేస్తాయని తర్వాత తెలిసింది. నాచేత చంపబడిన ఆ జీవిని ఒజాన్ని వేసుకుని, కొంచెం నాచుని గీక్కొని సంచీలో వేసుకుని అన్వేషణ తిరిగి మొదలుపెట్టాను. ఈ సంచారంలో చంద్రమండలపు జీవులు నేలలోని లోతు బొరియలలో ఉంటారనీ కనిపెట్టి బొరియలు కూడా వెదుకసాగాను. చివరికి ఒక బొరియలో ప్రాణావశిష్టుడయి ఉన్న సింగు కనిపించాడు. అతని చుట్టూ ఉన్న గాలిసంచులన్నీ ఖాళీ అయిపోయాయి. అతని శరీరం అంతా గాయాలతో నిండి ఉన్నది. ఒక అరగంటసేపు కష్టపడి అతనికి మళ్ళీ స్పృహ తెప్పించాను. అతను కళ్ళు తెరిచాక, మళ్ళీ మా వినికిడి కలి వచ్చాక నేననుకున్నట్టే టార్చి విషయం తనకి జ్ఞాపకం రానట్టు అందువల్లే చీకట్లోనుంచుని మాకోసం చూస్తుంటే సన్నటి చేతులు ఒక వంద తనని చుట్టడించాయనీ ఒక్కసారిగా కూడలిపోయి అరిచాననీ చెప్పాడు. వారితో పెనుగులాడడంలో వినికిడి వైరు తెగిపోయినట్లు, తర్వాత వారు ఓ వందమంది తనని అశక్తుణ్ని చేసి గాయపరచి ఆ బొరియలో పడేశారనీ, కొంతమంది తన రక్తాన్ని కూడా జుర్రారనీ అందువల్ల తను స్పృహ తప్పిపోయాననీ చెప్పాడు సింగ్.

ఆ తర్వాత దాదాపు నాలుగైదు గంటలు మేము ఆ నేలమాళిగంతా గాలించాము కాని లాల్ దేహంకూడా దొరకలేదు. కొంచెం బలహీనుడూ, పిరికిగుండె కలవాడుఅయిన లాల్ ఇంకా బ్రతికుండడం అసంభవమని మేము ఎప్పుడో నిర్ణయించాం కాని, అతని దేహాన్ని నా కాపాడాలని చాలా తహతహలాడాం. సాధ్యం కాలేదు. ఒక బొరియలో రక్తపు మరకలు కనిపించాయి. కాని ఆబొరియక్రింద ఒక సన్నని బిలద్వారం ఉండడంవల్ల దాంట్లోంచి అతన్ని ఇంకా లోపలికి ఈడ్చేసి ఉంటాయని అనుకున్నాం. దాంట్లోంచి మేము లోపలికి వెళ్ళడంగాని, దానిని పెద్దది చేయడంకాని సాధ్యపడలేదు. నాగడియారం ద్వారా బైట మళ్ళీ తెల్లవారి ఉంటుందని ఊహించి లాల్ మీద ఆశ వదిలివేసి మేము పైకి వచ్చేశాం.

ప్రాణాపాయ సమయంలో మాతో ఒకడై మాప్రాణ గండాన్ని సమంగా పంచుకుంటూ ప్రాణమిత్రుడైన లాల్ని చంద్రమండలానికి బలిఇచ్చి బరువైన గుండెల్తో రాకెట్ ప్రవేశించాం నేనూ, సింగూ. గాలి సంచులు లేకపోవడంవల్ల హెలికాప్టరు లోపల ఉన్నప్పుడు తప్ప తక్కిన సమయాల్లో చర్మం పగిలి సింగు చాలాబాధ పడ్డాడు. కాని మొత్తంమీద నేను, సింగు మళ్ళీ ప్రాణాల్తో చంద్ర మండలాన్ని విడిచాము. మేముచూసినవి, ఫోటోలు తీసినవి గాక మాదగ్గర ఉన్నవి ఒక వజ్రపుపెళ్ల మన భూమిలోకూడా రాబోతున్న ఒక భవిష్యత్ జీవి, ఒక వింతరకపు నాచు మాత్రమే. ★

---

# నాగిరెడ్డి

(48-వ పేజీ తరువాయి)

చదునుచేసి అందరిచేత 'మాయాబజార్' అని ప్రశంసించబడ్డ మనోహరోద్యాన వనంగా రూపొందించారు. అన్నిరోజులూ ఆయన అక్కడే మకాం. అలాగే మొన్న కొన్న విజయాస్టుడియో. రాత్రివేళ మెర్క్యురీదీపాల కాంతిలో ఈపూలమొక్కలూ, ఆకుపచ్చని పచ్చిక తివాచీలూ, స్వాప్నిక జగత్తు అనిపించేలా నాగిరెడ్డిసౌందర్యపిపాసకు, జీవితంపట్ల ఆయన దృక్పథానికి రూపకల్పనలుగా భాసిస్తాయి.

వ్యాపారదక్షత గురించి కూడా ఒక తమాషా సంఘటన ఉంది. కాలంనాడు, వాహినీలో రద్దీ ఎక్కువై రెడ్డిగారు స్టార్ కంబైన్స్ స్టుడియోను కొన్నాళ్లు అద్దెకు తీసుకొని అక్కడ కొందరు నిర్మాతలకు చోటు చూపారు. ఒక చిత్రానికి అనుకట్ట సెట్టు కావాల్సి వచ్చింది. కాల్ షీట్ వేళకు సెట్ సిద్ధంకాలేదు. ఈమాట నాగిరెడ్డిగారికి 12 గంటలు ముందర తెలిసింది.

'మీకు రాత్రికి సెట్ రెడీ అవుతుంది' రండి అని చెప్పాడు నిర్మాతలకు. తక్షణం, వలభైమంది పనివారిని నాలుగు లారీలలో స్టార్ కంబైన్స్ కు పంపి, అక్కడ నిర్మాణంలో ఉన్న ఆ పెద్ద సెట్ భాగాలన్నీ వాహినికి తెప్పించి, 9 అయే సరికి సెట్ సిద్ధంచేయించేశారు.

తన లోపంవల్ల ఎవరు అసంతృప్తి చెందినా మహాబాధగా ఉంటుంది ఆయనకు.

* * *

"అపేక్ష చూపితే, ఎదటి మనిషి నిన్ను తన వాడిగా, తన బిడ్డలా చూసుకుంటాడు. నీకన్న పెద్ద అయినా, చిన్న అయినా సరే" అన్నది ఆయనకు తాతగారు నూరిపోసిన నీతి. ఆయనదగ్గర 'ధనియాలు' అనే పనివాడు ఉండేవాడు.

"ఆ యిద్దరికీ పరస్పరం జీవితాంతం ఉన్న గౌరవం, ఆ అపేక్ష ఎన్నడూ మరచిపోలేను. నాజీవితంలో నా వ్యవహారాలలోకూడా అటువంటి సత్సంబంధాలు ఉండేలా చేసుకోవాలనే శాయశక్తులా కృషి చేస్తాను" అన్నారు నాగిరెడ్డి.

ఎవరికైనాసరే, తననుమనసారాగౌరవించి, అభిమానిస్తూన్న మనిషి ఇంకోడున్నాడన్న ఆలోచనవస్తే అదే ఎంతో బలం ఇస్తుందని ఆయన నమ్మకం. కడుపునొప్పిగా ఉన్నపుడు కృష్ణా రామా అనే బదులు ఆప్తమిత్రుడినో, ఆలుబిడ్డలనో పేరుతో పిలిస్తే వాళ్లు తక్షణం వచ్చి, ఏదో సేవచేసి బాధ తగ్గిస్తారు. వాళ్ళే ప్రత్యక్షదైవాలు అంటారాయన.

* * *

నాగిరెడ్డిగారు ఒకరోజు రాత్రి ఇంటికి వచ్చేసరికి చిన్నకొడుకు వేణు, మైసూరు వెళ్తానని చెప్పి అనుమతి అడగవచ్చాడు. "తిరిగి తిరిగి కష్టపడి వచ్చారు. ఇప్పుడే ఈ గొడవలన్నీ ఏమిటి నాయనా" అని తల్లి మందలించింది.

"కొన్నాళ్ళు కష్టపడాలి మరి. నేను పెద్దవాణ్ణి అయితే ఆయన రాను తీసుకోవచ్చు అవన్నీ నేనే చూస్తాను" అన్నాడు ఆ అబ్బాయి.

* * *

"అంతకన్నా నాకేంగావాలి?" అన్నారు నాగిరెడ్డిగారు. ★

## దక్షిణ భారతంలో చలనచిత్ర పరిశ్రమ

(55-వ పేజీ తరువాయి)

పోయాన్న చిత్రాలు 109లోను 75 ఉన్నాయి. వీటిలో తమిళం 44, తెలుగు 28, కన్నడం, హిందీ (ఇక్కడ తయారైనవి) 3.

పరిశ్రమ అన్ని విధాలా పెరుగుతున్న ఈ సమయంలోనే, దురదృష్టవశాత్తూ, విద్యుత్ నిర్బంధాల ఫలితంగా, ముడి ఫిలింకు, ఇతర పరికరాలకూ ఇబ్బంది వచ్చి పడింది. ఈ సమస్య వికార రూపం ధరించకుండా, పరిశ్రమ పెద్దలు ముందే సమాలోచన జరుపుకుని ఫిలిం ఛేంబర్ ద్వారా ముడి ఫిలిం సరఫరాకు కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేస్తున్నారు. ★

## గుమ్మడి

(80-వ పేజీ తరువాయి)

'తోడుదొంగలు' 'జయసింహ' 'ఏది నిజం' వంటి చిత్రాలలో గుమ్మడి నటనను చూచినవారు అతని ప్రజ్ఞను మెచ్చుకోకుండా ఉండలేరు. గుమ్మడి చిత్రించే దుర్మార్గులు యాబాసిరకం వాళ్లు కారు. నిత్యజీవితంలో తటస్థపడే గోముఖవ్యాఘ్రాలకు బాగా దగ్గరగా ఉంటారు. ఎటొచ్చి ఆయా చిత్రాలలో 'ఒకొక్క సీను' డిపాల్య అయినపుడు, అతడు దుర్మార్గుడని పునరుద్ఘాటించడానికి దర్శకుడు పులితలలు, పాములూ తేలుగునీడలూ వంటి సాంకేతలతో ఆర్భాటం చేయడం వల్ల ఆ క్షణాలలో 'సినిమా దుర్మార్గుడు' అని ప్రేక్షకుడికి అనిపించవచ్చు. అది నటుడి తప్పు కాదు. గుమ్మడి మితిమీరి నటించడు. తొణుకు బెణుకు లేకుండా దుర్మార్గాలు చేసేవాడి ధీమాని అడుగడుగునా స్ఫురింపచేస్తాడు. క్షణంలో ముఖ కవళికలు మార్చి, మహాకోపాన్ని మందహాసంలోకి తర్జుమా చేసే దుర్మార్గుల గుణగణాలనూ లక్షణాలను ఎక్కడా పొల్లు పోకుండా ప్రదర్శిస్తాడు.

అయినా, కరుణార్ద్రమైన పాత్రలు నిర్వహించడం గుమ్మడి అభీష్టం. ప్రేక్షక హృదయాలను కదలించి, అపారమైన సానుభూతిని సంపాదించుకొన్న వాటిలో 'దాంపత్యం,' 'దొంగల్లో దొర', 'ఇలవేల్పు' చిత్రాలలో గుమ్మడి ధరించిన పాత్రలు ఎన్నతగ్గవి. తీవికి, విందుతనానికి ఇవి రూపకల్పనలు. చాలా పెద్దవాళ్లు, గౌరవాస్పదులైనవాళ్లు జీవితానికోసారి ఎప్పుడో బేలలైపోయి భోరున ఏడిస్తే మనం చూడలేం, చూస్తే మరచిపోలేము. గుమ్మడి నిర్వహిస్తున్న పాత్ర కంట తడి పెడితే, అటువంటివి జ్ఞాపకం వస్తాయి. ప్రేక్షకుడి సానుభూతికి ఆ పాత్ర పాత్రత గడించుకొంటుంది. సినిమా అయిపోయాక గుమ్మడి గౌరవం గడించుకొంటాడు.

ఈవిధంగా ప్రేక్షకుడిని పూర్తిగా వశపరచుకొని అతడి, గౌరవాభిమానాలకు పాత్రం కావాలంటే, పాత్రను అద్భుతంగా ఒప్పించాలి. పాత్రను అద్భుతంగా ఒప్పించడానికి నటుడు ఏం చెయ్యాలి? పాత్రలో లీనమైపోవాలా?

"అక్కర్లేదు. ఆమాట కొస్తే, అది తగదు. అలా లీనమైపోతే ఇంక నటుడికి తనేంచేస్తున్నాడో కూడా తనకే తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. ఒక్కొక్క సన్నివేశంలో దగ్గరవుండి చూస్తున్నవారికీ, నటుడికీ అది అద్భుతంగా కనబడవచ్చు. కాని, ఆపాత్ర పూర్వాపరాలు కథస్వరూప స్వభావాలు సమన్వయించవలసివచ్చినపుడు అదే, వెగటుగా జుగుప్సాకరంగా కనిపించవచ్చు కూడా. అందువల్ల, నటుడు తనపాత్ర మంచిచెడ్డలు తెలుసుకుని, తనపక్కనఉండి దాన్ని నడిపిస్తున్నట్టువ్యవహరించాలి. అప్పుడే ఆయా పాత్రల ప్రవర్తన, ఎబ్బెట్టు అనిపించకుండా, జీవితంలో కనబడే మనుషుల తరహాకు దగ్గరగా ఉందని అనిపిస్తుంది." అంటాడు; 'ఇంతవరకూ ఎన్నడు మితిమీరకుండా గతి తప్పకుండాపాత్రలు నిర్వహించిన మంచి నటుడ'నిపించుకొంటున్న గుమ్మడి వెంకటేశ్వరరావు ఇంతవరకూఅతను నటించినవి 35 చిత్రాలు ఇపుడు 15 చిత్రాలలో పనిచేస్తున్నాడు. ★

## రంగారావు

(77-వ పేజీ తరువాయి)

వారికీ ధ్యేయమే కాని, సాధ్యం అవునని ఎవరూ గుండెమీద చేయివేసుకు చెప్పలేరు. ప్రతి వ్యక్తిలోను మహాప్రపంచం ఉంటుంది. అలా కోట్లాది వ్యక్తులున్నారు. ఇంతమందిని అర్థం చేసుకొని, అన్నిరకాల పాత్రలు ధరించి, అందరి హృదయాలను మనవి చేసుకొంటే, నటనలో పరాకాష్ఠ నందుకోగలం. కాని అది సాధించడానికి ఒక జీవితం కూడా ఏమూలకీ చాలదు. అంటాడు రంగారావు సముచితవినమ్రతతో.

రంగారావు నిర్వహించే ఏపాత్రఅయినా అత్యంత చైతన్యవంతంగా, హుషారుగా, జీవిస్తుంది. తను సంతోషంగా ఉండి ఎదటివాళ్ళని సంతోషపెడుతుంది. అది అతని ముద్ర. 'మాయా బజార్'లో ఘటోత్కచుడి పాత్రకు రంగారావు నిర్వచనం ఇదే. సారంగధరలో రాజరాజు పాత్రకూ ఈ సూత్రాన్ని పటించాడు. రాజ నీవికి భంగం వాటిల్లదా అనే ప్రశ్నకు అతని జవాబు: రాజులూ మనుష్యులే గదా!

రంగారావు, నిత్య జీవితంలో కూడా ఆడుతూ పాడుతూ నవ్వుతూ, నవ్విస్తూ హుషారుగా ఉంటాడు. సెట్ మీదా అంతే.

ఇన్ని చిత్రాలలో నటిస్తున్నారు. మీకు విశ్రాంతి అవసరం లేదా?" అన్న ప్రశ్నకు జవాబు.

"నాలాటి వాళ్ళకు పనే విశ్రాంతి కాదా?" ★

## ఆసియా మొత్తంమీద అగ్రశ్రేణిమణి

(45 వ పేజీ తరువాయి)

కథ' ఆరంభించారు. ఆరేడు అక్కడ ఆరంతో చిత్రాలు తయారయ్యాయి. ఈనాడు, ఎప్పుడు చూచినా, ఈ స్టుడియోలో నిర్మాణం అవుతున్నవి హీనపక్షం 35 చిత్రాలు ఉంటాయి. స్టుడియో నెలకొన్న నాటినుండి నేటికి వెయ్యిచిత్రాలుఇక్కడ తయారై ఉంటాయి.

పరిమాణాన్ని బట్టేకాక, ప్రమాణాలను బట్టికూడా సర్వతోముఖంగా వృద్ధిచెంది,ఆసియాకే అగ్రశ్రేణిమణి అని కీర్తికెత్తుకున్న ఈస్టుడియో ఆంధ్రులు నెలకొల్పి నడుపుతున్నది కావడం,ఆంధ్రదేశానికిగర్వకారణం. ఇంతటి ఉన్నతిని సాధించిన నాగిరెడ్డి, చక్రపాణిగారల కార్యదక్షత, సామర్థ్యం సర్వత్రా అభినందనీయాలు.

అమెరికా, బ్రిటన్, ఇటలీ, జెకోస్లావేకియా, బర్మా, మలయా, ఇండొనీషియా, సోవియట్ రష్యా, చైనా ప్రభృతిదేశాల సాంస్కృతిక ప్రతినిధివర్గాలూ, వివిధదేశాల ప్రముఖులు, ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణన్, శ్రీ మురార్జీదేశాయి, డా॥ కేస్కర్, చింతామణి దేశ్‌ముఖ్ ప్రభృతి దేశీయ ప్రముఖులూ బి. ఎన్. సర్కార్, దేవకీబోస్, సొరాబ్ మోడీ మొదలగు వారూ పలువురు ఈస్టుడియోను చూచి, ప్రశంసించారు. దేశంలో ఏమూలనుండి ఎవరు మద్రాసు వచ్చినా వాహినీస్టుడియో చూడాలని తహతహలాడుతారు. దేశదేశాల సినిమాకి చెందినవారు ఈ స్టుడియో సాధనసంపత్తి గురించి ఇక్కడివారి పనివాడితనం గురించి గొప్పగా చెప్పుకుంటారు. ఒక రష్యన్ సినిమా నటి, ఈస్టుడియోను చూచాక, 'నేను రెండు వేల స్టుడియోలు చూచాను... ఇది మటుకు చాల అందమైన స్టుడియో" అంది ముగ్ధురాలై. ★

# ఎదురు చూడని వరుడు

(29-వ పేజీ తరువాయి)

శాంతమ్మ-తనలో అనుకుంటున్నట్టు.

ఎనిమిది గంటలదాకా శేషాచలం ఇంటికి రాలేదు. శాంతమ్మ వంట చేసుకుని కూచున్నది-అన్నయ్యకోసం ఎదురుచూస్తూ రామనాథం వాకిట్లో కూచున్నాడు. లీలా, బావా గదుల్లో వున్నారు. చంద్రశేఖరం బయటకువెళ్ళినవాడు ఇంకా ఇంటికి రాలేదు. శేషాచలం రాగానే రామనాథం—

"ఏంరా వెళ్ళినపని?" అన్నాడు.

"నా మొహం—నా! మొహమూనూ. వచ్చేనెలకు వాయిదా వేశాడు. ఇది ఇంకే-జీవితాంతం వాయిదాలే!" అన్నాడు శేషాచలం.

"మరి యింతసేపు చేశావేం-పొద్దున్న నగా ఇంత తినివెళ్ళిన వాడివి!"

"ఆ—మరోపని ఏదో వుంటేనూ."

భోజనానికి లేవమన్నది శాంతమ్మ.

"ఆ అబ్బాయి ఏడీ?" అన్నాడు శేషాచలం.

"బయటకు ఎక్కడికో వెళ్ళినట్టున్నాడు." అన్నాడు రామనాథం.

"ఏమిటి ఆ అబ్బాయి ఇంటిపేరు?" అన్నది శాంతమ్మ.

"ఇంటిపేరా-ఏదోవున్నదిలే" అన్నాడు చిరాగ్గా శేషాచలం.

రామనాథం నవ్వాడు. "అట్లా చిరాకు పడతావేం? వినా ఇంటిపేరు తెలుసుకో కుండా వచ్చావన్నమాట!" అన్నాడు.

"తెలుసుకోవలసిన అవసరం ఏముంది ఇప్పుడు?" అన్నాడు శేషాచలం.

ఈ మాటకు శాంతమ్మా, రామనాథం ఇద్దరూ దిగ్భ్రాంతులైనారు.

"పెళ్ళికొడుకును తీసుకొచ్చావు కదా—వివరాలు తెలుసుకోకుండా వచ్చావేం అని!" అన్నాడు రామనాథం.

శేషాచలం కొన్ని క్షణాలపాటు జవాబివ్వలేదు. తర్వాత-"అట్లాగా-అవునవును! ఐతే ఆ పెళ్ళికొడుకు ఈ రోజు నాతో రాలేదు."

"ఈ అబ్బాయి ఎవరుమరి?" అన్నది ఆత్రుతగా శాంతమ్మ.

"ఇతనా? ఇతనెవరో నాకు తెలీదు. బండిలో కలిశాం. చాలాసేపు మాట్లాడు కున్నాం. ఈ వూరు ఆఫీసుకు ట్రాన్స్ఫర్ అయిందిట—

'కొత్తవూరు-పట్నం' అని దిగులుపడ్డాడు. 'ఫరవాలేదులే - మా వాళ్ళున్నారు-ఒకపూట వుండి ఇల్లుచూసుకో-అందులో ఇబ్బంది ఏముంది' అని తీసుకొచ్చాను. చాలా తెలివైనవాడూ—నెమ్మదయిన వాడూనూ! పాపం...ఎక్కడ పడుకుంటాడు?"

"చంపావ్ పో-ఇతనే ఆ పెళ్ళికొడుకని అనుకున్నాం మేమంతా!" అన్నాడు రామనాథం.

"అనుకుంటే మాత్రం ఇపుడేం మునిగి పోయిందిలే?" అన్నాడు శేషాచలం. శాంతమ్మకు చెప్పలేని నిరుత్సాహం కలిగింది. 'సయం' అనుకున్నాడు నెమ్మదిగా రామనాథం. ఈ సంభాషణ జరుగుతూ వుండగానే బావ అక్కడికి ప్రవేశించాడు నెమ్మదిగా.

"ఐతే ఇతను పెళ్ళికొడుకు కాదన్నమాట పోరి విడి మిస్టరీ—" అన్నాడు బావ.

"వస్తూనే ఆ మాట చెబుదాం అను కున్నాను. నా కోర్టుగొడవలో పడి...... సరేలే, మళ్లీసారి వచ్చేప్పుడు తీసుకొస్తా లే!" అన్నాడు శేషాచలం. గోతాలతో బంగారం దొరికినంత సంతోషంతో పరు గెత్తాడు బావ లీలదగ్గరకు.

"కొంపమునిగింది లీలా! ఈ అబ్బాయి పెళ్ళికొడుకు కాడట!" అన్నాడు.

"ఆఁ!" అన్నది లీల ఆశ్చర్యంగా.

"నీతోడు పెద్దమామయ్య చెప్పాడు. ఆ అసలు అబ్బాయి రాలేదట — ఇత నెవరో......"

అంతే! ఆతర్వాత మాటలు లీలకు విని పించలేదు. చరచరా గదిలోకి పోయింది! పెద్దగా నిట్టూర్చి, విలన్‌చూపు ఒకటివిసిరి, నెమ్మదిగా వీధిచావిడిలోకి ప్రవేశించాడు బావ.

బావ, చంద్రశేఖరం కలిసి భోజనం చేస్తారని ఈలోగా తాము చేసేదామనీ, శేషాచలం రామనాథం భోజనానికి కూచు న్నారు. బొమ్మల్లే ఐ, తలుపుప్రక్కగా లీల నించున్నది.

"ఈ అబ్బాయికి పెళ్ళి ఐందా?" అన్నది శాంతమ్మ.

"ఇంకా లేదట—పెద్దకుటుంబం వాళ్ళే వున్నారు. చాలా సంబంధాలు వస్తున్నా యట......"

ఇంతలో తారాజువ్వలే దూసుకున్నాడు బావ అక్కడికి— "తేలిపోయింది. మిస్టరీ విడిపోయింది!" అన్నాడు గోలగా.

"ఏమిటోయ్ నీ గోల?" అన్నాడు చిరాగ్గా రామనాథం.

"అదే-- ఈ అబ్బాయెవరో కనిపెట్టే శాను."

"కనిపెట్టటానికి ఇందులో రహస్యం ఏముందిరా?" అన్నాడు శేషాచలం.

"రహస్యం అంటే రహస్యం కాదు— ఈ అబ్బాయి యింటిపేరు స్వర్ణపురి వారు.. వూరు... అదేం పేరు!... ఏదో... అబ్బాయిపేరు చంద్రశేఖరం..."

"ఐతే?" అన్నాడు రామనాథం.

"స్వర్ణపురి వారి సంబంధం ఇదివరకు లీలకు మాట్లాడదామనుకోలా- అదే ఇది!" అన్నాడు బావ గొప్పగా — ఈ గందర గోళం అంతా విడగొట్టినందుకు.

"నిజమే?" అన్నది శాంతమ్మ సంతో షంగా.

"కాక! మన డిటెక్షన్‌కు తిరుగులేదు!" అన్నాడు బావ.

"ఎట్లా చెప్పావ్‌రా?" అన్నాడు శేషా చలం.

"ఏముంది? అతని బెడ్డింగ్ అక్కడే వుంది. పుస్తకాలన్నీ అక్కడే వున్నయ్- ఆ అటుమీదచూస్తే...అరెరె...ఎట్లా కని పెట్టేనో చెప్పేస్తున్నా నేమిటి—అదిచెప్ప కూడదు!" అని నాలిక కరుచుకున్నాడు బావ.

"అవున్రా అన్నయ్యా—నీకు తెలీదు గాని, ఈమధ్య స్వర్ణపురివారి సంబంధం లీలకు చేసుకుందా మనుకున్నాం. ఆ అబ్బాయి బాగుండడని తన కెవరో చెప్పా రనీ, తనకొద్దనీ శాంతతో చెప్పిందట లీల. అందుకని వూరుకున్నాం!"

ఈమాట వినగానే చరచరా లీల గదిలోకి పోయింది. బావకూడా వెనకాలే వెళ్లాడు.

"అప్పుడు నువ్వొద్దన్నావ్ చూశావ్— ఆ అబ్బాయేట ఇతను. ఇప్పుడు చూశావా ఎట్లా జరిగిందో!" అన్నాడు హేళనగా బావ.

"జరగటానికి ఏముందని?" అన్నది లీల చిరాగ్గా.

"ఏముందనా—ఈ సంబంధం కొద్ద న్నావుగా నువ్వు?"

"ఎప్పుడు అన్నానూ?"

"భలేదానివే. అప్పుడనలా నువ్వు? ఇతను మంచివాడు కాదని, నీ స్నేహితురాలు రాసిందని, అందరికీ ప్రేమలేఖలు రాస్తాడనీ అందుకని ఆ అబ్బాయిని అసలు చూడక్క ర్లేదనీ అన్నావుగా!"

"అవన్నీ ఎవరో చెప్పిన మాటలు....అ— ఐతే?"

"అహఁ...ఏం లేదు. ఆ మిత్రుడే ఇక్కడికొచ్చాడుకదా - చేతిలో చిక్కాడు కదా అని!"

"బావా—అనవసరంగా వాగక పో ఇక్కణ్ణుంచి!"

"అసలు పెళ్ళికొడుకు తర్వాత వస్తాట్ట- అంతా ఏదో నాటకంలాగా వుంది నాకు!"

# ఎదురుచూడని వరుడు

"బావా—నువ్వు ఈ ముద్దరి విడగొట్టి నందుకుచాలాథాంక్స్. నేను ఈఅబ్బాయినే చేసుకుంటాను!" అన్నది.లీలనిశ్చయంగా.

బావ ఉలిక్కిపడి—క్రింద పడబోయి తలుపు పట్టుకొని నిలబడ్డాడు!

"ఏమూ...ఏమిటీ?...నీకు పిచ్చెక్కిందా యేం?" అంటూ "మామయ్యాగారు విన్నారా!" అని అరుస్తూ పరుగెత్తాడు.

"కొంప మునిగింది" అన్నాడు బావ కొంప మునిగినట్టు.

"అబ్బబ్బ...ఏం గొడవరా నీది?" అన్నాడు శేషాచలం.

"నువ్వవరో? ఆ అబ్బాయిని వెంటబెట్టు కొచ్చావ్ కదా—లీలకుటా—ఈఅబ్బాయే కావాలట...చూడు ఆ మాటలు" అన్నాడు కొప్పుతూ.

"సరే ఇక నేం—శుభస్య శీఘ్రం—ఎవ రో ఒకడు!" అన్నాడు శేషాచలంనవ్వుతూ.

"అదేమిటి మామయ్యా—ఈ అబ్బా యెవరకు కున్నావ్?" అన్నాడు బావ.

"లీలకు నచ్చాడు గదా—అబ్బాయి! నచ్చచెప్పి—సంప్రదాయం ప్రకారం రేపు పెళ్ళిచూపులు ఏర్పాటు చేదాం," అన్నాడు శేషాచలం. కాంతమ్మ సంబర పడింది—రామనాథం సంతోషించాడు. వీధి వాకిలి లోకి రాగా శేషాచలానికి చంద్రశేఖరం కనిపించాడు కొన్నళ్ళ అమాటా ఈమాటా మాట్లాడి—

"మా తమ్ముడి కూతుర్ని నీకు ఇస్తామంటు న్నారు—చేసుకుంటావేమిటోయ్?" అన్నాడు శేషాచలం.

ఈ మాటకు చంద్రశేఖరం ఎగిరి గంతు వెయ్యబోయి—మామూలుగానే కూచున్నాడు!

"ఏమయ్యా?" అన్నాడు శేషాచలం మళ్ళీ చంద్రశేఖరం మాట్లాడలేదు.

"నువ్వు ఇదివరకు మా దృష్టిలో వున్న వాడివేనట—ఇవాళ ఆ సమయం కలిసి వచ్చింది. ఇంతకూ మనం కలుసుకున్న వేళా విశేషం అటువంటిది. ఏం?" అన్నాడు.

"సరే, మా నాన్నగారికి రాసి......" అన్నాడు చంద్రశేఖరం.

"అంతా నీయిష్టమే అన్నాట్లగా. వివా హత్వే విశేషం మనకూలో వేరు లేదుగా!"

"అవునను కోండి. మరి మా పెద్దవాళ్ళకు కూడా రాస్తే మంచిదికదా!"

"అయ్యయ్యో తప్పకరాయి నాయనా! అదే కావలసింది." అన్నాడు రామనాథం.

శేషాచలం తృప్తి పడ్డాడు—రామనాథం సంతోషించాడు—కాంతమ్మ మురిసి పోయింది—చంద్రశేఖరం చిరునవ్వు నవ్వాడు—వికే వాతమాత్రం అక్కడ కనిపించలేదు అతని మనసులో ఏముందో మరి!

చంద్రశేఖరం ఎదురుగు మ్మంలోకి చూశాడు—చందమామల్లే వెన్నెల చిలు కుతూ లీల అతనికి కనిపించింది. ఒక్క క్షణం నాలుగు కళ్ళు కలుసుకుని—వెంటనే సిగ్గుపడిపోయినై!





## బెంగాలీ చలనచిత్రం

(75 వ పేజీ తరువాయి)

ఉదాత్త ప్రణయం, కావ్య మాధుర్యం తొణి కిస లాడుతూంటాయి. మంచి కథా, మంచి తారాగణమూ ఉంటే నరేష్ మిత్ర, సుశీల్ మజుందార్, నీరేన్ లాహిరీ, చిత్తబోస్, అగ్రదూత్ విజయవంత మయిన చిత్రాలే తీస్తారు.

బెంగాలీ చిత్రరంగంలో అందరికీ ఒకటే గడు సమస్య. రకరకాల మనస్తత్వాలు గల ప్రేక్షక బాహుళ్యాన్ని వరసబెట్టి ఏళ్ళ తర బడి ఎలా ఎలా వినోదింప చేయడమా? అని.

ప్రజలలోని నైరాశ్యము, వారిభావాల్లోని, జీవితాల్లోని నిస్పృహా తరుచుగా చిత్రాల్లో ప్రతిఫలిస్తూనే ఉన్నాయి. కాని ఈ నిరాశా నిస్పృహాల్లోంచి బయటపడేసే ఆశా జ్యోతి తను వేలంవెర్రిగా ఎగబడి చూసే చలనచిత్రాల్లో ఎక్కడన్నా సాక్షాత్కరిస్తుం దేమోనని ప్రతి ప్రేక్షకుడూ ఎదురు చూస్తాడు. నేటి చలన చిత్రానికి రెండు బాధ్యతలున్నాయి: వ్యక్తిని కేంద్రంగా తీసు కుని సంఘ జీవితాన్ని ప్రతిబింబించడం ఒకటి. ప్రేక్షకుని అంతరాంతరాల్లో ఆనం దానుభూతిని కలిగించడం మరొకటి. ఈ ఆనందానుభూతి గనక లేకపోతే చలన చిత్రం ఎన్నడూ ప్రజలను ఆకర్షించలేదు. మరి పరస్పరభిన్నమైన ఈ రెండు బాధ్యత లను ఎలా నిర్వర్తించడం, ప్రేక్షకునికి వినో దమూ, మానసిక సంతృప్తినీ ఎలా సమ కూర్చడం అన్నదే నేటి బెంగాలీ చలనచిత్ర కారుల పెద్ద సమస్య. అయితే వీరు ఈ సమస్యను ధైర్యంతో, ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొంటున్నా రనడం సత్యదూరం కాదు.



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad